# మంగళ సౌభాగ్య చిహ్నం




**విటెక్స్** 48 సంవత్సరములుగ మీ
నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600 033

ఇండియాలోని గుమాస్తా కన్నా అధికంగా ఉండి ఉండదు అంతా విఫలమైతే మనం ఆ వ్యక్తిని 'జాట్' అంటాం జాట్ అవడమే నేరం అయినట్టు మన ప్రమేయం లేకుండానే మనం ఏదో ఒక కులానికి చెందిన వారమే కమ్యూనిస్టు నాయకులు అంతా బ్రాహ్మణులే కావచ్చు నెహ్రూ బ్రాహ్మణుడే వాళ్ల రాజకీయాలకీ కులానికీ సంబంధం లేదన్న వాస్తవం మాదిరి గానే 'జాట్' కులస్తుడైన తికాయిత్ విషయంలో కూడా ఆయన చేస్తున్నదానికీ ఆయన కులానికీ సంబంధంలేదు

స్వాతంత్ర్యా నంతరం రైతుల పరిస్థితి ఎలా ఉందో మనచుట్టూ ఉన్న దానిని బట్టి చూస్తే తేట తెల్లమవుతోంది రైతులు పండించే వాటిలో ఎన్నింటికో మనం అధిక ధరలు చెల్లిస్తున్నాం అనేది వాస్తవం, కానీ రైతు కూడా ఫ్యాక్టరీ ఉత్పత్తులను ఎక్కువ ధర ఇచ్చి కొంటున్నాడు స్వాతంత్ర్యం వచ్చిన మూడు సంవత్సరాల అనంతరం 1950-51, నాటికి పట్టణాలలోని ఒక వ్యక్తి సగటు ఆదాయం ఒక రైతు ఆదాయం కన్నా ఒకటిన్నర రెట్లు అధికం ముప్పయి ఏళ్లలో, అంటే 1980-81లో ఇది మూడింతలయ్యింది వ్యత్యాసం బాగా పెరిగి పోతూనే ఉంది ఇంకొక నాలుగయిదు సంవత్సరాలలో ఇది నాలుగింతలు అవవచ్చు అంటే పట్టణ వాసి నెలసరి సగటు రాబడి వెయ్యి రూపాయలయితే రైతు లేదా రైతు కూలీ నెలసరి రాబడి కేవలం రు 250/- ద్రవ్యోల్బణం లెక్కకు తీసుకోకుండా చూపిన అసలయిన లెక్కలివి వాస్తవ ద్రవ్యరూపంలో తీసుకుంటే ఈ వ్యత్యాసం ఇంకా ఎక్కువగా, ఆరు లేక ఏడింతలుండవచ్చు బహుశా కొన్ని లాటిన్ అమెరికా దేశాలలోను లేదా ఫిలిప్పీన్స్ వంటి బనానా రిపబ్లిక్‌లలోనూ తప్ప ఇంకెక్కడా ప్రపంచంలో ఈ విధంగా లేదు బనానా రిపబ్లిక్‌లు అంటే ఆదేశాలలో అరటి పండ్లు పండించే వ్యక్తి అవితినే స్తోమత లేని స్థితిలో ఉన్న దేశాలు

అధునీకరణ పారిశ్రామి కరణ అనే పేరుతో 1930లో సోవియట్ రష్యాలో స్టాలిన్ అండ్‌కో ఏమి చేసిందో భారతదేశంలో నెహ్రూ అదే చేసారు ఇది ఎవరికి లాభదాయకం? రైతులను దగ్గరలోని కాన్సెంట్రేషన్ శిబిరానికి తీసుకు వెళ్ళి కాల్చి చంపగా సోవియట్ రష్యాలో నూతన పారిశ్రామిక ధృక్పథం ఉన్నవారికి అది లాభించింది భారత దేశంలో మన కిష్టంలేని వారిని వదులుకోవడానికి మన మార్గం మనకి ఉంది మనం వారిని తిండి పెట్టకుండా చంపుతాం, ఆంధ్రప్రదేశ్‌లో అనేక మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు ఒరిస్సాలోని కలహండీలో వందలమంది స్త్రీ, పురుషులు ఆకలి చావులు చచ్చారు పల్లెలలో కుటుంబాలుకి కుటుంబాలే ఆత్మహత్యలు చేసుకుంటున్నట్టు మనం నిత్యం చదువుతున్నాం రాజీవ్ గాంధీ తన మందీ మార్బలంతో హెలికాప్టర్‌లో సురక్షితంగా లక్నోకి వెళ్లి గుమిగూడిన ప్రేక్షకులకు పరిస్థితులు ఎప్పుడూ బాగా ఉండవంటూ ఉపన్యాసాలిస్తున్నారు నెహ్రూలకు, గాంధీలకు అవి బాగుపడని పరిస్థితులుగా కనిపిస్తున్నాయి కానీ నా ఉద్దేశ్యంలో వారి రోజులు దగ్గర పడ్డాయి సోవియట్ రైతులు కూడా మొదట్లో ఓడిపోయారు కానీ గోర్బచేవ్ పార్టీ వారు ఇప్పుడు వారి వెనుక ఎలా పరుగులు తీస్తున్నారో చూడండి వాళ్ల బూట్లను నాకినంత పని చేస్తున్నారు □

## ప్రజానాయకులు

ప్రజాస్వామ్య
విలువల పట్ల విముఖులై!
ప్రజాధనంతో ప్రజల
ఓట్లు కొనేందుకు సుముఖులై!
ప్రజావేదికలపై శుష్క
వాగ్దానాల వాచస్పతులై!
దిగజారే ప్రజానాయకులు
పరిష్కరించలేరెప్పటికీ
ప్రజల సమస్యలు!
పరిరక్షింప లేరెన్నటికీ
మానవతా విలువలు!!

–జ్వాలా గోపీనాథ్



ం ఉట్టిపడేలా చేసే లిరిల్ తాజాదనం.




లిరిల్

తాజాదనపు సబ్బు

వళ్లు పులకరింపజేసే నిమ్మకాయల తాజాదనంతో.

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు : (1938-1972)

20.5.88; 27.5.88

శ్రీ విభవ నామ సం. అధిక జ్యేష్ఠ శు. పంచమి శు. ఏకాదశి

**సంపుటము 80 : సంచికలు 39; 40**

ముఖ్య సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు :

**మతుకుమల్లి మాధవరావు**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 3.00 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 87.10 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 174.20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక






### "ముఖచిత్రం"

పసిడి కాంతుల నగుమోములో
పసివాడని పసితనం
కలువ కనుల చూపులో
నిండైన చిలిపితనం
నునుపైన చెక్కిలిపై
విరబూసిన సిగ్గు మందారం
అరవిరసిన చిరునగవుతో
మధువు లొలికే అమృతాధరం
ఆకుచాటు మొగ్గలా
అరచేతి నానుకున్న చుబుకం
అమాయకతకు ప్రతీకైన
ముచ్చటయిన రూపం
వెరసి 'భానుప్రియ' ముఖచిత్రమైన
ఆంధ్ర సచిత్ర వార పత్రిక
పాఠకులను అలరించిన తీరు అద్భుతం.

–మంతెన విజయలక్ష్మి, విజయవాడ

### సీరియల్

ఇన్‌వెస్టిగేటివ్ రైటర్స్‌లో ఒకరయిన చల్లా సుబ్రహ్మణ్యం గారి "పవిత్ర పాపి" కొత్త సీరియల్ చదువుతుంటే ప్రారంభంలో నే చాలా ఇంట్రస్టింగ్‌గా వుంది. ఇటువంటి సీరియల్‌ను అందిస్తున్న రచయితకి నా ధన్యవాదాలు. ముందు ముందు కూడా ఈ సీరియల్ ఎంతో సస్పెన్స్‌తో ముందుకు సాగాలని ఆశిస్తూ... –యం. విశ్వ, ఆదోని

★ ★ ★

'పవిత్రపాపి' కొత్త సీరియల్, ఇంత వరకు చల్లా సుబ్రహ్మణ్యం గారు వ్రాసిన నవలల్లో కల్లా చాల బాగుంది. రాకా లాటి ఒక్క వ్యక్తి వున్నాచాలు ఈ సమాజం బాగుపడటానికి.

–చలపాక ప్రకాష్, విజయవాడ

★ ★ ★

సరికొత్త సీరియల్ 'పవిత్రపాపి' ప్రారంభంలో నే అత్యంత ఆసక్తిని కల్గించింది. రాకా పాత్ర పోలీసుల్ని, ప్రభుత్వాన్ని గడగడలాడించడం, ఫస్ట్ ఇష్యూలో నే దేదీప్య రాకాని ప్రేమించడం వండర్‌ఫుల్. రచయితకు అభినందనలు–

–హిమబిందు, దోర్నకల్

★ ★ ★

"పవిత్రపాపి" సీరియల్ ప్రారంభంలో నే మమ్ములను ఆకట్టుకొన్నది. రచయితకు మా హృదయపూర్వక అభినందనలు.

–కె. ఎన్. కె. శేఖర్‌బాబు, మైలవరం


(78 వ పేజీ చూడండి)

సీరియల్






మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

శనివారం వుదయం సుబ్బలక్ష్మి జుట్టుకి నువ్వుల నూనె బాగా పట్టించి తలంట సాగింది ఆమె తల్లి. బాత్ రూంలోకి వెళ్ళి వంటికి నూనె, తర్వాత సున్నిపిండి రాసుకుంటూ సుబ్బలక్ష్మి వూహల్లో తేలసాగింది.

ఆదివారం నిశ్చితార్థం, మరో నెల్లో వినాయకరావు బావతో పెళ్ళి అయిపోతాయి. ఆ తర్వాత హైదరాబాద్‌లోని ఓ ఏడంతస్థుల మేడలో, ఏడో అంతస్థులోని అపార్ట్‌మెంట్‌లో కాపురం. రాత్రి పడక గదిలో మంచం మీంచి కిటికీలోంచి బయటకి చూస్తే దీపాలు వెలిగే హైదరాబాద్ నగరం ఎంతో సుందరంగా కనిపిస్తుంది. పక్క నిండా, తల నిండా మల్లెపూలుతో, తెల్ల చీరలో, తమలపాకుల చిలకలతో తను రెడీ అవుతుంది.

వినాయకరావు ఆఫీసు పని ఇంటికి తెచ్చుకుని, ఆ ఫైల్స్‌తో కుస్తీ పడుతుంటాడు. తను టేప్ రికార్డర్ ఆన్ చేస్తుంది. ఘంటసాల 'ఎంత హాయి ఈ రేయి, ఎంత మధుర మీ హాయి..' అని సుశీలతో కలిసి పాడుతాడు. తను ఓ నిముషం దాకా చూసి, వినాయకరావు రాకపోతే వాల్యూం పెంచుతుంది.

**జరిగిన కథ– 10:** ఆదిలక్ష్మి, వినాయకరావులు మనసులు ఇచ్చి పుచ్చు కుంటారు. సుబ్బలక్ష్మికి వినాయకరావు మనసు తెలిసి పోతుంది. ఆదిలక్ష్మి బావ కామేశ్వరరావుతో ఆమెకి జరగబోయే నిశ్చితార్థాన్ని తప్పించే ఆలోచన చెప్పమని శాస్త్రిని అడుగుతాడు వినాయకరావు. శాస్త్రి సలహా మేరకు తండ్రి దాంబికేశ్వరరావుకి సుబ్బలక్ష్మి ప్రియుడు రాసినట్లు ఒక ఉత్తరం రాసేస్తాడు వినాయకరావు. అది చాలక సుబ్బలక్ష్మి తన ప్రియుడికి అంద చేసిన ఫోటో అంటూ సుబ్బలక్ష్మి ఫోటోని తండ్రికి పంపిస్తాడు. అవి చూసి డాంబికేశ్వరరావు, చాముండేశ్వరి సుబ్బలక్ష్మిపై మండిపడతారు.

తగ్గించమని ముందు గదిలోంచి అరుస్తాడు. తను ఇంకా పెంచుతుంది.

చేతిలో పెన్నుతో వచ్చి కోపంగా చెప్తాడు–

"అవతల నేను పని చేసుకోవాలా వద్దా?"

"బావా నీకు జీతం ఇచ్చేది ఆఫీసు వేళల్లో పని చేయడానికి. ఆ తర్వాత ముఖ్యంగా రాత్రిళ్ళు నీవు చేయాల్సిన పని ఇంకోటుంది. అందుకు జీవితాంతం నీకు సరిపడే జీతం మా నాన్న కట్నం క్రింద ఇచ్చారు" చెప్తుంది తను.

వినాయకరావు మొహంలో కోపం అధికం అవుతుంది.

"అబ్బబ్బ. నీ వెధవ వాగుడు కట్టిపెట్టు"

తను లేచి వినాయకరావు దగ్గరకి వెళ్ళి చేతిలోని పెన్ను అందుకుని పక్కన పెట్టి అతని చేతులని తన నడుం చుట్టూ వేసి చెప్తుంది.

"పిచ్చి బావ. లక్ష్మిని మర్చిపోలేక పోతున్నావా? నా కళ్ళల్లోకి చూడు. నీ ప్రతిరూపం అక్కడ కనబడటంలా?"

బాత్‌రూం తలుపు బాదిన చప్పుడుతో సుబ్బలక్ష్మి ఇహంలోకి వచ్చింది.

"ఎవరు?" అడిగింది.

"గంటసేపైంది బాత్‌రూంలోకి వెళ్ళి. ఏం చేస్తున్నావ్?" తల్లి కంఠం వినపడింది.

"స్నానం చేస్తున్నాను"

"త్వరగా కానివ్వు. నీళ్ళు చల్లారిపోయి వుంటాయి ఈపాటికి."

సుబ్బలక్ష్మి నీళ్ళ కాగులో వేలుంచి చూసింది. చల్లగా చల్లారిపోయాయి.

"చల్లారలేదులే" అబద్ధం ఆడింది.

స్నానానికి వుపక్రమించింది. మరో సీన్‌ని స్నానం చేస్తూ వూహించుకుంది. ఆ సీన్‌లో బాత్‌రూం పైన ఏస్‌బెస్టాస్ రేకులు, పెచ్చులూడే గోడలు లేవు.

లేత గులాబి రంగులో వున్న టైల్స్ గోడలకి, నేల పైన. ఆ టైల్స్ మధ్య వున్న

## మీ పాపాయికి ఇవ్వండి కూరగాయలలోని మంచి పుష్టి



ముందుగానే వండిన

# ఫారెక్స్®-వెజ్




### 6 నెలల నుంచి

క్రొత్త ఫారెక్స్-వెజ్ విటమిన్లు సమృద్ధిగా గల కాయగూరలు - క్యారట్లు, టమాటాలలోని మరియు పెసరపప్పులోని సహజమైన పోషణ గుణములతో కూడినది.

ముందుగానే వండినది, కనుక మీ పాపాయి యొక్క సున్నితమైన జీర్ణశక్తికి అనుకూలమైనది.

**ఫారెక్స్-పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

టబ్ నిండా వేడినీళ్ళు, సబ్బు నురగ ఏ సినిమానో- గుర్తు రాలేదు గాని ఆ టబ్‌లోని జయసుధ గుర్తు వచ్చింది సుబ్బలక్ష్మికి జయసుదని వూహాపథంలో ఆ టబ్‌లోంచి బయటకి పంపేసి తను కూర్చుంది వినాయకరావుని కూడా లాక్కొచ్చింది తను వినాయకరావు వీపు రుద్దుతుంటే అతనంటాడు

నీవు దేవతవి సుబ్బు ఇలా సబ్బు రుద్దుతుంటే నా వీపు ఏమోమో అయిపోతోంది ఇంత కాలం 'లక్ష్మి, లక్ష్మి' అంటూ కలవరిస్తూ మూసుకు పోయిన నా కళ్ళని తెరిపించావు ఐ లవ్ యూ

తను సిగ్గుతో, తన్మయత్వంతో అతని కౌగిల్లో వదిగిపోతుంది

ఇంతలో కాలింగ్ బెల్ మోగింది

ఎవరో చచ్చారు వదలండి అంటుంది తను

ఆదివారం మనింటికి ఎవరొచ్చినా అపరాదుల కింద లెక్క లేవను కాసేపు బెల్లు కొట్టి కొట్టి మనం లేవనుకుని వెళ్ళిపోతారు అంటాడు వినాయకరావు

మళ్ళీ తలుపు మీద దబదబ చప్పుడు వినిపించింది

'ఏమైంది మళ్ళీ?' తల్లి కంఠం

'వచ్చేస్తున్నా

రా ఇంకా చాలామంది స్నానం చేయాలి "

ఒక్క క్షణం అని జవాబు చెప్పి, మనసులో విసుక్కుంది. త్వరగా పెళ్ళి చేసుకుని మన బాత్‌రూంలోకి తీసుకెళ్ళిపోబావా ఇక్కడ ఇలా వేగలేను

సరిగ్గా ఆ సమయంలో వాళ్ళింటి సందు తిరిగింది ఒంటెద్దు బండి

"నే చెప్పిందంతా గుర్తుందిగా జాగ్రత్త' భార్యని హెచ్చరించాడు ఆ బండిలో వున్న డాంబికేశ్వరరావు

బండి షణ్ముగరావు ఇంటి ముందు ఆగింది. ఇద్దరు దిగి లోపలకి సంచీలతో నడిచారు

"అమ్మగారు చుట్టాలొచ్చారు' అరిచాడు పనివాడు వాళ్ళిద్దర్నీ చూసి గుర్తుపట్టి

"ఇదేనా రావడం?" అడిగాడు షణ్ముగరావు నవ్వుతూ ముందు గదిలోకొచ్చి

"అవును.'

"వినాయకం?" అడిగాడాయన

"ముందు స్నానం చేసి రా అన్నయ్యా" చెప్పింది చాముండేశ్వరి

ఆయన లోపలకి వెళ్ళాక, చాముండేశ్వరి, వదిన కామేశ్వరి బయటకి వచ్చి, వాళ్ళని చూసి ఆదరంగా చేతుల్లోని సంచులనందుకుని చెప్పింది

"రండి ఎప్పుడు రాక? అబ్బాయి రాలేదా?"

"రాలేదొదినా. అంతా కులాసానా!" అడిగింది చాముండేశ్వరి

"అహ రేపే ఆదివారం కదా? నిశ్చితార్థానికి రేపు దివ్యమయిన ముహూర్తం" చెప్పింది కామేశ్వరి

'ముందర స్నానం చెయ్యాలి. విషయాలు తర్వాత" చెప్పాడు డాంబికేశ్వరరావు

ఎండలో కూర్చుని తల నీలాలు ఆరబెట్టుకుంటున్న సుబ్బలక్ష్మిని దూరం నించే చూసింది చాముండేశ్వరి. ఏం తెలీనట్టు ఎంత అమాయకంగా కూర్చునుంది ఇంకానయం అనుకుందావిడ మనసులో.

భోజనాలకి కూర్చునే దాకా నిశ్చితార్థం విషయం మళ్ళీ ఎవరు కదపలేదు

అన్నం కలుపుకున్నాక షణ్ముగరావు అడిగాడు.

"వినాయకం రేపు వస్తున్నాడా?"

"రావడం లేదు" చెప్పింది చాముండేశ్వరి.

"అదేం? రేపు వుదయం పదిన్నరకి కదా ముహూర్తం?"

"చిన్న ఇబ్బంది వచ్చింది" చెప్పాడు డాంబికేశ్వరరావు

"ఏమిటి?"

"ఈ మధ్య జాతకాలు అద్భుతంగా రాసే సాముద్రిక శాస్త్రవేత అయిన ఒకాయన పరిచయం అయ్యాడు పేరు వెంకటావధాని ఆయన తాత, ముత్తాతల నించి సాముద్రికం వృత్తిగా చెప్తున్నారు ఎన్టీరామారావు కూడా వెంకటావధాని దగ్గరే తమ పిల్లల జాతకాలు రాయించారుట. ఉన్నది వున్నట్టు, లేనిది లేనట్టుగా మొత్తం చెప్తాడు."

"ఇంతకీ విషయం ఏమిటి?" అడిగాడు షణ్ముగరావు అనుమానంగా చూస్తూ.

"మన పిల్లలిద్దరి జాతకాలు కూడా ఆయనకి చూపించాను ఫీజు ఎక్కువే వంద తీసుకున్నాడు '

"ఏమన్నారాయన?" అడిగింది కామేశ్వరి

'ఇద్దరి జాతకాలు ఏమాత్రం కుదరవన్నారు ఉపపద మందు వినాయకానికి శని వుందిట మరీ నాలుగేళ్ళ దాకా పెళ్ళి మాటే తల పెట్టద్దన్నాడు ఈ నాలుగేళ్ళు వాడికి ఏల్నాటి శని ఆఖరి భాగంట '

"వాడి పిండాకుడు వాడి బొంద అందుకని పెళ్ళి మానేస్తామా? చెప్పాడు షణ్ముగరావు కోపంగా

"అంతేకాదు అసలు, సుబ్బులు, వినాయకం జాతకాలే కుదర లేదట ఎలుక పిల్లికి పెళ్ళి చేస్తే వాళ్ళ సంసారం ఎలా వుంటుందో అలా వుంటుందన్నాడు

"అవునుట చెప్పింది చాముండేశ్వరి

'ఈ రెండు జాతకాల వాళ్ళకి పెళ్ళయితే అమ్మాయికి ద్వితీయ కళత్రం అవుతుందిట '

'ఆ?!' భయంగా చెప్పింది కామేశ్వరి

'ఆ చెప్పాడు డాంబికేశ్వరరావు



"జాతకాలు అంతలా కలవనప్పుడు ఈ పెళ్ళి మానుకోవడం వుత్తమం అని ఆయన సలహా ఇచ్చాడు చెప్పింది చాముండేశ్వరి

'ఇంతకీ మీరేం నిర్ణయించినట్టు?" అడిగాడు షణ్ముగరావు

"వెంకటావధాని అంతటి పెద్దాయన ఇంత చెప్పాక ఆయన మాట ప్రకారం ఈ పెళ్ళి చేయకపోవడం మంచిదని నా అభిప్రాయం ఆ తర్వాత మీ ఇష్టం, వినాయకం ఇష్టం" చెప్పాడు డాంబికేశ్వరరావు.

షణ్ముగరావు అకస్మాత్తుగా సీరియస్ అయిపోయాడు నిగ్రహించింది ఆయన భార్య కామేశ్వరి అంతేకాదు ఆయనకి విపరీతమయిన కోపం వచ్చిందని కుడాగ్రహించింది ఆయన కోపానికి గుర్తు అన్నం ఎక్కువ తినడం

చాలా మంది కోపం వస్తే అన్నం మానేస్తారు షణ్ముగరావు అందుకు వ్యతిరేకం ఇతరులకి మిగల్చకుండా మొత్తం తినేస్తాడు కోపం వస్తే

'ఇంకాస్త అన్నం, కూరలెయ్యి చెప్పి ఆయన గబగబ తినేయంత్రంలా నిశ్శబ్దంగా తినసాగాడు

అన్నయ్య గురించి తెలిసిన చాముండేశ్వరి గ్రహించి తన భర్త చెవిలో ఆ సంగతిని వూదింది దాంతో అంతా గప్‌చిప్ అయిపోయారు భోజనానంతరం మధ్య గదిలో మంచాలేసుకొని పడుకున్నారు డాంబికేశ్వరరావు, చాముండేశ్వరి.

"అమ్మో ఆకలేస్తోంది అన్నం పెట్టవే అడిగింది సుబ్బలక్ష్మి

"లేదమ్మా మీ నాన్నగారు అంతా తినేసారు మళ్ళీ వండుతున్నాను చెప్పింది కామేశ్వరి

'నాన్నగారికి కోపం వచ్చిందా? అడిగింది సుబ్బలక్ష్మి వెంటనే

"అవునమ్మా

"ఎందుకు?"

'మీ మామయ్య, అత్తయ్యల వల్ల

'ఏం చేసారు వాళ్ళు?'

'నీకు, వినాయకానికి పెళ్ళి చేయడానికి జాతకాలు అడ్డు వస్తున్నాయని చెప్పారు'

'ఆ? నాకు వినాయకం బావకి పెళ్ళి కాదా?' అడిగింది సుబ్బలక్ష్మి వులిక్కిపడి.

"అనే అంటున్నారు వాళ్ళు

'ఎందుకని?

చెప్పాగా జాతకాలు కలవలేదట చేస్తే వినాయకానికి ప్రమాదమట

అసలు వాళ్ళని జాతకాలు ఎవరు చూడమన్నారు?

ఆ ప్రశ్నకి సమాధానం చెప్పలేదు కామేశ్వరి

నాకన్నం వద్దు చెప్పింది సుబ్బలక్ష్మి వెంటనే

అదేమే? ఇప్పుడే ఆకలన్నావు అగింది కామేశ్వరి కూతుర్ని

నాకాకలిలేదు

అన్నం తినకుండా ఆకలి ఎక్కడికి పోయింది?

నాకదంతా తెలీదు అన్నం వద్దు

మీ నాన్నగారిలా నీకు కోపం వచ్చిందా?

నాన్న మామయ్య కోరినంత కట్నం ఇవ్వనన్నాడా? అడిగింది సుబ్బలక్ష్మి



# నాటి పెళ్ళి ముచ్చట్లు

నా వివాహమయిన 1944 సంవత్సరం నాటికే అయిదు రోజుల పెళ్ళి పద్ధతి ఆగిపోయినా ఎందువల్లనో నా వివాహం మాత్రం అయిదు రోజులు చింతలపూడిలో జరిగింది. మగ పెళ్ళివారు మధ్యాహ్నం, రాత్రి భోజనాలకు ఆడ పెళ్ళివారింటికి వెళ్ళేవారు. ఉదయం, మధ్యాహ్నం ఫలహారాలు ఆడపెళ్ళివారు మగ పెళ్ళివారి విడిదికి పంపేవారు. ఇదంతా చూస్తుంటే మా నాన్నగారికి ఖంగారు పట్టుకొంది.

## విందు - మందు!

రెండుపూట్ల బరువైన పెళ్ళి భోజనం రెండుసార్లు భారీగా టిఫిన్ తీసుకొంటే అజీర్ణాలు పట్టుకొంటాయేమోనని. అంతే గాకుండా మేం మా వూరు నిడదవోలు వెళ్ళిన కొద్ది రోజులలో ఒక అమ్మాయి పెళ్ళి కూడా చేయవలసి వుంది. అందుకని మధ్యాహ్న ఫలహారాల కావిడ వచ్చిన వెంటనే రెండు రకాల చూర్ణాలు విడిదిలో అందరికీ యిచ్చేవారు. మేమంతా ఆయన యివ్వగానే తీసుకొని, మ్రింగి తర్వాత



ఆ సంగతే మర్చి పోయేవారం. కాని మా పెద్ద బావ కుండబద్దల కొట్టినట్టు మాట్లాడే మనిషి. మా నాన్నగారి దగ్గర చనువూ ఎక్కువే. అందుకని "మామ్మగారూ రాదలచిన రోగం మీ చూర్ణాలవల్ల ఆగుతుందంటారా?" అనేసరికి, ఇతను సరిగా తీసుకొంటాడో, తీసికోడో అని మా నాన్నగారికి అనుమానం వచ్చి తన ఎదురుగా కూర్చోబెట్టుకొని బలవంతంగా మ్రింగించేవారు. మాతో పెళ్ళికి వచ్చిన మరో బంధువు వుండేవాడు. మా నాన్నగారు చూర్ణపు సీసాలు బైటికి తీసిందే తడవుగా "ఈనాడు ఈ చూర్ణాలున్నట్టు ఎవరికి తెలుసు? తెలిస్తే మాత్రం డబ్బు ఖర్చు చేసి కొనేదెవరు? కొంటేమాత్రం శ్రద్ధగా ఆయనలా అందరికీ యధావిధిగా పంచిపెట్టే దెవరు?" అంటూ పొగడ్తలు మొదలు పెట్టేవాడు. అతను తన ఉద్దేశాన్ని మా బావలాగ కాకుండా - అర్థం చేసుకొన్నందుకు మా నాన్నగారు సంతోషించేవారు. ఒకరోజు నా కిచ్చిన ఔషధం సేవించి చేయి కడుక్కోందామని విడిది పెరట్లోకి వెళ్ళాను. అప్పటిదాకా వంధిమాగధ పొగడ్తలు సాగించిన ఈ మహానుభావుడు తన కివ్వబడిన రెండు పొట్లాలను చెత్త డబ్బాలో పార వేస్తున్నాడు. ఆ ఔషధాలమీద నమ్మకంలేని ఆ ఘనుడు మా నాన్నగారి ఎదుట దంచిన లెక్చర్లనూ, చేసిన పనినీ తల్చుకొంటే నవ్వూ, కోపం కూడా వచ్చాయి.

ఆర్. యన్. శర్మ, హైదరాబాద్

## సినిమాకోసం పాట్లు!

మా పెళ్ళి ముహూర్తం తెల్లవారు ఝామున 3-52 నిమిషాలకు కావటం మూలాన ఆహూతుల

## వినాయకరావు పెళ్ళి

కొద్ది క్షణాలాగి.

"అసలు కట్నం మాటే రాలేదు."

"నాకు జాతకాల మీద నమ్మకం లేదు. బావనే చేసుకుంటానని చెప్పు అత్తయ్యకి."

"మన నమ్మకం ఒకటే కాదుగా ముఖ్యం. అన్నం వడ్డిస్తాను. ములక్కాడల కూర చేసాను."

"ములక్కాడల కూర కలుపుకుని కొద్దిగా తింటాను. మొత్తం అన్నం తినను" చెప్పింది సుబ్బలక్ష్మి మెత్తబడి.




ఆ రోజు సాయంత్రం నిద్ర లేచాక సుబ్బలక్ష్మి అత్తయ్యకి, మామయ్యకి ఇత్తడి గ్లాసులో కాఫీ తీసుకెళ్ళి ఇచ్చింది.

"మీ ఇద్దరి జాతకాలు కుదరలేదే" చెప్పింది అత్తయ్య.

"అమ్మ చెప్పింది."

"నీ ప్రాణానికి హాయిగా వుంది కదా?" అడిగాడు డాంబికేశ్వరరావు.

"ఎందుకుంటుంది?" అడిగింది.

"విజయవాడ ఈ మధ్య వెళ్ళావా?" అడిగింది చాముండేశ్వరి సుబ్బలక్ష్మిని.

"లేదు, ఏం?"

"ఏంలేదు. ఊరికే అడిగాను."

"అప్పుడెప్పుడో పెళ్ళికి వెళ్ళొచ్చాను. అదే ఆఖరుసారి."

"పాపం" చెప్పింది చాముండేశ్వరి.

"ఎందుకు పాపం అంటున్నావు?" అడిగింది సుబ్బలక్ష్మి.

"ఏం లేదు."

కామేశ్వరి పనివాడు రాములుతో తన బాధ చెప్పుకుంది.

"ఇంత కాలం సుబ్బులు పెళ్ళి గురించి నిశ్చింతగా వున్నాను. దగ్గర సంబంధం కదా అని ముచ్చటపడ్డాను. తీరా చూస్తే జాతకాలు కలవలేదన్నారు. అది కారణం అని నమ్మకం కలగడం లేదు నాకు."

"అదే కారణం అవచ్చు. మొన్న తాంబూలాలు తీసుకునే సమయంలో వినాయకం బాబు అలా పోలీసుల్ని కొట్టడానికి కారణం జాతకాల ప్రభావమే అయి వుంటుంది అమ్మగారు" చెప్పాడు పనివాడు.

"హెచ్చు కట్నంతో మంచి సంబంధం ఏదో వచ్చి వుంటుంది. అందుకని ముగ్గురు కలసి కూడబల్కొని ఈ అబద్ధం సృష్టించి వుంటారు."

"వినాయకం వుండేది పట్నంలో కదా. ఎవర్నో సినిమాల్లో లాగా ప్రేమించి

సౌకర్యార్థం "బుద్ధిమంతుడు" సినిమా ప్రదర్శనను ఏర్పాటు చేశారు మా మామయ్య. క్రొత్తగా కట్టిన గ్రామ పంచాయితీ భవనం నాకు విడిదిగా ఇవ్వబడింది.

బయట సినిమా మొదలయిన గుర్తుగా కలకలం! కుర్రవాళ్ళ కేరింతలు వినిపించ సాగాయి. నాకు మనసు నిలవటం లేదు. అసలే అక్కినేని అభిమానిని. దానికితోడు ఆ సినిమాలోని "వేయి వేణువులు మ్రోగే వేళా..." అన్న పాట నాకు ప్రాణం.




పెళ్ళి గెటప్‌లో ఉన్న నేను బయటకు వెళ్ళ కూడదని ఆంక్ష! ఎలా? నాలో నేను మధనపడు తుండగా కరెంటు పోయింది. అదే అదనుగా పెళ్ళి బొట్టు, బుగ్గ చుక్క తుడి చేసుకుని కోటు విప్పేసి మామూలు బట్టలలో బయటపడి సినిమా దగ్గరకు చేరుకున్నా. ఐదు నిముషాలలో కరెంటొచ్చింది. పావు గంటసేపు సినిమా తిలకించానో లేదో - "పెళ్ళికొడుకు కనిపించటం లేదు" అన్న వార్త గుప్పుమంది. సినిమా ఆపేశారు. కొంప మునిగిందని హడావుడిగా విడిది గృహం కేసి నడుస్తూ, నా కోసం వెతుకుతున్న నాన్న కంట బడ్డాను. అంతే! మెత్త మెత్తగా చివాట్లేసి మళ్ళీ పెళ్ళి దుస్తులు తొడిగించారు.

– పాట్నీడి చక్రరావు,
విశాఖపట్నం

★ ★ ★

## మరదలి మాయ చేష్ట!

నా వివాహం విశాఖజిల్లా పెందుర్తి గ్రామంలో జరిగింది, 1988 ఫిబ్రవరి 25న.

తూ. గో. జిల్లా కొత్తపేట నుండి ఫిబ్రవరి 25 ఉదయం 8 గం.లకు బయలుదేరి మధ్యాహ్నం 4 గం.లకు పెండ్లి కుమార్తె ఇంటికి చేరాము. ఫిబ్రవరి నెలతో వేసవి ఉష్ణోగ్రత వల్లనేమి, కొండల ప్రాంతం వల్లనేమి, విపరీత మైన వేడి, దాహం. ధాహంతో బస్సు దిగి, విడిది ఇంటిలోకి చేరితిమి. దాహంతో ఉన్న నాకు మా మరదలు రత్నకుమారి ఒక గ్లాసు రస్నా ఇచ్చింది. అతి వేగంగా త్రాగి దాహం తీర్చు



కొన్నాను.

కాగా ఆ చుట్టు ప్రక్కల వారు, నన్ను చూచుటకు వచ్చిన వారు, మా మరదలు, వారి బంధువులు నన్ను చూసి కడుపు ఉబ్బిపోయేలా విరగబడి నవ్వు కొంటున్నారు. "ఇదేమిటిరా వీళ్ళంతా నన్ను చూసి ఇలా నవ్వు కొంటున్నారు" అని నా మనసులో అనుకొన్నాను. కాని విషయం నాకు అర్థం కావటం లేదు. ఇంతలో ఒక ఆమె నన్ను చూడటానికి వచ్చి, పకపకా నవ్వుతున్న వారిని చూసి ఎందుకు అలా నవ్వు చున్నారని ఆవిడ నవ్వుతూ మరొకామెని ప్రశ్నించింది. పెండ్లి కొడుకుకు మరదలు గెంజి, ఉప్పు, రసనా కలిపి ఇచ్చింది. పాపం అతను త్రాగేసాడు. ఆ విషయం అతనికి తెలియదు, అందుకు మాకు నవ్వు వస్తుంది" అని ఆమె తెల్పడం, మళ్ళీ అందరూ నవ్వటం జరిగింది.

ఎన్. ఎస్. వి. రాజు, కొత్తపేట

వుంటాడు. ఆ సంగతి చెప్పలేక, ఈ మాట అని వుండచ్చు."

"కారణం ఏదయితేనేం? ఇప్పుడు దీనికి మంచి సంబంధం చూడాలి. ఈ మాఘ మాసంలోగా కుదరకపోవచ్చు. ఇంకో ఏడాదయినా పడుతుంది అన్నీ కుదిరి పెళ్ళి అవాలంటే" చిన్నగా నిట్టూర్చింది కామేశ్వరి.

"అయ్యగారు ఓ సారి హైదరాబాద్ వెళ్ళొస్తే వంద సంబంధాలు పట్టుకొస్తారు. పెళ్ళి ఇట్టే కుదిరిపోతుంది. సుబ్బులు కేమండి? బంగారు బొమ్మ కదా. ఒకతే కూతురు. లంకంత ఆస్తి."

"అందరికీ వినాయకం మన అల్లుడు వచ్చుతున్నాడని చెప్పామా? ఇప్పుడు కాదంటే ఎంత అవమానం. ఇలా నిలువునా ముంచేస్తారనుకోలేదు."

చాముండేశ్వరి రహస్యంగా డాంబికేశ్వరరావుతో చెప్పింది.

"సుబ్బులికి మన వినాయకాన్నే చేసుకోవాలని వున్నట్టుంది."

"నీకెలా తెలుసు!"

"ఇందాక నాతో ఇండైరెక్ట్‌గా చెప్పింది."

"మరి ఈశ్వరరావుతో తనువులు పంచుకోటాలేమిటట? అడిగావా?"

"అడిగి ప్రయోజనం లేదు."

"ఏ ఆడపిల్లయినా అలాంటి విషయం వప్పుకుంటుందా చెప్పండి. అందుకని అడగలేదు."

"అవును నిజమే."

సాయంత్రం చీకటి పడుతుండగా సుబ్బులు పనివాళ్ళ రాములుతో చెప్పింది.

"ఒరే రాములు. నాకు, వినాయకానికి పెళ్ళయ్యే మంచి ఆలోచన చెప్పరా. మా పెళ్ళికి నీకు కొత్త బట్టలు కుట్టిస్తాను."

"అసలు విషయం ఏమిటో తెలుస్తే కాని ఏ ఐడియా చెప్పలేనమ్మ" చెప్పాడు రాములు.

"అయితే అది కనుక్కునే వుపాయం చెప్పు."

"ఉపాయాలయితే చాలా వున్నాయి కాని అన్నీ డేంజర్‌వి."

"అంటే!"

"అది నా పనని తెలుస్తే నా వుద్యోగం వూడిపోతుంది."

"నీ వుద్యోగానికి నేను గ్యారంటీ. ఏదో ఒకటి చెప్పు" అడిగింది సుబ్బులక్ష్మి.

"చెప్తా – కాని ఇదినే నిచ్చిన ఐడియా అని పెద్ద వాళ్ళకి చెప్పకూడదు మరి" ఆలోచించి చెప్పాడు రాములు.



"అలాగే చెప్పను. ఏం చేయాలి?" అడిగింది సుబ్బలక్ష్మి ఉత్సాహంగా.

"ఎన్టీఆర్ పాండవవనవాసం మన టూరింగ్ టాకీస్ కొచ్చింది. దాన్ని చూడాలని వుందమ్మగారు."

"మాట మారుస్తావే ఐడియా చెప్పమంటుంటే?"

"మీ కర్మం కాలేదన్న మాట. నాకు పది రూపాయలిస్తే ఆ వుపాయం చెప్తాను."

"ఉండయితే. ఖర్చు లేకుండా పెళ్ళి కాదుగా."

లోపలకి వెళ్ళి ఓ పది రూపాయల కాగితాన్ని తెచ్చి రాములు కిచ్చి అడిగింది సుబ్బలక్ష్మి.

"ఇప్పుడు చెప్పు."

"సాయంత్రం మీ నాన్నగారు, డాంబికేశ్వరరావు తోటలోకి వెళ్తారు. వెళ్ళటో యే ముందు వాళ్ళిద్దరికి కొబ్బరినీళ్ళిస్తాను. అందులో ఓ మందు కలిపితే చాలు."

"ఏ మందు?"

"జిన్ అని. బజార్లో అమ్ముతారు అది కలపాలి."

"కలిపితే ఏమవుతుంది?"

"ఆ మందు ప్రభావంతో వున్నది వున్నట్టుగా లేనిది లేనట్టుగా ఇదరికీ మాట్లాడుకోవాలనిపిస్తుంది."

"అయితే ఆ మందు కలిపి ఇవ్వు."

"అది కొనడానికి డబ్బు కావాలిగా."

"ఎంత?"

"ఓ ఎభైరూపాయలు."

"తెస్తానుండు. ఖర్చు లేందే పెళ్ళి కాదుగా."

కాసేపట్లో ఎభైరూపాయల నోటుతో వచ్చి రాములు కిచ్చి చెప్పింది.

"కొబ్బరి బొండాలు దించి నీళ్ళు గ్లాసులోకి పోసేది నువ్వేగా. అందులో నువ్వే కలుపు."

"ఇది నా పనని మీరు ఎవరితో అనకూడదు."

"అనను. నా మీద వట్టు. సరేనా!"

"డబ్బు లిచ్చిన సంగతి కూడా చెప్పకూడదు."

"మా అమ్మమీద వట్టు. చెప్పను. నీవు పని కానీ. నీకింకో పది రూపాయలిస్తాను" చెప్పింది సుబ్బలక్ష్మి వుత్సాహంగా.

* * *

ఇంత కాలం సుబ్బులు మీ ఇంటి కోడలనుకున్నాం. ఇలా సంబంధాలు వెదకాల్సి వస్తుందనుకోలేదు" కామేశ్వరి తన ఆడపడుచుతో బాధగా చెప్పింది.

"అట్టే వెదకాల్సిన పనుండదులే" చెప్పింది చాముండేశ్వరి నర్మగర్భంగా.

ఇంత అకస్మాత్తుగా జాతకాలెందుకు చూపించారు? అడిగింది కామేశ్వరి కాస్సేపాగి.

"వెంకటావధాని మా వూరు వచ్చి మా ఇంట్లో బస చేసాడు. ఆయనేమో వద్దంటున్నా ఇద్దరి జాతకాలు చూసాడు."

"సుబ్బులుకి ఈ సంగతి తెలియగానే ఎంత దిగులు పడిందో చెప్పలేను" చెప్పింది కామేశ్వరి.

"నిజమే. ఏం చేస్తాం చెప్పు వదినా" చెప్పింది చాముండేశ్వరి. మనసులో అనుకుంది. ఆ మాత్రం నటించకపోతే ఎలా? ఈశ్వరరావు గురించి మేం వెళ్ళాక చెప్తుంది. వాళ్ళ పెళ్ళిలో అసలు విషయం చెప్తాను."

సాయంత్రం తోటకి బయల్దేరారు బావమరుదులిద్దరు.

"అయ్యా కొబ్బరిబొండాలు దించమంటారా?" అడిగాడు రాములు.

"వద్దు లేరా" చెప్పాడు డాంబికేశ్వరరావు.

ఆ తర్వాత ఇద్దరు తోటకి వెళ్ళిపోయారు. రాములుకి ఏం చేయాలో తోచలేదు. వాళ్ళ వెంట తోటకి వెళ్ళి నాలుగైదు సార్లు అడిగాడు మంచినీళ్ళు తాగుతారా అని.

"అక్కర్లేదు" చెప్పాడు షణ్ముగరావు. చీకటి పడుతుండగా రాములు వాళ్ళతో పాటు తోట నించి వచ్చాక అడిగింది సుబ్బలక్ష్మి రాముల్ని రహస్యంగా.

"నిజం చెప్పించే మందు తాగారా? ఏమన్నారు?"

"తాగలేదు. అసలేం తాగలేదు వాళ్ళు."

"అమ్మయ్యో! ఎలా మరి?"

"రాత్రి అన్నం దగ్గర వాళ్ళకి పెట్టే మంచినీళ్ళలో కలపడం ఒకటే మార్గం" చెప్పాడు రాములు.

"ఆ పని నేను చేస్తాలే. ఆ మందు నాకివ్వు" చెప్పింది సుబ్బలక్ష్మి.

క్వార్టర్ జిన్ బాటిల్ తెచ్చి చెప్పాడు రాములు చెరి సగం కలపమని.

"నాకు మాట రాకుండా చూడండి" చెప్పాడు.

"ఒట్టేసాగా ఇంక భయం దేనికి?"

రాత్రి భోజనాలు వడ్డించారు. డాంబికేశ్వరరావుతో అన్నీ మాట్లాడుతున్నాడు– కాని షణ్ముగరావు మళ్ళీ పిల్ల పెళ్ళి విషయం ఎత్తలేదు. ఆయన కోపం అందుకు కారణం. ఒకటి రెండు సార్లు సద్ది చెప్పడానికి డాంబికేశ్వరరావు ఆ విషయం. తెచ్చినా షణ్ముగరావు కట్ చేసేసాడు. శుభ్రంగా తోమిన ఇత్తడి గాసుల్లో మంచినీళ్ళని పోసింది సుబ్బలక్ష్మి. అందులో రెంటిలోని నీళ్ళని కొద్దిగా పారబోసి జిన్‌ని ఆ మేరకి సమానంగా కలిపింది.

మంచినీళ్ళ గ్లాసులని కంచాల దగ్గర వుంచింది. అక్కడ చిన్న పొరబాటు చేసింది సుబ్బులు. చూడటానికి గ్లాసులు కాని, గ్లాసులోని నీళ్ళు కాని ఒకే రకంగా వుండటంతో మంచినీళ్ళ గ్లాసేదో, మందు కలిపిన గ్లాసేదో పోల్చుకోలేక ట్రేని మరో వైపు నించి పట్టుకోవడంతో మందు కలిపిన రెండు గ్లాసులని తల్లి, అత్తయ్యల కంచాల ముందు, మామూలు మంచినీళ్ళ గ్లాసులని,తండ్రి, మామయ్యల కంచాల ముందు వుంచింది.

తనే స్వయంగా వడ్డించసాగింది. ఇద్దరు నీళ్ళెక్కువ తాగాలని తండ్రికి, మామయ్యకి నెయ్యి ఎక్కువ వేసింది.

"నీళ్ళదో మాదిరిగా వున్నాయి" చెప్పింది కామేశ్వరి కొద్దిగా తాగి.

"మా వూళ్ళో నీళ్ళు తియ్యగా వుంటాయి. నూతి నీళ్ళన్నీ ఒకే రకంగా వుండవుగా" చెప్పింది చాయిండేశ్వరి.

అన్నం తింటూ ఆడవాళ్ళిద్దరు మధ్య మధ్యలో మంచినీళ్ళు త్రాగుతూ ఆ గ్లాసులోని నీళ్ళని ఖాళీ చేసారు.

"నీళ్ళు బావున్నాయ్" కొద్దిగా పొయ్యమ్మా" అడిగింది చాముండేశ్వరి సుబ్బలక్ష్మిని.



బ్రూక్ బాండ్

# 3 రోజెస్ తృప్తి




## క్రొత్త మేలైన 3 రోజస్ టీ
## అధిక తృప్తి...అదనపు ఖర్చు లేకుండానే!




క్రొత్త 3 రోజస్ టీ
ఉత్తమ రంగు, ఎక్కువ చిక్కన, చక్కని రుచి
వీటి అపురూప మధుర సంగమం
మీకిస్తుంది 3 రోజస్ తృప్తి

**గొప్ప టీ... అత్యధిక తృప్తి**

## వినాయకరావు పెళ్ళి

అప్పటికే కామేశ్వరి రక్తంలోకి జిన్ ప్రవేశించి ఓ రకమయిన నిర్లక్ష్యం ఆవిడలో పేరుకోసాగింది అందుకు జీవితంలో మొదటిసారి మధ్యం తాగడం కాబట్టి చురుగ్గా పని చేసిందది

"మహా కొడుకుని కన్నావు లేవమ్మా మీలావు మంచి కొడుకుని వినాయకం కాకపోతే మరో బునాయకం నా కూతురికి దొరక్కపోదు చెప్పింది కామేశ్వరి

దాదాపు అలాంటి మానసిక స్థితిలో వున్న చాముండేశ్వరి వెంటనే సమాధానం చెప్పింది

"ఈ పెళ్ళి జరిగితే బునాయకం అయేది లేవమ్మా వినాయకం పని

మొగవాళ్ళిద్దరు వాళ్ళ వంక ఆశ్చర్యంగా చూసారు ఇద్దరి మొహాల్లో స్వల్పంగా మత్తు మాటలు తడబడుతున్నాయి ఆ మార్పుకి ఇద్దరికి ఆశ్చర్యం వేసింది

"ఎందుకయేది?' అడిగింది కామేశ్వరి

"మీ ఇంటి విషయాలు మా కన్నా బయటి వాళ్ళకే ఎక్కువ తెలుస్తున్నాయి నీకసలు బుర్ర లేదు చెప్పింది చాముండేశ్వరి

"ఈ ఆడపడుచులంతా ఇంతే నీ కన్నా గట్టి బుర్రే నాది చెప్పింది కామేశ్వరి

"ఏమిటది?" గద్దించాడు షణ్ముగరావు ఇద్దర్ని ఆయన మాటలు వాళ్ళ చెవి కెక్కలేదు

"నీ కూతురి సంగతి నీ కన్నా నాకే బాగా తెలుసు చెప్పింది చాముండేశ్వరి కవ్వింపుగా

"ఏం మాట్లాడుతున్నావో అర్థం అవుతుందా? డాంబికేశ్వరరావు తన భార్యని కోప్పడ్డాడు

'మీరూరుకోండి అసలు మా వదినకి ఆడపిల్లని ఎలా పెంచాలో రాదు చెప్పింది చాముండేశ్వరి మరి కాస్త మంచినీళ్ళు తాగి

'ఎందుకు రాదు' కోపంగా అడిగింది కామేశ్వరి

"వసే పెళ్ళికి విజయవాడ పంపించి వుండే దానివి కావు

"నా ఇష్టం నా కూతుర్ని కావాలంటే లండన్ కూడా పంపిస్తాను చెప్పింది కామేశ్వరి

"లండనే పంపుకుంటావో, గిండనే పంపుకుంటావో కాని నేనయితే వంటరిగా పంపను

"నువ్వసలు కుళ్ళు బోతువి. నీకు కూతురు లేదని చిన్నప్పటి నించి బాధ" చెప్పింది కామేశ్వరి

"మీ రిద్దరూ నోరు మూస్తారా లేదా?" అరిచాడు షణ్ముగరావు

నువు నోరు ముయ్ అన్నయ్యా" అని చాముండేశ్వరి అంటే "నా ఆడపడుచు వ్యవహారంలో మీరేం కల్పించు కోకండి' అన్నది కామేశ్వరి

మీ ఇద్దరికీ ఏమైంది?' అడిగాడు డాంబికేశ్వరరావు, ఆ మాట లనడానికి వాళ్ల ధైర్యానికి అబ్బురపడుతూ

మా వినాయకం అదృష్టం వల్ల ఈ పెళ్లి తప్పి పోయింది చెప్పింది చాముండేశ్వరి మత్తుగా జోగుతూ

కాదు మా సుబ్బులు అదృష్టం నీలాంటి అత్తగారితో చచ్చే చావు చచ్చేది జాతకాలు కలవక పోవడంతో దేవుడు దాని నెత్తిమీద ఇంత పాలు గుమ్మరించాడు

జాతకాలు కుదరక పోవడం అబద్ధం అసలు వెంకటావధాని లేడు వెంకటప్పయ్య లేడు చెప్పింది చాముండేశ్వరి

ఇత్తడి గ్లాసుని వేలమీద టకటక కొట్టింది కామేశ్వరి ఇంకాస్త మంచినీళ్ళు కావాలన్నట్లుగా అందులో సుబ్బలక్ష్మి కాస్త నీళ్ళు పోసాక తాగి చెప్పింది

నా కా సంగతి ఎప్పుడో తెలుసు సుబ్బుల్ని చేసుకోడానికి మీ కిష్టంలేక ఈ అబద్ధం ఆడుతావని అది నా కడుపులో పడకముందే తెలుసు చెప్పింది



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## ఇంట్లో బీడీలు చుట్టే వారు కూడా కార్మికులే

ఉద్యోగుల ప్రొవిడెంట్ ఫండ్ చట్టం (1952) ప్రకారం ఫ్యాక్టరీలలోను, సంస్థలలోను పని చేయు ఉద్యోగులకు భవిష్యత్ నిధి ఏర్పాటు చెయ్యాలి. ఈ చట్టం బీడీ పరిశ్రమలకు కూడా 1977 సంవత్సరం నుండి వర్తింప చేశారు కేంద్ర ప్రభుత్వం వారు. ఈ ఉత్తర్వులు సవాలు చేస్తూ పటేల్ అండ్ సన్స్ వారు సుప్రీమ్ కోర్టులో రిట్ పిటిషన్ పెట్టుకున్నారు. ఈ ఉత్తర్వులు రాజ్యాంగ విరుద్ధమని బీడీ పరిశ్రమకు ఈ ఉత్తర్వులు వర్తించకుండా తీర్పు ఇవ్వాలని పిటిషనర్లు రిట్ పిటిషన్‌లో కోరారు. అంతే కాకుండా ఉద్యోగుల భవిష్యత్ నిధి చట్టం ఫ్యాక్టరీలలో పని చేస్తున్న కార్మికులకు మాత్రమే వర్తిస్తుందని గృహాలలో పని చేసే కార్మికులకు వర్తించదని వాదించారు. యజమానికి మరియు ఇంటి వద్ద పని చేసే కార్మికునికి మధ్య ఎట్టి సంబంధం లేదన్నారు. కాబట్టి ఉద్యోగుల భవిష్యత్ నిధి చట్టంలోని సెక్షన్ 2 (ఎఫ్)లో ఉదహరించబడిన "ఉద్యోగి" పదం క్రిందకు ఇంటి దగ్గర పని చేసే కార్మికుడు రాడని పిటిషనర్లు వాదించారు. హోమ్ వర్కర్స్ అంటే ఇంటి దగ్గర పని చేసే కార్మికులను పదవీ విరమణ చేయించే అధికారం తమకు లేదు గనుక ఉద్యోగుల ప్రొవిడెంట్ ఫండ్ చట్టం బీడీ పరిశ్రమకు వర్తించదని మరో వాదన. సుప్రీమ్ కోర్టు వారు ఈ వాదనలను తిరస్కరిస్తూ తీర్పు చెప్పారు. ఇంటి దగ్గర బీడీలు చుట్టు కార్మికుడు ఫ్యాక్టరీకి సంబంధించిన పని చేస్తున్నాడు. "ఉద్యోగి" అంటే ఫ్యాక్టరీలో పని చేసే కార్మికునకు మాత్రమే వర్తింప జేయరాదు. హోమ్ వర్కర్లు యజమాని నుండి బీడీలు చుట్టడానికి కావలసిన ముడి సరుకు తీసుకుంటారు. ఇంటి దగ్గర బీడీలు చుట్టిన తర్వాత యజమానికి అప్పచెప్పుతారు. బాగా ఉన్న బీడీలు తీసుకుంటారు. బాగా లేని బీడీలు హోమ్ వర్కరుకు తిరిగి ఇచ్చి వేస్తారు. పనికిరాని బీడీలు నిరాకరించడం వలన హోమ్ వర్కర్ మీద యజమానికి కంట్రోలు మరియు అజమాయిషీ వున్నట్లు ఋజువు అవుతున్నది. కనుక ఇద్దరికి యజమాని మరియు సేవకుడు సంబంధం వున్నది. ఇక పదవీ విరమణ గురించి చట్టంలో లేదు. 55 సంవత్సరాల తర్వాత కార్మికుడు ప్రొవిడెంట్ ఫండ్ తీసుకోవచ్చును. కాబట్టి ఉద్యోగుల భవిష్యత్ నిధి చట్టం బీడీ పరిశ్రమకు కూడా వర్తిస్తుందని 1985లో సుప్రీమ్ కోర్టు వారు (ముగ్గురు జడ్జీలు) తీర్పు చెప్తూ రిట్ పిటిషన్‌లు డిస్మిస్ చేశారు. □

---

కామేశ్వరి.

"నీవు నోరు మూస్తావా లేక నాలుగు తగిలించ మంటావా?" అరిచాడు డాంబికేశ్వరరావు కంచంలో చేతిని కడుక్కుని లేస్తూ.

"మీరు నాలుగు తగిలిస్తే, నేను మీకు చెప్పకుండా ఓ రోజు అన్నంలో ఎలుకల మందు కలిపి వండుతాను." అరిచింది చాముండేశ్వరి.

"వీళ్ళిద్దరికీ ఏదో దయ్యం పట్టింది" చెప్పాడు డాంబికేశ్వరరావు తన భార్య మాటలకి నిర్ఘాంత పోయి.

"జాతకాలు కుదరక పోవడం అబద్ధం అన్నావు. మరి అసలు కారణం ఏమిటి?" అడిగాడు షణ్ముగరావు తన చెల్లెల్ని.

"మీ సుబ్బుల్నే చెప్పమను."

"నాకేం తెలుసు?" అడిగింది సుబ్బులక్ష్మి.

"లేస్తున్నాను" హెచ్చరించాడు డాంబికేశ్వర రావు.

"ఎంత నంగనాచి తుంగబుర్రవే. ఈశ్వరరావుని ప్రేమించి, అతని చేత మాకు, వినాయకానికి ఉత్తరాలు రాయించి ఏం తెలీనట్టు "నాకేం తెలుసు?" అంటావా?"

షణ్ముగరావు మొహం ఆ మాటలు వినగానే పాలి పోయింది.

"ఏమిటి?" అడిగాడు వణుకుతున్న పెదాలతో.

"ఏమి టేమిటి, నీ కూతుర్నే అడుగు."

తండ్రిలాగే నిశ్చేష్టురాలైన సుబ్బులక్ష్మి ఆలస్యంగా తేరుకుని చెప్పింది.

"అత్తయ్య అబద్ధం ఆడుతోంది నాన్న. నేను ఏ ఈశ్వరరావుని ప్రేమించ లేదు."

"అలాగద్దీ పెట్టవే. సంతోషిస్తాను. ఆడపడుచు లంతా అబద్ధాల కోరులే. చిన్నప్పట్నుంచి చూస్తున్నాగా." చెప్పింది కామేశ్వరి.

"నాకు ఇంకాస్త మంచినీళ్ళు." చెప్పింది చాముండేశ్వరి.

"అస లేమైంది వీళ్ళద్దరికీ? ఏదో అయింది." చెప్పాడు డాంబికేశ్వరరావు.

"నీ భార్య చెప్పిందంతా నిజమేనా?" అడిగాడు షణ్ముగరావు వుగ్రంగా.

"కొంతదాకా నిజమే అనుకో"

"ఈశ్వర్రావు నీకు వుత్తరాలు రాసాడా?"

"రాసాడు."

"ఏమని? తను సుబ్బుల్ని ప్రేమిస్తున్నా ననేగా?"

"అచ్చం అలాగే రాసాడు" చెప్పింది చాముండేశ్వరి.

"ఆ విషయం వినాయకానికి కూడా రాసాడు" చెప్పాడు డాంబికేశ్వరరావు ఇక దాచి లాభం లేదని.

"నేను నమ్మను." చెప్పాడు షణ్ముగరావు తన కోపాన్ని కంట్రోల్ చేసుకుంటూ.

"ఆ ఫోటో చూపించండి." అవసరం వస్తే చూపించొచ్చుని తెచ్చాంగా" చాముండేశ్వరి భర్తతో చెప్పింది.

"నీవు నోరెత్తితే చంపేస్తాను." అరిచింది కామేశ్వరి చాముండేశ్వరి మీద పులుసన్నం చల్లి.

వెంటనే చాముండేశ్వరి మాట్లాడకుండా తన కంచం ఎత్తి అందులోని దంతా కామేశ్వరి నెత్తి మీద కుమ్మరించింది. కామేశ్వరి పెరుగు గిన్నె అందుకోబోతుంటే అడ్డుపడి సుబ్బులక్ష్మి చెప్పింది....

"అమ్మా! నేనింకా అన్నం తినలేదే. తర్వాత....."

డాంబికేశ్వరరావు "నా కాబోయే భర్తకి ప్రేమతో" అని సుబ్బులక్ష్మి సంతకం చేసిన ఫోటో ని పెట్టిలోంచి తీసి షణ్ముగరావుకి ఇచ్చి చెప్పాడు–

"దీన్ని ఈశ్వరరావు వినాయకానికి పంపాడు."

షణ్ముగరావు పళ్ళు పటపట కొరికి, దాన్ని ఓ మూలకి విసిరేసి సుబ్బులక్ష్మి జుట్టు పట్టుకుని వంచాడు, వీపు మీద కొట్టడానికి.

"ఆగు నాన్న. మోసం. అది నేను వినాయకం బావకే పంపించాను" అరిచింది, సుబ్బులక్ష్మి ఓ దెబ్బ వీపు మీద పడగానే. (ఇంకావుంది)

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

### ఎన్. ఆర్. బి. హైదరాబాదు.

★ భర్త పేరును విధిగా భార్యలు తమ పేరుతో కలిపి పిలవాలనే ఆచారం ఎక్కడినుండి వచ్చింది?

● పాశ్చాత్యుల నుండి. మన కా గొడవలేదు. కావాలనుకున్నవాళ్ళు పెట్టుకున్నా కొంపమునగదు. భర్త పేరు తగుల్చుకోనంత మాత్రాన వీర ఫెమినిస్టులూ కారు, తగుల్చుకున్నంతమాత్రాన వీర బానిసలూ కాదు.

★ అన్యాయాలు, అబద్ధాలు మోసాలు చేసి కోట్లు సంపాదించినవారు మనదేశంలో అధిక సంఖ్యలో వున్నారు. వారిని ప్రభుత్వం శిక్షించడంపోయి గౌరవిస్తుంది ఎందుకు?

● డబ్బుందికదా! ఈ దేశంలో డబ్బులేనివాడు డుబ్బుకి కొరగాడు!

★ సినిమావారి వల్లే మన రాజకీయాలు భ్రష్టు పట్టిపోయాయి. మీరు నాతో ఏకీభవిస్తారా?

● ఏ రాయి అయితేనేం బాబూ పళ్ళూడగొట్టు కుందుకు! సినిమా ఒక్కటేనా – భ్రష్టు విద్య నేర్పేవి?

★ ఆనాటి కవితలు ప్రజల్లోకి జొరపడి విప్లవానికి నాంది పలికాయి.

● ఏనాటి కవితలు?!

★ ఎక్కడలేని మాటలూ ఆడవారి నోటంట వస్తాయి. ఆడవాళ్ళ నోళ్ళు మాటలపుట్టలా?

● మీ రెప్పుడూ మగవారి మధ్య కూర్చోరా?

★ ఆడపిల్లలు కన్పిస్తేచాలు మా బస్సులు సడెన్‌గా స్టాప్‌లేనిచోట్ల ఆగిపోతాయి.

● ఇంకా ఆడపిల్లలపట్ల షివార్లీ చచ్చిపోనిచోటు వుందన్నమాట! ఆశ్చర్యంగానే వుంది.

### ఎమ్. ఆర్. ఆర్. విజయవాడ..

★ నిజం బయట పడక తీరదు- అంటారే ఎలా- ఎవరూ చెప్పక అది బయల్పడేది?

● సింపుల్. అబద్ధాలకోర్లు ఎక్కువైనకొద్దీ- నిజం బయటపడ్డం- తేలిక- దాన్నెవరూ ప్రత్యేకించి చెప్పక్కరలేదు

### రఫీ, కాశీబుగ్గ

★ మద్యపానాన్ని, వరకట్నాన్ని నిషేధించండి అనే అంశంపై నవల రాయకూడదూ?

● కొబ్బరి చెట్టుకి మడిబట్ట కట్టినట్టే- నిరుపయోగం.

★ ప్రశ్నావళి టైటిల్ మారింది ఎందుకు?

● సరదాకే!

### బి. ఎస్. భీమవరం

★ "సరే కట్నం తీసుకోను. మరి నాకు కూతురు పుడితే ఆ అమ్మాయిని కట్నం లేకుండా ఎవరేనా చేసుకుంటారా? అందుకే యీ డబ్బు దాచి అమ్మాయి పెళ్ళి చేస్తాను!" ఇలాంటి వారికి సమాధానం ఎలా చెప్పడం?

● నేనైతే- "నువ్వు పెళ్ళి చేసుకోవద్దు. నీ కడుపున ఓ ఆడపిల్ల పుట్టావద్దు- ఆ పిల్లదానికి అయ్యో యిలాంటి తండ్రా నాకన్న బెంగా వద్దు." అని చెప్పేదాన్నే. ఇవన్నీ మిల్క్ మైడ్స్ డ్రీమ్స్! అయితే గియితే- అని ఆలోచించే- సోమరి పోతుల వూహలు. వంక కోసం వెతికే- పిరికి వారి దారులు- అలాంటి వారికి- సమాధానం చెప్పక్కర లేదు. వాళ్ళు- మన స్నేహితులు కాకుండా వుంటే చాలునని- సంతోషించాలి.

### జి. వి. కె. ఆర్. విజయవాడ

★ ఈ ప్రభుత్వంపై అభిప్రాయం?

● ప్రజ లెప్పుడూ "ప్రెజెంట్" ప్రభుత్వాన్ని అసహ్యించు కుంటూ అనుభవించడం పరిపాటి!

### ఎం. జి. ఆర్. అంబుసోలి

★ శోభనం రాత్రి వధూవరులకు తెల్లటి వస్త్రాలు కడుతా రెందుకు?

● ఈ ప్రశ్న యిప్పటిదాకా ఎందరేశారో చెప్పలేను! ఎందుకీ మార్బిడ్ క్యూరియాసిటీ? అర్థం కాదు- ఇదొక ఆటవిక సంప్రదాయానికి ప్రతీకగా మిగిలి పోయిందే. తెలుగు సినిమాలు- పెంచి ప్రోత్సహిస్తున్న దరిద్రపు ఆచారం.

### ఎస్. ఎల్. విజయవాడ

★ క్రికెట్ అంటే ఇప్పుడు అంతా పడి ఛస్తున్నారు మరి మీరు?

● నేనూను!!

★ డబ్బుకు, ప్రేమకు భేదం ఎంత?

● లేదు! డబ్బు మూటకి ప్రేమ దాసోహమే!

### ఇ. కె. పి. ఖమ్మం

★ న్యాయ దేవత కళ్ళకి గంత లెందుకు?

● సాక్షుల "రూప లావణ్యాలకి" లొంగి పోకుండా నని.... సాక్ష్యాన్నే గాని సాక్షులను అంచనా వేయకుండా వుండడానికని.

### టి. జె. ఆర్. విజయవాడ

★ కె. ఆర్. ఎల్. గారూ మనఃశాంతికి మందు తెలుప గలరా?

● తాగుడు కాదు. వ్యభిచారం కాదు. మత్తు మందులు కాదు. మన మనస్సు మన చేతిలో వుంది- అన్న సత్యం గ్రహించాలి ముందు- దాన్ని మనం నడపాలి. అది మనని కాదు.

### బి. ఎస్. భీమవరం

★ కె.రా గారూ నేడు మంచి సినిమాలు రాకపోడానికి కారణం ఎవరు? ప్రజలా? దర్శక నిర్మాతలా? సమాజ పరిస్థితులా?

● ఎవరని చెప్పను? కర్ణుడి చావుకి లాగా ఈ నాటి తెలుగు సినిమా రుగ్మతలకి కారణాలు అనేకం. ముఖ్యంగా డబ్బు పెట్టేవాడే- థియేటర్ యజమాని, నిర్మాత, ఒకొక్కప్పుడు దర్శకుడు, కథకుడు, పబ్లిసిటీ వాడు అన్నీ కావడంతో- "కానీ పొల్లు" పోకుండా తిరిగి రాబట్టడమే- ధ్యేయంగా రంగంలోకి దిగడం- మన దురదృష్టం. □






భద్రయ్య బస్సు, బోసు విగ్రహం జంక్షనులో ఆగింది...!

పుం(వ్వాయి... పుం(వ్వాయి అంటూ బస్సు హారను మ్రోగింది.. ఆ బస్సు హారను. ఆచుట్టు ప్రక్కల పరిసరాల్లో శ్రవణానందకరంగా ప్రతిధ్వనించింది... భద్రయ్య బస్సు దిగి రోడ్డు మీద నవ్వుతూ నిలబడ్డాడు... హారను విని, ఇళ్ళల్లోంచి బిలబిలలాడుతూ... కళ కళలాడుతూ పిల్లలు...! ముద్దుగా, ముచ్చటగా పరుగెత్తుకుని బస్సు దగ్గరకు వస్తున్నారు.... భద్రయ్య చుట్టూ మూగుతున్నారు...!

తెలతెల్లటి బ్లౌజుల్ని, నీలిరంగు స్కర్టుల్లో, నిక్కర్లలో ఇన్‌షర్టు చేసుకుని ... నిగనిగలాడుతూన్న నల్లటి బూట్లు వేసుకుని .. మోయలేని బరువు పుస్తకాల పెట్టెలతో... భోజనం క్యారియర్లతో.. చొక్కాల మీద మిలమిల మెరిసే 'బ్లూస్టార్' బేడ్జీలతో... నెక్ టైలతో ... పాపం , పుణ్యం తెలియని పసిపిల్లలు - పువ్వుల్లా, పూతరేకుల్లా, లేగదూడల్లా గెంతులేస్తూ భద్రయ్య చేతుల్లోకి దూకుతున్నారు... అరవిచ్చిన నవ్వులతో... ఆనందం తొణికిసలాడే వదనాలతో... తనను చుట్టుముట్టిన ఆలేలేత పువ్వుల్ని.... అంత సున్నితంగానూ, అంత సంతోషంగానూ, ఎత్తుకుని భద్రంగా బస్సు ఎక్కిస్తున్నాడు భద్రయ్య. దూరంగా నిలబడి కొందరు తల్లులు టాటాలు చెబుతున్నారు. కొందరు పనిమనుషుల్ని తోడిచ్చి బస్సు వరకూ సాగనంపుతున్నారు... మరికొందరు తల్లులు తామే ఎత్తుకుని బస్సు వరకూ తీసుకు వస్తున్నారు. తల్లులతోనూ పనిమనుషులతోనూ, తనకు పని లేదన్నట్టు భద్రయ్య ఆపిల్లల్ని పేరు పేరునా పలకరిస్తూ, వాత్సల్యాన్ని ప్రదర్శిస్తున్నాడు... మారాం చేసే పిల్లలకు మరిపించే మాటలు చెబుతున్నాడు... గారాం చేసే పిల్లలకు గారడీ చేస్తున్నట్టు నటిస్తున్నాడు....

ఆ బోసు విగ్రహం జంక్షనులో మొత్తం ముప్పై మంది పిల్లలు బస్సు ఎక్కారు... పిల్లలందరూ ఎక్కి సరిగ్గా సర్దుకుని కూర్చున్న తరువాత- భద్రయ్య బస్సును బయలు దేరదీశాడు. బస్సు బుర్రు బుర్రు మంటూ కొంచెం సేపు మారాం చేసి బయలు దేరింది...!

"భద్రయ్యా! రాత్రంతా గుర్రమెక్కుతావ్! పగలు బస్సునడుపుతావ్! జాగర్త గురో!" పరిచయమున్న రిక్షావాడు భద్రయ్యను పలకరించి ప్రక్కనుంచివెళ్ళిపోయాడు. భద్రయ్య బదులు చెప్పలేదు... కాని అతని ముఖం రిక్షావాడి మాటలకి ఒక్క క్షణం వెలవెల బోయింది.. పళ్ళు బిగబట్టి పెదాల్ని పౌరుషంగా నొక్కిపట్టాడు.

"బ్లూస్టార్ కాన్వెంటు" ఆ వూళ్ళో అనతి కాలంలోనే అతిగొప్ప ఖ్యాతిని... ప్రచారాన్ని హస్తగతం చేసుకుంది. అత్యుత్తమ క్రమశిక్షణతో... ఆంగ్లో ఇండియన్ ఉపాధ్యాయులతో, ఆంగ్ల బోధనా పద్ధతి చాలామంది తల్లిదండ్రులకు నచ్చింది. తమ పిల్లల్ని పోటీలుపడి ... ఫీజులు ఎక్కువయినా భరించి "బ్లూస్టార్" లోనే చేర్పించారు. "బ్లూస్టార్ కాన్వెంటు"కు ఉన్నది ఒక్కటే బస్సు... ఆ బస్సుకు డ్రైవరు భద్రయ్య.. కాన్వెంటు ఊరికి కాస్త ఎడంగా, దూరంగా ఉండడంతో... ట్రిప్పుకు ఏభైమంది పిల్లల చొప్పున ఎక్కించుకుని మూడు ట్రిప్పులు ఊళ్ళోకి, కాన్వెంటుకు తిరుగుతుంది బస్సు. మిగతా సగానికి పైగా పిల్లలు రిక్షాల్లో వస్తారు. తల్లి దండ్రుల స్కూటర్లపైనా వస్తారు.. కొందరు చిన్న. కార్లలోనూ తరలి వస్తుంటారు!

బస్సు నెమ్మదిగా ముందుకు పరుగెడుతూంది.. భద్రయ్య నిదానంగా, అతి జాగ్రత్తగా బస్సు నడుపుతున్నాడు. బస్సులో పిల్లలగోల... తుళ్ళిపడే ఆనందం... నవ్వులు... కేరింతలు... కిటికీల్లోంచి బయటకు చూస్తూ చేస్తున్న అల్లరి.. భద్రయ్య బస్సు నడుపుతూనే... వెనక్కి తిరిగి.... పిల్లలూ చేతులు బయట పెట్టకండి బాబూ! కదలకుండా కూర్చోండర్రా! అంటూ గొంతెత్తి అరుస్తున్నాడు...!

బస్సు గాంధీనగర్ పార్కు దగ్గర ఆగింది...!

అక్కడా ఓ ఇరవై మంది పిల్లలు చుట్టు ప్రక్కల ఇళ్ళనుంచి.... వెలుగుతూన్న దీపాల్లా ... పరుగెత్తు కొచ్చి బస్సును చుట్టు ముట్టారు. భద్రయ్య అప్పటికే ఆత్రంగా బస్సు దిగాడు.. ప్రేమగా దగ్గరకు తీసుకుంటున్నాడు. పిల్లవి... జ్యోతి.... కిరణ్ రండర్రా! రండంటూ గుండెలకు హత్తుకుంటున్నాడు. భద్రంగా బస్సు ఎక్కిస్తున్నాడు...!

## నీలి నక్షత్రం

ఏం భద్రన్నా? నోట్లోంచి ఏదో వాసనొత్తున్నట్టు అనిపిస్తాంది పొద్దుట్నే మందు కొట్టినావా ఏంది? పిలగాళ్ళురా నాయినా !

ఒక పాపను ఎత్తుకొచ్చిన ఇంటి పనిమనిషి భద్రయ్యతో హాస్యమాడింది

చీ! నోర్మూయ్యవే సెత్త కొరిముండా! నాదగ్గర వాసనేటి? రాత్రి నీ మొగుడు బాగా తాగొచ్చినాడేమో ఆ వాసన నీ నోట్లోంచే వస్తన్నాది ! భద్రయ్య రుసరుసలాడుతూ బస్సు ఎక్కేశాడు కోపంతో ఎక్సిలేటరు మీద కాళ్ళు వేశాడు గుర్రుగుర్రుమంటూ స్టీరింగు తిప్పాడు బస్సు మలుపు తిరిగి ముందుకు కదిలింది.!

భద్రయ్య మనసు మండుతోంది అశాంతిగా ఆవిర్లు గక్కుతోంది!

భద్రయ్య నిజంగా త్రాగుతాడు రోజూ త్రాగుతాడు మత్తుగా త్రాగుతాడు మనశ్శాంతి కోసం త్రాగుతాడు అయితే ఆ త్రాగుడు రాత్రి పూటకే పరిమితం పగటిపూట దాని వాసన కూడా చూడదు ! రాత్రి త్రాగినా పగలు త్రాగినా మత్తు కోసం త్రాగినా మనశ్శాంతి కోసం త్రాగినా త్రాగుడు త్రాగుడే కదా! త్రాగుబోతు త్రాగుబోతే కదా! అందుకే భద్రయ్యను అందరూ వేలెత్తి చూపుతారు వెక్కిరిస్తుంటారు ఎగతాళి చేస్తారు హేళనా చేస్తారు! అటు బస్సు నంటి పెట్టుకుని రోజంతా గడిపినా కాన్వెంటు యాజమాన్యం తగిన గుర్తింపు, విలువ ఇవ్వరు వాళ్ళూ తిడతారు ఛీ కొడతారు !

ఛీ! ఛీ! త్రాగుడు మానెయ్యాలి! అందరిలో తలెత్తుకు తిరగాలి! మనసులో మదన పడుతూనే అతి నెమ్మదిగా దృష్టిని కేంద్రీకరించి బస్సును నడుపు తున్నాడు భద్రయ్య

రోడ్లన్నీ క్రిక్కిరిసి ఉన్నాయి ఉదయం ఎనిమిది గంటల సమయం వాహనాల రద్దీ జనం రద్దీ బస్సు మునిసి పాలిటీ గోతుల్లో పడి బారంగా మూలుగుతోంది బస్సు కుదుపులకి పువ్వుల్లాంటి పిల్లలు ఎక్కడ నలిగి పోతారో ఎక్కడ కంది పోతారో అన్నంత మెలకువగా బస్సును పోనిస్తున్నాడు భద్రయ్య !

బ్లూ స్టార్ కాన్వెంటు వెలుగులోకి వచ్చినప్పటి నుంచి బస్సును కొన్నప్పటి నుంచి భద్రయ్యే దానికి డ్రైవరు అప్పన్న అనే క్లీనరు కుర్రాడు కొన్నాళ్ళు పని చేశాడు పిల్లల్ని బస్సు ఎక్కించడానికి సాయంగా ఉండేవాడు వాడు వారం రోజులకే జీతం డబ్బులు కిట్టడం లేదని యాజమాన్యంతో గొడవ పెట్టుకుని మరీ మానేశాడు ఆ తర్వాత మరో కుర్రాడ్ని పనిలో పెట్టమని భద్రయ్య ఎంత మొత్తుకున్నా యాజమాన్యం వినలేదు పని పెరిగినా, బాధ్యత పెరిగినా భద్రయ్య బాదపడలేదు యాజమాన్యం తన మాట ఖాతరు చెయ్యనందుకు మాత్రం బాధ పడ్డాడు !

ఇకపై తాను తప్పకుండా త్రాగుడు మానెయ్యాలి! చాలా కృతనిశ్చయంతో మళ్ళీ అనుకున్నాడు భద్రయ్య !

ఎందుకోసం? ఎవరికోసం? ఎవరెవరో వెక్కిరిస్తున్నారనిక్కాదు యాజమాన్యం ఛీ కొడుతున్నారనీ కాదు మొన్నొకరోజు

భద్రయ్యా! నువ్వు త్రాగుతావటకదా! త్రాగి రాత్రిళ్ళు రోడ్లమ్మట తిరుగుతావంట కదా! మా డాడీ చెప్పారు రేపు ఫస్టు నించి నన్ను రిక్షాలోనే పంపిస్తారట ! త్రాగినోళ్ళు బస్సు నడిపితే ప్రమాదమంటగా!' ఓ చిన్నారి అయిదేళ్ళ పాప అమాయకంగా బెదురు కళ్ళతో భద్రయ్యను ప్రశ్నించింది భద్రయ్యకు సిగ్గు వేసి నట్లయింది అతను దోషిలా తలవంచుకున్నాడు ఆ చిన్నారికి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు

'లేదమ్మా! లేదు నే నెప్పుడూ త్రాగను మీ డాడీ అబద్ధం చెప్పారు మిమ్మల్ని క్షేమంగా స్కూలుకు వెళ్ళి, ఇంటికి అప్పగించే పూచీ నాది పదమ్మా! పద!"

అదిగో అప్పట్నుంచి భద్రయ్యకి బెంగగానే ఉంది బెరుకుగానే ఉంది త్రాగుడు మానెయ్యాలని సగర్వంగా పిల్లల ముందు నిలబడాలని ఆత్మ సాక్షిగా త్రాగడం మానేసి స్వచ్ఛంగా వాళ్ళ ముందు కనబడాలని

ఊరి చివరి కొచ్చింది బస్సు ఓ ఫర్లాంగు దూరంలో రోడ్డు మలుపు తిరిగితే కాన్వెంటు కళ్ళకు కనిపిస్తుంది బస్సు ఇంకా రెండు ట్రిప్పులు నడవాలి సీతం పేట, ప్రకాష్ నగర్ సెంటర్లలోని పిల్లల్ని కాన్వెంటుకు చేర్చాలి ! భద్రయ్య సాలోచనగా స్టీరింగు తిప్పుతున్నాడు ! ఉన్నట్టుండి ఉరుము ఉరిమినట్లు పెద్ద చప్పుడు !

అమ్మో! భద్రయ్యా! మమ్మీ! డాడీ! ' పిల్లల అరుపులు, హాహాకారాలు కేకలు ఏడుపులు ఆర్తనాదాలు !

భద్రయ్య తుళ్ళిపడ్డాడు ఒక్క క్షణం అతనికేం జరిగిందో అర్థం కాలేదు తేరుకునేటంతలో రెండు లారీలు రివ్వుమని డీకొంటూ ప్రక్కనుంచి దూసుకు పోయాయి విసిరి వేయబడినట్లు బ్లూస్టార్ బస్సు రోడ్డుకు ఎడమవైపు ఒరిగి పోతోంది అక్కడ రోడ్డు లేదు పెద్ద గొయ్యి కంకర దొలిచి వేయబడి ఎన్నాళ్ళుగానో పూడ్చకుండా ఉంది భద్రయ్య షడన్ బ్రేకు వేసి ఒక్క గెంతు బస్సులోంచి గెంతాడు అతని గుండె రాలెత్తి పోయింది ముందు టైరు ఒకటి గోతిలో దిగబడి పోతూ బస్సు ఇంకా క్రిందికి వాలి పోతోంది భయం వణుకు దడ అంతే! మరుక్షణం భద్రయ్య అక్కడ కనిపించలేదు !

నిముషాలు నిట్టూర్పులు విడిచాయి ఆ ప్రదేశంలో జనం పెద్ద పెట్టున గోల పెడుతూ గుంపులు గుంపులుగా పోగయి పోయారు అటూ ఇటూ వాహనాలు ఆగిపోయాయి బస్సులో పిల్లల ఏడుపులు హాహాకారాలు మిన్నుముట్టాయి ఎవరికేం చేయాలో పాలు పోవడం లేదు ఫర్లాంగు దూరంలో ఉన్న బ్లూస్టార్ కాన్వెంటుకు కబురందింది గుండె లరచేతుల్లో పెట్టుకుని సిబ్బంది, యాజమాన్యం పరుగెత్తుకు వచ్చారు అగ్నిమాపక దళానికి ఫోను వెళ్ళింది ఆనోటా ఈనోటా కొందరు తల్లి దండ్రులకి వర్తమానం పాకింది ఈలోపుగా యువకులు కొంతమంది సాహసించి బస్సు కిటికీల్లోంచి అందిన కుర్రాళ్ళని ఒయటకు లాగు తున్నారు !

తాగుబోతు యెదవని డ్రైవరుగా పెడితే ఏం జరుగుతుంది? ఇలాంటి ఏక్సిడెంట్లే చేస్తాడు!

"మేనేజిమెంటుకు బుద్ధిలేదు వాళ్ళ బిజినెస్ ఏదో వాళ్ళు చూసుకుంటున్నారు పిల్లల క్షేమం ఎవడిక్కావాలి? పసిప్రాణాలతో చెలగాటం "

"ఆ డ్రైవరు పేరు భద్రయ్యట పగలూ రాత్రీ కూడా మందులో నే ఉంటాడట!"

"మందొక్కటే నేమిటి? వాడికిద్దరు పెళ్ళాలున్నా రంట "!

"ఇంతకూ ఏడీ వాడు? ఎక్కడున్నాడు?"

"ఇంకా ఉంటాడా ఇక్కడ? ఎప్పుడో కాళ్ళకు బుద్ధి చెప్పాడు "!

"ఎక్కడున్నాడో పట్టుకుని వెధవని ఉరితియ్యాలి!

రకరకాల తిట్లు, శాపనార్థాలు వ్యాఖ్యానాలు గోల కేకలు ! అగ్నిమాపక బృందం వచ్చింది ఉరుకూ పరుగులతో బస్సు పైకి ఎగబడింది అందరూ సాయం పట్టి పిల్లల్ని బయటికి చేరవేస్తున్నారు బయటకు లాగబడిన పిల్లలు బిక్క చచ్చిపోయి గొల్లున ఏడుస్తున్నారు తల్లులు - తండ్రులు పిల్లల్ని కౌగిలించుకుంటూ గుండెలకు హత్తుకుంటూ గగ్గోలు పడుతున్నారు భద్రయ్యను కసిదీరా తిట్టుకుంటున్నారు చాలా మంది పిల్లలకు చిన్ని చిన్ని దెబ్బలు తగిలాయి ఏంబులెన్సు వచ్చింది అక్కడికక్కడే పిల్లలందరికీ ప్రధమ చికిత్సలు జరిగాయి !

అరగంట గడిచింది పిల్లలు అందర్నీ డ్రైవరు కేబిన్ లోంచి కిటికీల్లోంచి అతిలాఘవంగా బయటికి తీశారు తల్లి దండ్రుల పుణ్యఫలమో ఆపసివాళ్ళ అదృష్టమో ఏ అమృత హస్తాల ఆశీర్వచనమో పిల్లలందరూ చిరంజీవులుగా బ్రతికి బయట పడ్డారు ఎవరికీ ప్రాణాపాయం జరగ లేదు ఏ ఒక్క మరణం సంభవించ లేదు చిన్న చిన్న గాయాలు తప్ప అందరూ సురక్షితంగా రోడ్డు మీదకు చేర్చబడ్డారు బస్సు ఒక ప్రక్కకు ఒరిగి పోయేఉంది పోలీసులు వచ్చారు డ్రైవరు భద్రయ్యా మీద, కాన్వెంటు, యాజమాన్యం మీద కేసులు నమోదు చేశారు ఇద్దరు పోలీసులు భద్రయ్యను వెతికిపట్టుకోవడానికి ఊళ్ళోకి హుటా హుటిన బయలు దేరి వెళ్ళారు ప్రమాదం జరిగిన చోటును పరిశీలిస్తూ ప్రమాదం జరగడానికి కారణాన్ని అన్వేషిస్తూ ఒక కానిస్టేబులు కెవ్వు మని అరిచాడు

సార్! డ్రైవరు భద్రయ్య ఇదిగో సార్! ఇక్కడున్నాడు ! కానిస్టేబులు షాక్ తిన్న వాడిలా కేక పెట్టాడు జనం ఒక్కసారి గోల పెట్టారు ఆగ్రహాలు ఆవేశాలు ఒకర్ని త్రోసుకుని ఒకరు పోలీసులు వాళ్ళని అదుపులో పెట్టలేక పోయారు అందరూ అటు దృష్టిని సారించారు ఆవేశాలు ఆగ్రహాలు ఆవిరై పోయాయి మనసులు నీరు కారి పోయాయి నిశ్చేతనులై నిలబడి పోయారందరూ!

భద్రయ్య రోడ్డు ప్రక్క గోతిలో ఉన్నాడు ఒరిగి పోయిన బస్సు టైరు భద్రయ్య గుండెల మీద ఉంది భద్రయ్య గుండెలోని రక్తమంతా గొంతులోంచి ఎగదన్ను కొచ్చి ఛాతి మీద గడ్డకట్టుకు పోయింది ఆగొయ్యి రక్తమయంగా భయంగా బీభత్సంగా భద్రయ్య శరీరం నిర్జీవంగా

భద్రయ్య చచ్చి పోయాడు భద్రయ్య చచ్చి పోయాడు అయ్యోపాపం! ఎంత పని జరిగింది? ఎలా చచ్చి పోయాడంటారూ?

ఒరిగి పోతున్న బస్సులోంచి ఒక్క గెంతుగెంతి గోతిలోకి దిగబడి పోతూన్న టైరును చూసి గుండె ఆగినంత పనయి లిప్తకాలంలో గబుక్కున గోతిలోకి దూకి చతికిల బడిపోయి. ఊపిరి బిగబట్టి దిగబడి పోతున్న టైరును పట్టుకుని పైకి లేపి లేపి భుజం అడ్డు పెట్టి పట్టు దప్పి ఏభై పసి జీవితాల్ని రక్షించే ఏకైక లక్ష్యంలో టైరు క్రింద అణగి పోయి అసువులు బాసి

భద్రయ్య కావాలనే ఈ పని చేశాడు భద్రయ్యే ఈపని చేసి ఉండకపోతే బస్సు పూర్తిగా తిరగబడి పోయేది ఏభై మంది పిల్లలు దారుణంగా

చూస్తున్న వాళ్ళ గుండెలు చలించి పోతున్నాయి అందరి కళ్ళలోంచి అశ్రువులు ఆర్ద్ర జలపాతాలై దూకుతున్నాయి !

మరో వాహనం సహాయంతో బస్సును పైకి లేపి నిలబెట్టారు రక్త సిక్తమయిన భద్రయ్య శవాన్ని గోతిలోంచి తీసి పోలీసులు రోడు వార పడుకోబెట్టారు

"భద్రయ్య చాలా నమ్మకస్తుడుసార్ ఎన్నిసార్లు మేము ఉద్యోగంలోంచి తీసేసినా అతడు పోలేదు రాత్రిళ్ళు త్రాగే అలవాటుందని అసహ్య మేసి తిట్టినా ఈసడించినా ఛీకొట్టినా మాబస్సును విడిచి పెట్టలేదు డ్యూటీలో ఉండగా వాడెప్పుడూ త్రాగలేదు పగటి పూట త్రాగనని ఎప్పుడో మా పాదాల మీద పడి ప్రమాణం చేసేడు '

"అంతేకాదుసార్! భద్రయ్యకు పిల్లలంటే ప్రాణం! ఇంతకాలంగా వాడు ఏ ఒక్కరోజూ శెలవు పెట్టలేదు శెలవు ఇస్తామన్నా వాడుకోలేదు మరో డ్రైవరు ఆ బస్సు ఎక్కి స్పీడుగా ఎక్కడ నడిపేసి పిల్లల్ని బెదర గొట్టేస్తాడో నని వాడి బెంగసార్! భద్రయ్య పోవడం నిజంగా మా దురదృష్టంసార్"!

యాజమాన్యం గొంతు విప్పి కారుణ్యం ఒలికిస్తోంది సానుభూతి కురిపిస్తోంది! ఎక్కడ్నుంచి వచ్చిందో ఎలా వచ్చిందో కబురు ఎలా అందిందో భద్రయ్య ముసలి తల్లి గుండెలు బాదుకుంటూ వచ్చి కొడుకు శవం మీద కుప్పలా కూలిపోయింది

"నాకొడుకో! నన్నొదిలి పెట్టి పోయావా. నాకొడుకో నాకన్యాయం సేసేసి నావురో నాకొడుకో కట్టుకున్న పెళ్ళాం దబ్బునోడి మోజులో పడి నీకంటోలి దుమ్ముకొట్టిందిగా నాకొడుకో మరో దాన్ని కట్టుకోకుండా కట్టెలా మిగిలి పోయినావేరా నాకొడుకో నాది గొడు బతుకుకాదే బడి పిల్లోల్లంతా నాబిడ్డలే యమ్మా యని నన్ను మురిపించినావురో కొడుకో ఆబడి పిల్లోల్ల కోసంవే బతుకు బలి పెట్టేశావురో నాకొడుకో నేనేంజేతురో నాకొడుకో నాకేటి దిక్కురా నాకొడుకో నాకొడుకో

రాతి గుండెలు కరిగేలా ఆముసలితల్లి రోదిస్తోంది

పిల్లలంతా చుట్టూ చేరి భద్రయ్య కోసం భోరున ఏడుస్తున్నారు బాష్పాలు విడుస్తున్నారు భద్రయ్య నిర్వికారంగా శాశ్వత నిద్ర పోతున్నాడు భద్రయ్య ఒంటి మీద కాన్వెంటు యూనిఫాంఉంది నిక్కరు, చొక్కా ఉన్నాయి

రక్త సిక్త మయిన అతని తెల్లటి చొక్కామీద కాన్వెంట్ ఎంబ్లమ్ . "బ్లూ స్టార్! నీలినక్షత్రం ఆకాశం వైపు చూస్తూ నిగనిగా మెరుస్తూనే ఉంది ! □



# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



-యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

ఫిబ్రవరి నెలలో ఇక్కడ "గ్రేట్ ఫ్రీడం రన్" అనే ఒక వుత్సవం జగింది. దీనిలో అన్ని వయసుల వారు కొన్ని లక్షల మంది పాల్గొన్నారు. ఈ ఉత్సవాన్ని నేను ఇంటిలో కూర్చుని టి. వీలో చూస్తున్నాను. ఇంతలో మా స్టాక్ ఎక్స్‌ఛేంజ్ ప్రక్కనే వున్న ఆంధ్రా బ్యాంక్‌లో పని చేస్తున్న శ్రీ రవికుమార్ ఫోన్ చేశారు. ఏమండి ఏమిటీ సంగతులు? అన్నాను. "ఏమిటి టి. వి. చూస్తున్నారా" అన్నారు ఆయన. అవును చూస్తున్నాను' అన్నాను. ఎలాగుంది అన్నారు ఆయన. చాలా బాగుంది అన్నాను. "మీకు దీన్ని చూస్తుంటే ఏమనిపిస్తోంది" అన్నారు. అద్భుతం, అత్యద్భుతం అన్నాను. ఎందుకంటే మన ప్రధాని రాజీవ్ గాంధీ పరిగెడుతుంటే ఆయన బాడీగార్డ్ల అవస్థ. అంతకు మించి గొప్ప గొప్ప ఆటగాళ్ళు, వీరికి దీటుగా అందమయిన సినిమా జనాలు, అహో అన్పించాయి. నాచేత. అంతేగాక పెద్ద పెద్ద పొట్టలు పెంచిన మంత్రులు కూడా పరుగెడుతుంటే మహదానందంగా వుండదా!" అయ్యో అదికాదు నాకు కావలసింది. దీన్ని చూస్తుంటే తెలుగు సినిమాలో సింబాలిక్ షాట్ లాగ కన్పించటంలేదూ" అన్నారు. 'అంటే' అన్నాను. 'అదేనండి రేపు బడ్జెట్ ప్రవేశ పెట్టిన తరువాత ఇన్వెస్టర్‌లు ఎలా స్టాక్ ఎక్స్‌ఛేంజ్ నుంచి పారిపోతారో అలా వుంది కదూ' అన్నారు. అవును నిజమే సుమా. తెలుగు సినిమాలు చూస్తే లాభం వుంది గాబోసు అన్పించింది మొట్టమొదటిసారిగా. అంతటి తెలివితేటలు వుండటం వలనే ఆయన ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు అన్పించింది.

మనం ఈ వారం కన్వర్టబుల్ డిబెంచర్స్ గూర్చి తెలుసుకుందాము. స్టాక్ మార్కెట్‌లలో ప్రవేశించే వార్కికి ఇవి మంచి సాధనాలు. కన్వర్టబుల్ డిబెంచర్‌లు అంటే అప్పు పత్రమైన డిబెంచర్ వాటాగా మారుతుంది అన్నమాట. సాధారణంగా ఈ కన్వర్టబుల్ డిబెంచర్‌లు కొంత కాలం తరువాత షేర్లుగా మారతాయి. అంతవరకు వీటి మీద వడ్డీ వస్తుంది కూడా. షేర్‌గా మారిన తరువాత వడ్డీ వుండదు కాని డివిడెండ్‌కు అర్హులవుతారు. ఈ మధ్య ఈ కన్వర్టబుల్ డిబెంచర్స్ చాలా ఎక్కువ ప్రీమియంకు ఇచ్చి కంపెనీలు వారి యొక్క ఆర్థిక పరిస్థితులను మెరుగుపరుచుకుంటు న్నాయి.ఇట్టి పరిస్థితులలో ఇవి కూడా 100% భద్రత ఉన్నవి కావు. కాబట్టి ఇన్‌వెస్టర్స్‌కు కొన్ని సూచనలు ఇస్తున్నాను. (1) ఏ కంపెనీ అయినాసరే వర్కింగ్ కాపిటల్ కోసం ఈ సి. డి. లు ఇస్తున్నట్లు అయితే వాటి జోలికి పోవద్దు. (2) విస్తరణ లేక డైవర్సిఫికేషన్ కోసం ఐతే వాటి మంచి చెడ్డలు గమనించి సబ్‌స్క్రయిబ్ చెయ్యండి. (3) సాధారణంగా నడుస్తున్న కంపెనీలు వాటి సి. డి. లను చాలా పెద్ద ప్రీమియమ్‌కు ప్రజలకు ఇస్తూ వుంటాయి. అటువంటప్పుడు ప్రజలు మోసపోరాదు. ఉదాహరణకు ఈ మధ్యనే జారీ చేసిన గార్డెన్ కంపెనీ సి. డి. లు. వీరు తమ సి. డి. లను చాలా ఎక్కువ ప్రీమియంకు ప్రజలకు ఇస్తే, దానిలో 30 శాతం నష్టానికి ప్రజలు అమ్ముకోవలసి వచ్చింది. దీనికి బాధ్యులు కంట్రోలర్ ఆఫ్ కాపిటల్ ఇస్యూస్ వారి నిర్లక్ష్యం మూలంగానే ఇటువంటి కంపెనీలు ప్రజలను మోసం చేయగల్గుతున్నాయి. కంపెనీకి వ్యాపారం చేసి లాభాలు సంపాదించటం కన్న ప్రజలను మభ్యపెట్టి లాభాలు గడించవచ్చు అని దృక్పథం కూడా. ఎందుకంటే ఈ ప్రీమియం డబ్బు కంపెనీ రిజర్వు ఫండ్‌లో చేరుతుంది. రిజర్వు అధికంగా వుండటం మూలంగా యజమానులు బాగుపడ్తారు. కాబట్టి ఇన్‌వెస్టర్స్ చాలా జాగ్రత్తగా వుండాలి. (4) నడుస్తున్న కంపెనీ ఎక్కువ ధరకి సి. డి. లు ఇస్తున్నట్లు అయితే ఆకంపెనీ యొక్క 3 సంవత్సరాల సగటు తక్కువ ధర కన్న ఇది ఇప్పుడిచ్చే ప్రీమియం కనీసం 30 శాతం తక్కువ వుంటేనే వాటిని కొనుగోలు చెయ్యండి. (5) కొన్ని కంపెనీలు సగ భాగం నాన్ కన్వర్టబుల్ భాగంతో కలిపి ఇస్తూ వుంటాయి. ఈ ఎన్. సి. డి. లు మార్కెట్‌లో 15-20 శాతం తక్కువ ధరలో పోతూ వుంటాయి. ఈ నష్టాన్ని కూడా బేరిజు వేసుకొని 30 శాతం తక్కువ వుండాలి. ఎందుకంటే, ఈ క్రొత్త షేర్‌లు మార్కెట్‌లోకి రావటం మూలంగా గిరాకీ, సరఫరా సిద్ధాంతం ప్రకారం, సరఫరా పెరిగి ధర లు పడిపోతాయి. అందుకని.

అంతేగాక కన్వర్టబుల్ డిబెంచర్‌లు ప్రజలకు ఇచ్చేటప్పుడు భారతదేశపు దౌర్భాగ్యం ఏమోకాని ప్రతి చిన్న కంపెనీ కూడా వాటి షేర్ విలువను మానిప్యులేట్ చేస్తాయి. ఉదాహరణకు మొన్న ఈ మధ్య ఇండో జపాన్ ఫోటో అనే కంపెనీ షేర్‌లను రైట్ పద్ధతిలో ప్రజలకు అందజేస్తూ, రైట్‌తో కలిపిన షేర్ విలువ కేవలం 9 రూపాయిలకు దొరుకుతుంది. రైట్ మినహాయించిన షేర్ విలువ 18 రూపాయిలుగా ధర పలికేటట్లు చేసింది. ఇటువంటి మానిప్యులేషన్ గూర్చి చాలా జాగ్రత్తగా వుండాలి. సాధారణంగా ఈ విధంగా కంపెనీలు మానిప్యులేట్ చేస్తే ప్రజలు వారి వద్ద వున్న షేర్‌లు చకచకా అమ్మేసుకోవాలి సుమా.

కడప నుండి వచ్చిన శ్రీరాయుడుగారు నన్ను అరగంట సేపు తిట్టిన తిట్టు, తిట్టకుండా వుండటానికి కారణం ఏమిటి? వచ్చే వారం దాకా ఈ విషయం గూర్చి ఊహాగానం చెయ్యండి. ఎవరీ రాయుడు? ఏమా కథ? తెలిసి చెప్పక పోతే నా తల వెయ్యి వ్రక్కలవుతుంది అంటున్నారా. బాబోయ్ చెప్పేస్తాను. వచ్చే వారం దాకా ఆగండి చాలు. ఇంక శెలవా మీ రామ్‌జీకి. □

## షేర్ బ్రోకర్ అంటే ఎలా ఉండాలి?

సాధారణంగా షేర్ బ్రోకర్ అంటే ఎలా ఉండాలని మీరు కోరుకొంటున్నారు? ఇలా ఉంటే బాగుంటుంది! అని సూచిస్తూ రెండు అర టావు పేజీలకి మించకుండా రాసి పంపించండి. వీటిలో మొదటి బహుమతి పొందిన వ్యాసానికి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఒక సంవత్సరం పాటు ఉచితంగా పంపభడుతుంది. అలాగే రెండవ బహుమతి, మూడవ బహుమతి పొందిన వ్యాసాలకి వరుసగా 6 నెలలు, మూడు నెలలు పాటు వారపత్రిక ఉచితంగా పంపబడుతుంది. మీ వ్యాసాలని ఈ వారపత్రిక విడుదలైన 15 రోజులలోగా ఈ పోటీ నిర్వాహకులైన సదరన్ కన్సల్టెన్సీ సర్వీసెస్, సీతమ్మధార బ్రాంచి, సీతమ్మధార, విశాఖపట్నం (ఆం. ప్ర.) అన్న చిరునామాకి పంపాలి.

-ఎన్. రామ్‌జీ






# అందాన్ని అందించడంప్రకృతి సహజం. అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.

ACIL/025/86-Tel

## కేమియో

బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్తమలుపు ఇస్తుంది కేమియో






జయలక్ష్మీ వారి ఉత్పాదన

# "మూఢవిశ్వాసంతో జ్ఞానదంతం"

తరతరాలుగా మానవుడు లెఖ్ఖలేనన్ని మూఢ నమ్మకాలతో భయింభయంగా మనుగడను సాగిస్తూ వచ్చాడు. తాను నమ్మినదానికి వ్యతిరేకంగా ఎలాంటి నిజమయిన సంఘటన జరిగినా, దానిని రూపుమాపడానికే నడుంకట్టాడు తప్ప, నిజాన్ని ఆమోదించి దాన్ని అనుసరించడానికి ముందడుగు వేయలేకపోతున్నాడు. సోక్రటీసు వంటి మహనీయులు అనేకమంది యిలాంటి మూఢ విశ్వాసపరుల చేతులలో అన్యాయంగా బలి అయిపోయినారు.

"జ్ఞానదంతాలు" (విజ్‌డమ్ టీత్) అనే మాట తరతరాలుగా చాలమంది నోటిలో నానుతున్నమాట. మానవునిలో జ్ఞానం రావడానికి లేదా మానవ జ్ఞానోదయానికి దంతాల రాకడ అవసరమా? అని ప్రశ్నించుకుంటే, ఇదో బ్రహ్మాండమయిన మూఢనమ్మకంగా మనకు తోస్తుంది. మానవుడి పూర్తి జీవితకాలంలో మొత్తం ముప్పయి రెండు దంతాలను కలిగివుంటాడు. ఆ యా దంతాలు చేసే పనినిబట్టి అవి రకరకాల ఆకృతులను, పరిమాణాలను కలిగి వుంటాయి. కొరికే పళ్ళు కొన్నయితే, చీల్చే పళ్ళు, నమిలేదంతాలు మరికొన్ని. ఈ నమిలేదంతాలనే విసురుడు దంతాలు లేక "మోలార్స్" అంటారు. విసురుడు దంతాలుగా చెప్పబడిన దంతాలలో మూడవస్థానం ఈ జ్ఞానదంతానిది. జ్ఞాన దంతంగా చెప్పబడేయీ మూడవ విసురుడు దంతం – పదిహేడు. యిరవయి ఒక్క సంవత్సరాల మధ్య వయస్సులో వస్తుంది. బహుశ! యిదే వయస్సులో మానవుడు మానసికంగాను, శారీరకంగాను, పరిపక్వతకు చేరుకుంటాడు గనుక, పరిసర ప్రభావాలను అర్థంచేసుకొని – తానుగా ఆలోచించి ఒక నిర్దుష్టమయిన అభిప్రాయానికి రాగలుగుతాడు కనుక, విజ్ఞాన సముపార్జనలో లేడిలా గంతులువేసే మెదడును కలిగివుంటాడు కనుక – ఆ వయస్సులో వచ్చే దంతానికి జ్ఞానదంతం అనే పేరు వచ్చివుంటుందేమోగాని. జ్ఞానానికి – జ్ఞాన దంతాలకు ఏమాత్రం సంబంధంలేదు. శాస్త్రీయ పరంగాకూడ దీనిని బలపరచగల ఋజువులు లేవు. జ్ఞానదంతాలు లేకుండా గొప్ప విద్వాంసులు అయినవాళ్ళూ వున్నారు. జ్ఞానదంతాలు వుండి కూడా విద్యాహీనులయినవాళ్ళు కూడా వున్నారు.

అందుచేత తెలివైనవాడు కావడానికి – విజ్ఞాని కావడానికి, ఒక మహాపురుషుడు కావడానికి జ్ఞాన దంతాలు యేమాత్రం అవసరంలేదు. అసలు అది జ్ఞానదంతం కానేకాదు. కేవలం మూఢనమ్మకంతో మనం పిలుచుకొంటున్న మూడవ విసురుడుదంతం మాత్రమే.

అది యిలావుండగా. ఈ మూడవ విసురుడు దంతంవల్ల అనేకమయిన యిబ్బందులు వున్నాయి. మనం నిత్యం తీసుకొనే ఆహారాన్ని నమలడంలో దీని ఆవశ్యకత అంతగా కన్పించదు. పైగా దంతం వచ్చే



సమయానికి క్రింది దవడ పెరుగుదల శక్తిని కోల్పోతుంది అందువల్ల యీ దంతం పూర్తిగాపైకి పెరగలేక అస్తవ్యస్తంగా వంకరటింకరగా, పెరుగుతూ అభివృద్ధిచెందుతుంది దీనికి సరిపడినంత స్థలం దవుడలో లభించకపోవడంవల్ల యీపరిస్థితులు యేర్పడతాయి కొన్ని పరిస్థితులలో యీ దంతాలు అసలు దవుడనుండి

పైకి రాకుండా దవుడ ఎముకలో పలకే వుండిపోయి విపరీతమయిన బాధకు గురిచేస్తుంది ఈ పరిస్థితి చాలమట్టుకు క్రింది దవుడలకు సంబంధించిన దంతాలవల్ల జరుగుతుంది ఈ దంతం అన్ని దంతాలకంటే, దవుడలో చివరగా వుండడంమూలాన దంతధావనం చేసుకొనేటప్పుడు, బ్రష్ గానీ, పనుదోము పుల్లగాని ఈ చివరి దంతాలను అంతబాగా శుభ్రం చేయజాలవు అందుచేత మనం

భుజించే ఆహార పదార్ధపు అణువులు, దంతాన్ని సగంవరకు కప్పబడివుంచే చిగురుపొరకు దంతానికి మద్య చిక్కుకొనిపోయి, నోటి కుహరంలో నివశించేవేలకొద్దీ బాక్టీరియాల రసాయినిక చర్యలకు లోనయి లాక్టిక్ ఆమ్లము వంటి ఆమ్లములు విడుదలయ్యి ఆ దంతానికే కాకుండా, ప్రక్క దంతానికి కూడా పిప్పి పన్ను వ్యాధి సోకే ప్రమాదమున్నది అంతేకాకుండా, పైదవుడలోని




మూడవ విసురుడు దంతం, సరిగా పెరుగని క్రింది దవుడ దంతం పైనగల చిగురు పొరపై అనుకొని, పుండ్లు యేర్పడి విపరీతమయిన బాధకు గురి చేయడమేకాకుండా ఆ ప్రాంతం అంతా కమిలి,

బాగా వాచి, 100 నుండి 104 డిగ్రీల వరకు జ్వరం కూడా రావడానికి అవకాశంవున్నది ఈ దంతాన్ని అశ్రద్ధచేయడంవల్ల వ్యాధి ముదిరి, వ్యాధి గ్రస్తమయినప్రక్క ముఖం విపరీతంగా వాచిపోయి, దవుడలు క్రిందికి, మిదికి కదలడానికి వుపయోగపడే కండరాలలో – చీము – నెత్తురు చేరుకొని నోరు తెరవడానికి వీలులేకుండాపోతుంది ఈ పరిస్థితిని 'ట్రిస్మస్ అంటారు. చాలమంది యీ లక్షణాన్ని ధనుర్వాతపు లక్షణంగా పొరపాటు పడతారు

ఈ పరిస్థితులలో నోటినుండి భరించరాని దుర్వాసన వెలువడి, ఎదుటివారికి అసహ్యాన్ని కలుగజేస్తుంది దీనిని మరింత అశ్రద్ధచేయడం వల్ల వ్యాధి గొంతు వరకు వ్యాపించి ప్రాణానికి హానికలిగే ప్రమాదమున్నది

జ్ఞానదంతంగా చెప్పబడే ఈ మూడవ విసురుడు దంతంవల్ల జ్ఞానం మాట యెలావున్నా ఇబ్బందులు మాత్రం కోకొల్లలుగావుంటాయి అందుచేత ఈ దంతం రాకడలోని యిబ్బందులను గమనించినవెంటనే అశ్రద్ధచేయక దంతవైద్యుని సంప్రదించి తగిన వైద్యసదుపాయం పొందడం శ్రేయస్కరం

–డా. కె. ఎల్. వి. ప్రసాద్

# మీ కెయో-కార్పిన్ కేశాలతో ఈ స్టయిల్‌లో ఆకర్షణీయంగా కనిపించండి.

మి కేశాలతో ఈ స్టయిల్ ఎలా వేసుకోవాలో గమనించండి.



లను మధ్యలో భాగాలుగా యండి. రెండు తో రెండింటిని పోనిటేల్‌గా ది.



ప్రతి పోనిటేల్‌ని రెండు రెండు భాగాలుగా చేయండి —ఒక భాగం రెండవ దానికన్న వత్తుగా వుండాలి.



తలకి రెండువైపులా గల పోనిటేల్‌లోని వత్తుగల భాగాలను గుండ్రంగా ముడిచుట్టండి. తరువాత పిన్నులు పెట్టండి.



పోనిటేల్‌లోని పల్చటి భాగాలను రిబ్బనుతో చుట్టండి. ఇప్పుడు పీటితో ముడికి అన్ని వైపులా చుట్టండి. పిన్నులతో కదలకుండా వుండునట్లు అమర్చండి. అదేవిధంగా రెండవ వైపు కూడా చేయండి.






జిడ్డులేని సున్నితమైన పరిమళముగల కెయో-కార్పిన్ హెయిర్ ఆయిల్‌ను ప్రతిరోజు ఉపయోగించి మీ శిరోజాలకు సంపూర్ణ రక్షణ నివ్వండి.

ఇది మీ కేశాలను ఆరోగ్యవంతంగా, వత్తుగా ఆకర్షణీయంగా వుంచుతుంది,

అప్పుడు మళ్ళీ మీరు కావాలనుకున్న హెయిర్ స్టయిల్ వేసుకొనే ప్రయత్నం చేయవచ్చు — అన్ని విధాలా మీరు మనోహరంగా కనిపిస్తారు!

మైల్డ్‌లీ పెర్‌ఫ్యూమ్‌డ్
జిడ్డులేని హెయిర్ ఆయిల్

**ఆరోగ్యవంతమైన కేశాలు.**
**అందమైన కేశాలు.**
**కెయో-కార్పిన్ కేశాలు.**

Dey's® డే'స్ మెడికల్
నిర్మాణయంగా వాడుటకు వీలైనది



# ఈ కాలం పిల్లలు....

కె. నాగేశ్వరి

తప్పటడుగులు వేసేటప్పుడే పిల్లలు ఎదురింట పిల్లలను చూసి నవ్వుతారు స్కూలు కెళ్ళేటప్పుడు కబుర్లు చెప్పుకుంటూ వెళ్తారు పిల్లలకు ఇటీవల స్నేహం అందులోనూ కలం స్నేహం అంటే మోజెక్కువగా ఉంది

ఒకప్పుడు ఈ కలం స్నేహం యువతీ యువకులకు నిషిద్ధమనే అభిప్రాయం ఉండేది ఎంతో భయం గొల్పే విధంగా ఈ కలం స్నేహాలు తప్పుదోవ పట్టిస్తున్నట్లు నీతి చెప్పే వారు కొంత కాలం ఈ కలం స్నేహం అంత పాప్యులర్ అవలేదు విదేశాలలో ఉన్న వారితో కలం స్నేహం చేసేవారు, పిల్లలు మాత్రం చక్కని నీతితో వ్రాసేవారు

మళ్ళీ ఈకలం స్నేహాలు, వాటి మీద నవలలు, కథలు పెరిగాయి పత్రికలన్నీ దీనికో శీర్షిక పెట్టి పిల్లలను ప్రోత్సహించాయి మళ్ళీ పిల్లలు విజృంభించారు పోస్టేజి రేటు పెరిగినా వీరు వెనుకంజ వేయరు

వ్రాత వచ్చిన రోజు నుండి ఈ ఉత్తరాలు వ్రాయడం కొందరికి వస్తుంది ఉత్తరం దేనికి వ్రాస్తారు పిల్లలకు ప్రాధమిక పాఠాల్లోనే ఈ ఉత్తరం వ్రాయటం పరీక్షల్లో ముఖ్య ప్రశ్నని వేరే చెప్పక్కర్లేదు ఇలా ఉత్తరం వ్రాయడం నేర్చినవారు తమ గురించీ తమ చుట్టుపక్కల విశేషాల గురించీ ఎవరికైనా చెప్పాలని కుతూహల. పడితే దానికి మార్గం ఈ కలం స్నేహమన్నది మాత్రం నిజం స్నేహమే మధురమైనది ఆ విలువను పాటించి కొనసాగించిన కలం స్నేహం ఇంకా గొప్పది

ఆ విలువల గురించి ఈ కలం స్నేహం పేరుతో ఉత్తరాలు నడుపుకొనే వారికి తెలుసా? అబ్బే! వారికంతగా తెలిస్తే ఈ కలం ఈ రోజు ఎందరినో తప్పుడు మార్గాన పట్టిస్తాయా? ఇక్కడ ముఖ్యంగా వయసు ఉధృతంలో ఉన్న వారికి కోపం వస్తుంది చాలా మంది పిల్లలను చూస్తే కలం స్నేహపు విలువలు పడిపోయాయని తెలిసింది

ఉదాహరణకి పదవ తరగతి ఎలాగో ఓ అమ్మాయి మంచి మార్కులతో పాసవుతుంది ఇంటరులో డాక్టరు చదువుదామనో ఇంజనీరు అవుదామనో గ్రూపు తీసుకుంటుంది అంతే! ఇంక సగటు వారికంటే గొప్పదాన్నన్న భావం పాతుకు పోతుంది రాత్రీ పగలూ కష్టపడి చదివినా సీటు రావటం గగనం వెంటనే ఆ చికాకు ఇంట్లో చూపిస్తారు ఇంక ఇటువంటి వ్యాపకాలలో పడతారు ఒక విధమైన కక్షతో ఈ స్నేహాలు మొదలు పెడతారు

ఈ కలం స్నేహం ద్వారా అందరాని చందమామ లాంటి ఏ పారినులో కుర్రాడో లేక గొప్పవాడో నెమ్మదిగా వీరికి అందాలని మొదలు పెడతారు కాలక్షేపానికి లెటర్సు వ్రాసేంత తీరిక అంతటి వాడికి ఉండదని ఇంగిత జ్ఞానం వీరిలో నశిస్తుంది మనం నిన్నటి వరకూ చదివాం ఇప్పుడే కద ఊపిరి తీసుకుని తప్పుదోవంట వెళుతున్నాం అనేంత విచక్షణ లోపిస్తుంది

## కలం స్నేహాలు

ఇంక అంతటితో ఆగక మిగతా అమ్మాయిలను అబ్బాయిలను చిన్న చూపు చూడటం మొదలుపెడతారు వీరికి తల్లితండ్రుల దగ్గర భయపడే పిల్లలను చూస్తే లోకువ దానికి తోడు మైనారిటీ తీరే సమయం కూడా అప్పుడే కదా! మేజరు అవుతున్న ఇంకా అమ్మ వండిన కూర తినడానికి సిగ్గులేదూ? అని అవతలి వారిని రెచ్చగొడతారు ఆ కలం స్నేహితుడికి నువ్వు అడ్వర్టయిజ్‌మెంట్‌లో రవిశాస్త్రిలా ఉన్నావా? వెంగ్‌సర్కార్‌లా ఉన్నావా? అని వ్రాస్తారు అవతలి వాడు ఆమే లేకపోతే జుట్టు పీక్కుని నెత్తి గోడకేసి కొట్టుకోడు ఇంకా సుపర్బ్‌గా ఉన్నానని వ్రాస్తాడు ఇంక మరీ పెట్రేగి ఇంట్లో మనుష్యులని పురుషులని దులపరించినట్లు దులపరిస్తారు రోడ్డు మీద పోయే ప్రతీ అబ్బాయీ వీరికి పనికిమాలిన వాడిగా కనిపిస్తాడు

నాణానికి బొరుసు వున్నట్లే అవతలి నుండి ఈ ఉత్తరాలు అందుకొంటున్న అబ్బాయి ఏమనుకొంటున్నాడో చూద్దాం అహ! కాలక్షేపానికి బరానీ లాంటి పిల్ల దొరికింది అనుకొని వీలయినంత ఆ పిల్ల గుట్టుమట్లులు ఆలోచనలూ అన్నీ పైకి లాగుతాడు చివరికి ఆమె లోపాలు ఆమెకే ఎత్తి చూపిస్తాడు పిసరంత వివేకం ఉన్నవాడు ఆడపిల్లల బలహీనతలతో ఆడుకొనే వాడు ఇటువంటి వారికి దొరకక పోడమే మంచిది

నిజం చెప్పాలంటే కలం స్నేహంలో ఇలాంటి విషవాయువులు వీచడం శోచనీయం ఒక ఆడపిల్ల, మగపిల్ల వాడూ లెటర్స్ రాసుకోవడం ఎంత మాత్రం తప్పుకాదు తమ ఇంట్లో శిక్షణ ఎటువంటిది? తల్లితండ్రులు తమపై ఎటువంటి ఆశలు పెట్టుకున్నారు తోబుట్టువులతో ఎలా కాలక్షేపంచేస్తున్నారు అన్ని రంగాలలోనూ స్పర్ధ ఎదుర్కొంటున్న, యువత తమ సమస్యలను ఋజుమార్గంలో ఎలా పరిష్కరించుకోవాలి? ఎందుకు చదువుతున్నాం ఆ చదువు మనకెంతవరకు విజ్ఞానం ఇచ్చింది ఒక పొరపాటు చేస్తే ఇంట్లో ఎలా శిక్షించారు మళ్లీ వారికి నమ్మకం కలిగేలా ఎలా నడుచుకోవాలి? ఇలా ఆలోచనా జ్ఞానాన్ని, వివేకాన్ని, విచక్షణనూ పెంపొందించాలి ఈ స్పీడు యుగంలో కాసేపు కుదురుగా తమ భావాలను కాగితంపై నిర్మల హృదయంతో పొందుపరచి సహృదయులైన మంచి మిత్రులకి విన్నవించుకోడానికే ఈ కలం స్నేహం అనుకొన్న యువతీ యువకులు జీవితంలో తప్పకుండా విజయం సాధిస్తారు □






(గత సంచిక తరువాయి)

ఇంతలో ఆయువకుడు మోటర్‌సైకిల్ స్టార్ట్ చేసి ఆమె ముందుకొచ్చాడు.

"ఎక్కు! నిన్నెక్కడ దించాలో చెప్పు!" అన్నాడు.

హమ్మయ్య...... యితను మూగవాడుకాదు. మాటలొచ్చు..... అనుకుంది దేదీప్య.

"మా యిల్లు బంజారా హిల్స్‌లో... నేను జస్టిస్ సీతాదేవిగారమ్మాయిని! సమయానికొచ్చి కాపాడారు. థాంక్స్.... బట్..... ఆ ఫైట్ చేసిన తీరు వండ్రఫుల్‌గావుంది! ఎక్కడ నేర్చుకున్నారు?" అంది గుక్క తిప్పుకోకుండా.

"ప్రభుత్వ ప్రకటనలు నమ్మి ఆడపిల్లలు అర్ధరాత్రి ఒంటరిగా తిరక్కూడదు..... ఎక్కు!" అన్నాడతను సీరియస్‌గా.

"ఉహు.... నేనెక్కను. ముందు మీరెవరో– హఠాత్తుగా యిక్కడికెలా వచ్చారో చెప్పాలి..... లాజిక్ కుదరకపోతే తోచదు నాకు!" అంది దేదీప్య

**జరిగిన కథ– 4:** హోటల్ బ్లూనైల్‌లో రాకా దేదీప్యకు విచిత్రంగా పరిచయ మవుతాడు. దీన్‌దయాళ్‌కు రాకా నుంచి చంపుతానని బెదిరిస్తూ ఉత్తరం వస్తుంది. మృత్యువు ఏ రూపంలో రాబోతోందో దీనదయాళ్ ఊహించదు. ఆయన డ్రైవ్ చేస్తున్న కారుకి యాక్సిడెంట్ అయి మరణిస్తాడు. రాకా తాను బ్యాంకు దోపిడి చేయబోతున్నట్లు పోలీస్ కమీషనర్‌కి వార్నింగ్ ఇస్తాడు. ఆ సంగతి పోలీస్ కమీషనర్ తన తల్లికి చెప్తుండగా వింటుంది దేదీప్య. దేదీప్యను దుండగుల బారి నుండి ఒక యువకుడు రక్షిస్తాడు.

మొండిగా.

ఆ యువకుడు చిరాగ్గా చూసాడామె వేపు.

"ఆ విషయాలంత అవసరమా?"

"వైనాట్? నన్ను రక్షించిన వాళ్ళ ఊరూ పేరూ తెలుసుకోవడం నా కనీస ధర్మం.... ఎందుకంటే.... సరదాగా ఎప్పుడైనా గ్రీటింగ్స్ పంపడానికో.... ఎప్పుడైనా ఏదైనా చిన్ని గిఫ్ట్ యివ్వడానికీ.... కన్వీనియంట్‌గా వుంటుంది కదండీ?" అంది నవ్వేస్తూ.

ఆ వాతావరణంలో – ఆ పరిస్థితుల్లో వున్న ఆ అమ్మాయి అంత ఈజీగా మాట్లాడ్డం చూసిన ఆ యువకుడు క్షణం విస్తుపోయి–

"నేనో సామాన్యుణ్ణి. అనుకోకుండా అక్కడున్నాను గనుక మీకు సహాయం చేసాను. గిఫ్ట్‌లూ– గ్రీటింగ్‌లూ అంటే గిట్టదు నాకు! అందుకే మిగిలిన వివరాలు చెప్పను!" అన్నాడు.

తనలాంటి అందమైన అమ్మాయి 'గిఫ్ట్' యిస్తానంటే 'ముద్దు' గిఫ్ట్‌గా కావాలని అడుగుతాడేమో..... నని నాలుక కొరుక్కునే సమయంలో అతనలా గిట్టదనే సరికి అతని మీద కొంత సదభిప్రాయం కలిగి బైక్ ఎక్కింది. యిరవై నిముషాల్లో ఆమె యింటిముందు ఆగింది మోటర్‌సైకిల్. దేదీప్య దిగగానే–

"చూడమ్మాయ్! యింత స్మార్ట్‌గా.... అందంగా వున్నావ్. మరి నిన్ను నువ్ రక్షించుకోడానికి కరాటే లాంటి దేదైనా నేర్చుకోకూడదూ. పైగా ఫైట్స్ అంటే ఆసక్తి వున్నట్టు కనబడుతున్నావ్? అన్నాడతను ఎటో చూస్తూ.

"అతని మాటల్లో అందమైన ఆడపిల్లని రక్షించానన్న ఎక్సైట్‌మెంట్ లేదు. సలహా యిస్తున్న ఉత్సుకత లేదు. చాలా మామూలుగా గోడకి చెప్పినట్లు చెప్పాడు!

దేదీప్య మనసు చివుక్కు మంది. కాస్త కోపం కూడా వచ్చింది. అది అతను తన వేపు చూడనందుకు! పైగా చిన్న పిల్లలకి యిచ్చినట్లుగా సలహా యిచ్చినందుకు!

"మీ సలహా పాటిస్తాను గానీ యింతకీ తమ రెవరో– తమ నామధేయ మేమిటో సెలవిస్తారా?" అంది కాస్త వ్యంగ్యంగా.

"నా పేరు రాకా!"

ఒక్క క్షణం – తన చెవులను తనే నమ్మలేక పోయింది.

"రా..... కా......!?!?"

తన కలల హీరో! సాహసి!

ఆమెకి కొన్ని క్షణాలు నోట మాట రాలేదు.

రాకా తన పని అయిపోయినట్లు బైక్ స్టార్ట్ చేసాడు.

దేదీప్యలో సడెన్‌గా చలనం కలిగింది.

ఆసక్తిగా..... ఒళ్ళంతా కళ్ళు చేసుకుని అతన్ని చూసింది.

"సార్..... నేను..... అదే ఆరోజు హోటల్లో..... పువ్వు..... " ఆమెకి ఆ రోజు జరిగిన సంఘటన ఎలా గుర్తు చెయ్యాలో అర్థం కాలేదు. పైగా ఆ రోజు గెటప్ వేరు. అప్పటికీ యిప్పటికీ ఎంత తేడా?

ఒక నొటోరియస్ క్రిమినల్ అయుండి – ఒక జస్టిస్ యింటి ముందు ఎంత ధైర్యంగా ఆగి – కూపిగా తనతో మాట్లాడాడు?

యస్ .....! దటీజ్ రాకా! యస్!" అనుకుంటూ పట్టలేని ఉద్వేగంతో ....

"అయాం వెరీ గ్లాడ్‌టూ మీట్ యూసర్..... యస్ వెరీగ్లాడ్...." అని చటుక్కున ఏదో గుర్తొచ్చిన దాన్లా.....

"సర్..... రేపు చెయ్యబోయే బ్యాంక్ ఆపరేషన్లో కారు గానీ వ్యాన్‌గానీ వాడకండి. నేను మీ ఫాన్‌ని! నా పేరు దేదీప్య.... మీ రంటే నాకు చచ్చేంత యిష్టం

హెల్త్ హోం ప్రాడక్ట్స్ ప్రై. లిమిటెడ్, సికింద్రాబాద్ సమర్పిస్తున్న స్పెషల్ సీరియల్

ప్రామిస్' అంటూ చటుక్కున వంగి అతని చేతిని ముద్దుపెట్టుకుంది

క్షణం విస్తుపోయి ఆమెని తేరిపార చూసాడా యువకుడు

థాంక్స్' అన్నట్టుగా అతని పెదవులు కదిలాయి

మరుక్షణం మోటర్సైకిల్ ముందుకు దూసుకు పోయింది క్షణంలో కనుమరుగైన అతని రూపాన్ని కళ్ళంతా నింపుకున్న దేదీప్య కలలోలా లోనికి నడిచింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలు –

కమీషనర్ ఆఫ్ పోలీస్ అఫిషియల్ చాంబర్స్ –

మరొక్క నాలుగు గంటలు అప్రమత్తంగా వుంటే చాలు రాకా పెట్టిన 36 గంటల గడువు పూర్తవుతుంది తన గండం గట్టెక్కుతుంది అనుకున్న పోలీస్



కమీషనర్ చక్రవర్తి రిలాక్సింగ్‌గా కుర్చీలో వెనక్కి వాలాడు.

నిజానికి తన జూరిస్ డిక్షన్ చాలా పెద్దది. మొత్తం జంటనగరాల్లో కొన్ని వందల బ్యాంకులున్నాయి. రాకా ఏ టైంలో ఏ రూపంలో వస్తాడో, ఏ బ్యాంక్‌ను దోచుకుంటాడో వూహించడం కష్ట సాధ్యమైన విషయం. అందుకే తను అన్ని బ్యాంకుల దగ్గరా పటిష్టమైన బందోబస్తు ఏర్పాటు చేయించాడు.హోం మినిస్టర్ సహకారంతో స్పెషల్ పోలీస్ బెటాలియన్లు రంగంలోకి దిగాయి.

తను చేసిన బందోబస్తు ఏర్పాట్ల మీద ఎంత నమ్మకమున్నా రాకాని తక్కువగా అంచనా వెయ్యడానికి లేదు. అర్ధరాత్రి ఎంత గార్డింగ్ వున్నా స్వయంగా తన యింటికి వచ్చి భీబత్సం సృష్టించి వార్నింగ్ యిచ్చిన వాడు పోలీస్ శాఖ చేసే ఏర్పాట్లను ముందే వూహించ గలడు. తమ ఎత్తులకు పై ఎత్తు వేసి దెబ్బతీయగలడు రాకా. యిది పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి రాకా చరిత్ర నేర్పిన పాఠం.

ఏది ఏమైనా యిది తన ప్రెస్టీజ్ యిష్యూ. ముందుగా వార్నింగ్ యిచ్చినా దోపిడీని ఆపలేకపోతే జరిగే పర్యవసానం ఎలా వుంటుందో తను వూహించగలడు.

అందుకే.... అందుకే.... తను ఏదో ఒకటి చెయ్యాలి అనుకుంటూ కుర్చీలోంచి లేచి సిగరెట్ వెలిగించాడు చక్రవర్తి. ఏదో తెలీని భయం తాలూకు నీడలు అతన్ని వెంటాడుతున్నాయి.

తలుపు దగ్గర అలికిడయే సరికి ఎలర్ట్ అయాడు. అతని చెయ్యి అప్రయత్నంగా సర్వీస్ రివాల్వర్ మీది కెళ్ళింది.

"గుడ్ మార్నింగ్ సార్....."

అంటూ లోపలికి ప్రవేశించిన నలుగురు డిప్యూటీ కమీషనర్స్‌ని చూసి సర్దుకుని

"వెరీ గుడ్ మార్నింగ్..... కూర్చోండి. ఎలా వున్నాయ్ ఏర్పాట్లు" అడిగాడు చక్రవర్తి.

"ఆల్‌రైట్ సార్..... అన్ని బ్రాంచెస్ దగ్గరా ముగ్గురు సబ్ యిన్స్‌పెక్టర్స్, యిరవై మంది కానిస్టేబుల్స్, ఓ సర్కిల్ యిన్‌స్పెక్టర్‌ని వుంచాం. ప్రతి పది బ్యాంకులకీ ఓ అసిస్టెంట్ కమీషనర్ యిన్ చార్జ్‌గా రౌండ్స్ చేస్తూంటాడు. వాళ్ళే కాక ప్రతి బ్యాంకునీ ఒక స్పెషల్ పోలీస్ వ్యాన్‌లోని ఆర్మ్‌డ్ రిజర్వ్ పోలీస్ కాపలా కాస్తుంటుంది". వివరించాడు నార్త్ జోన్ డి. సి. పి. ప్రకాష్ రాయ్.

"అన్ని కీలకమైన బ్రాంచీల దగ్గరా మెటల్ డిటెక్టర్లు ఏర్పాటు చేసాం. వాహనాల పార్కింగ్ బ్యాంకుకు దూరంగా వుంటుంది. ప్రతి బ్యాంకుకి అటూ – యిటూ వందగజాల దూరంలో పు ఏ వెహికిలూ ఆగడానికి వీల్లేదు. ముఖ్యంగా కార్లు వాన్లు– ఆఖరికి బ్యాంక్ సిబ్బంది వెహికల్స్ కూడ. సో..... మన బందోబస్తు ఏర్పాట్లన్నిటినీ ఛేదించుకుని లోపలికెళ్ళి దోచుకో గలిగినా పారిపోవడానికి ఏ వాహనమూ వుండదు 'రాకా'కి".

ఉత్సాహంగా చెప్పాడు ఈస్ట్ జోన్ డి. సి. పి.

"వెల్.....బాగుంది. మీదగ్గర పరిస్థితి ఎలా వుంది రావుగారూ.... ?" దక్షిణ మండలం డిప్యూటీని ఉద్దేశించి అడిగాడు చక్రవర్తి.

"ఫైన్‌సర్..... ఎవ్విరీథింగ్ ఈజ్ ఓ. కే. మరో అరగంటలో నా జోన్‌కి చేరుకుంటాను. అరేంజ్ మెంట్స్ అన్నీ పర్సనల్‌గా సూపర్‌వైజ్ చేస్తున్నాను. ఆ రాకా మారు వేషంలో వస్తాడేమోనని గడ్డం వున్న ప్రతి వ్యక్తినీ, బురఖాలో వున్న ప్రతి స్త్రీనీ ముసలి వాళ్ళనీ క్షుణ్ణంగా చెక్ చేసి బ్యాంకులో పలికి పంపే ఏర్పాట్లు చేసాం!! అంటూన్న అతని మాటల్ని కట్‌చేస్తూ.

"ఆ విషయంలో జాగ్రత్త. గడ్డం వున్న వాళ్ళనీ, బురఖా స్త్రీలను, మారువేషంలో • వున్నారేమోననే అనుమానంతో చెక్ చేస్తే పబ్లిక్ గొడవ చెయ్యొచ్చు. అసలే మీది పాత బస్తీ ఏరియా.మాట్లాడితే మతకలహాలంటారు. రెలిజియస్ సెంటిమెంట్స్‌ని దెబ్బతియ్యకుండా జాగ్రత్తగా వ్యవహరించండి". అన్నాడు చక్రవర్తి.

"అలాగేసార్.... కానీ ఒక్కో కస్టమర్‌ని మాత్రమే బ్యాంకులోపలికి పంపే ఏర్పాటే యిబ్బందిగా వుంటుందిసార్...... కొన్ని పెద్ద పెద్ద బ్రాంచీల దగ్గర పదిన్నర కల్లా కనీసం వందమంది కస్టమర్స్ వుంటారు. అలాంటి చోట్ల ఒకళ్ళ తర్వాత ఒకళ్ళని లోపలికి పంపడం అంటే....?" నసిగాడు డి. సి. పి. రావు.

"తప్పదు మిస్టర్ రావ్..... ఆ విషయం మీద ఏ గొడవలూ జరక్కుండా లా అండ్ ఆర్డర్‌ని కంట్రోల్ చెయ్యాల్సిన బాధ్యత మనది. ఈ విషయంలో లీగల్ ఒపీనియన్ కూడ తీసుకున్నాం. మీరు నిర్భయంగా వ్యవహరించండి. ఎనీవే నలభైరెండు పెట్రోలింగ్ వ్యాన్స్ డ్యూటీలో నిర్విరామంగా పని చేస్తున్నాయ్. మధ్యాహ్నం ఒంటిగంట వరకూ మనం జాగ్రత్తగా వుంటే ఆ 'రాకా'ని తప్పకుండా ట్రాప్ చెయ్యగలమనే నమ్మకం నాకుంది. ఐ విష్‌యూ ఆల్‌ది బెస్ట్.... " అన్నాడు చక్రవర్తి.

"థాంక్యూ..... సర్.... వుయ్‌షెల్ డూ అవర్ బెస్ట్" అంటూ లేచారు డి. సి. పి. లు నలుగురూ.

అంతలోనే "ఆఁ.... మరో విషయం.... అన్ని బ్యాంక్స్‌లో స్టాఫ్‌నీ బ్యాంక్ అవర్స్‌కి అరగంట ముందే లోపలికి పంపే ఏర్పాట్లు జరిగాయ్. ప్రతిస్టాఫ్ మెంబర్‌కీ నా సంతకం వున్న ఒక ఐడెంటిఫికేషన్ లెటర్ యిచ్చాం. దాని మీద ఆ వ్యక్తి ఫొటో, ఆ ఫొటో మీద నా సంతకం వుంటాయ్. ఫొటోని, నా సంతకాన్ని పరిశీలించాకే బ్యాంక్ స్టాఫ్‌ని, ఆఖరికి మేనేజర్ నైనా లోపలికి పంపాలి. ఈ విషయం ఎ. సి. పి. లందరికీ మెసేజెస్ వెళ్ళాయ్. ఎనీవే దిసీజ్ ఫర్ యువర్ యిన్‌ఫర్మేషన్. ఈ ఏర్పాటు అనుకోకుండా చేయ్యాల్సొచ్చింది. ఓ. కే...."

అంటూ నలుగురివేపూ పరిశీలనగా చూసాడు కమీషనర్ చక్రవర్తి.

"ఓ. కే. సార్.... ప్రతి అరగంటకీ మేం ఎక్కడున్నా మిమ్మల్ని వైర్‌లెస్‌లో కాంటాక్ట్ చేస్తాం."

అంటూ సెలవు తీసుకున్నారా నలుగురు డి. సి. పి. లు.

అంతలో –

టేబుల్ మీద ఫోన్ రింగయింది. రిసీవరెత్తి

"యస్......" అన్నాడు చక్రవర్తి. క్యాంప్ క్లర్క్ లైన్లోకొచ్చాడు.

"ఎవరో రాకేష్‌ట సర్..... మీతో మాట్లాడాలంటున్నారు. యివ్వమంటారా....?" అడిగాడు సి. సి.

"వెంటనే యివ్వు......" అసహనంగా అన్నాడు చక్రవర్తి.

"గుడ్‌మార్నింగ్ కమీషనర్. ఏర్పాట్లన్నీ కింద అధికారులకి ఒప్పజెప్పి నువ్ హాయిగా ఆఫీస్‌లో కూర్చున్నావా.....? యిదేం బాగలేదు. యింకా టైం మూడున్నర గంటలే వుంది. హరీయప్.... స్వయంగా రంగంలోకి దిగు. నేనేంటో తెలుస్తుంది.



గంభీరంగా పలికింది అవతలి కంఠం.

"హలో ..... హలో ..... ఎవరు నువ్వు.... ?"

మాట్లాడేది రాకా అని తెలిసినా కంగారులో అమాయకంగా అడిగేసాడు చక్రవర్తి.

"హ్హా.... హ్హా....హ్హా..... నిద్రాహారాలు మానేసి నా పేరే జపం చేస్తున్నారుగా మీ డిపార్ట్‌మెంట్ అంతా! మళ్ళీ చెప్పాలా...."

అంటూ హాస్యాస్పదంగా నవ్వింది అవతలి కంఠం.

ఫోన్ కట్ అయింది. కొన్ని వందల వేల మంది రాకాలు తనను చూసి హేళనగా నవ్వుతూ అపహాస్యం చేస్తున్నట్లనిపించింది. చక్రవర్తికి అతని చెయ్యి రివాల్వర్ మీద బిగుసుకుంది.

నిటారుగా లేచి నిల్చున్నాడు.

అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భారంగా వున్నాయ్.

పెద్ద పెద్ద అడుగులతో ఛాంబర్స్ బయటికొచ్చి కారువేపు నడిచాడు పోలీస్ కమీషనర్ చక్రవర్తి.

* * * * * * * * * *

పది గంటలు –

మారేడ్‌పల్లిలోని కమర్షియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా– పోలీస్ వలయంలో సురక్షితంగా వుంది.

బ్యాంక్‌లోపల ఒక సబ్‌యిన్‌స్పెక్టర్ ఆరుగురు కానిస్టేబుల్స్ వెయ్యి కళ్ళతో బ్యాంక్ నలుమూలల్ని పర్యవేక్షిస్తున్నారు.

గేట్లో యిన్‌స్పెక్టర్ రంగారావు బ్యాంక్ స్టాఫ్ ఐడెంటిఫికేషన్ లెటర్స్ చెక్ చేస్తున్నాడు.

"ఏమోయ్.... పరమశివం.... ఏమిటి? నీ జ్వరం యింకా తగ్గలేదా? మఫ్లర్ కట్టుకున్నావ్..... ?"

అప్పుడే అక్కడికొచ్చిన క్యాషియర్‌ని పరామర్శించాడు మేనేజర్ సదానందం. తన ఐడెంటిఫికేషన్ లెటర్ యిన్‌స్పెక్టర్‌కి చూపిస్తూ.

తగ్గలేదన్నట్టు ఆపకుండా నాలుగు తుమ్ములు తుమ్మాడు పరమశివం.

"కనీసం ఆరోగ్యం బాగలేనప్పుడైనా ఈ అయ్యప్ప దీక్ష ముగించవచ్చు కదా! చన్నీళ్ళ స్నానాలూ, స్వయం పాకాలు అయితే జ్వరం ఎలా తగ్గుతుంది......?" అతని గడ్డం, నల్లటి బట్టల్ని చూస్తూ సలహా యిచ్చాడు సదానందం.

"లేదు సార్..... అచంచల దీక్షతో అయ్యప్ప స్వామిని కొలిచే వాణ్ని. ఈ జ్వరం నన్నేం చేస్తుంది సార్....... "

అంటూ చెకింగ్ పూర్తి చేసుకుని బ్యాంక్‌లోకి అడుగుపెట్టాడు పరమశివం.

"సార్..... ఆ రాకా గారు మన బ్యాంక్‌కే వేస్తారేమోనని భయంగా వుందిసార్.....'

మేనేజర్ చేతిలోని బ్రీఫ్‌కేస్‌ని అందుకోబోయాడు మెసెంజర్ కృష్ణ.

"ఛీ..... నోర్ముయ్..... పొద్దున్నే అపశకునాలు.....?

అని తనో క్యాబిన్‌లో కెళ్ళి బ్రీఫ్‌కేస్ తెరిచిన సదానందం పరమశివం లోపలికి రావడంతో తక్కున బ్రీఫ్‌కేస్ మూసేసి 'ఏమిటి?' అన్నట్టు చిరాగ్గా చూసాడు పరమశివం వేపు.

"ఏం లేదుసార్...... ! వున్న పదిమందిలోనూ యివాళ నలుగురు ఆబ్సెంట్. క్యాష్ చెస్ట్ ఓపెన్ చెయ్యాలిగదా! నాక్కూడ భయంగా వుంది సార్..... ఆ రాకా గాడు వచ్చి మనల్ని చితగ్గొట్టేసి...... "

భయంగా అన్నాడు పరమశివం. అంతలోనే అక్కడి కొచ్చిన మెసెంజర్ కృష్ణ –

"అలా అడగండిసార్..... ఈ ఒక్కపూటికి బ్యాంక్ మూసేద్దామని మేనేజర్ గారికి నేను కూడ చెప్పానుసార్.... ఆయన ససేమిరా వీల్లేదన్నారు..." అన్నాడు.

"ఛ..... ఛ... మీరేం స్టాఫయ్యా..... ఎందుకంత ఒణికి పోతారు..... ? నేను లేనూ.....? పైగా మధ్యాహ్నం నుంచి బ్యాంక్ మీ మీ దొడిలేసి బయటికెళ్ళామను కుంటున్నాను ఓ అర్జంట్ పనిమీద.....!"

# విజ్ఞానం-వినోదం

బాబ్‌బ్రౌన్



**సమస్య**

ఆవలింత

**అవసరం**

పరిశీలన

**ఇలా చేయండి**

జన సమర్థం గల నిశ్శబ్ద ప్రదేశంలో ఎదుటి వ్యక్తి మీ వైపు చూస్తున్నప్పుడు మీరు ఆవలించండి. ఎదుటి వ్యక్తి కూడా ఆవలించే టందుకు అవకాశం ఉంటుంది.

**ఎందుకని?**

ఇది కేవలం సూచన. సూచన ఇచ్చిన ప్రతిసారీ దానిని ఎదుటి వాడు సరిగా అర్థం చేసుకోవాలని లేదు. మీ చెవి దగ్గర గీరు కోండి. ఎదుటి వ్యక్తి అదే పనిని ఎన్నిసార్లు చేస్తున్నాడో గమనించండి. వ్యాపారంలో ప్రత్యేకించి అమ్మకాలలో సూచన చాలా ముఖ్యమైన విషయం.

అన్నాడు మేనేజర్ సదానందం తన బ్రీఫ్‌కేస్ మీద తృప్తిగా చెయ్యేసి.

"మీరు నిర్భయంగా వెళ్ళండిసార్. మేముండగా మీకేం భయం?" అన్నాడు ఆ మాటలు విన్న సాయుధ సబ్ యిన్‌స్పెక్టర్.

"మీ బొంద..... పోలీసుల ప్రామిస్‌లూ, రాజకీయ వాగ్దానాలు ఎవరికి తెలీదూ....?!" .... మనసులో నే అనుకున్నాడు పరమశివం.

సర్లే మధ్యాహ్నం సంగతి ఆలోచిద్దాం గానీ..... ముందు క్యాష్ చెస్ట్ తెరుద్దాం పద..... "

అని తన బ్రీఫ్‌కేస్ 'డ్రా'లో పెట్టి లాక్ చేసి తాళాలు పట్టుకుని స్ట్రాంగ్‌రూం వేపు నడిచాడు మేనేజర్ సదానందం.

సరిగ్గా అరగంట తర్వాత

ఆ బ్యాంక్ ముందాగింది ఓ బుల్లెట్ మోటార్ సైకిల్.

దాని మీంచి తన భారీ కాయాన్ని నెమ్మదిగా దించి భారంగా బ్యాంక్ వేపు అడుగులేసాడు యిన్‌చార్జ్ సర్కిల్ యిన్‌స్పెక్టర్ కుక్కుటేశ్వర్రావు.

"గుడ్ మార్నింగ్ సార్..... "

అప్పటికే గేట్‌ముందు గుంపుగా వున్న కస్టమర్స్‌ని కంట్రోల్ చేస్తూ సర్కిల్‌కి సెల్యూట్ చేసాడు సబ్ యిన్‌స్పెక్టర్ రంగారావు.

"మార్నింగ్..... మార్నింగ్ ..... ఏమిటి గొడవ..... "

తాపీగా అడిగాడు.

"అదేసార్.... ఆ రాకా....." ఏదో చెప్పబోయాడు రంగారావు.

"రాకా..... అహ్హా.... హ్హా..... హ్హా...... ఎక్కడ....? ఎక్కడా రాకా... ? కమాన్.... చెప్పు త్వరగా ... వాడిటొక్క చించి చొక్కా కుట్టించుకుంటానని శపధం చేసాను".

అంటూ వికటంగా నవ్విన కుక్కుటం పొట్ట గమ్మత్తుగా కదిలింది.

"అదికాదు సార్ వాడు ఏరూపంలో వస్తాడో నని..... " నసిగాడు యస్సై.

"చెప్పానుగా..... వాడు చీమ..... దోమ..... ఏ వేషంలో వచ్చినా వాడిటొక్క.....'

"మీరు చించేస్తారు సార్.... మాకు తెలుసు. కానీ ముందు ఈ కస్టమర్స్‌ని కంట్రోల్ చెయ్యాలి....."

"యస్.... యస్...." అంటూ రెండడుగులు ముందుకేసి "కమాన్

కస్టమర్స్ లైన్లో నిలబడండి ప్లీజ్

అన్నాడు కుక్కుటం

ఏం లైన్లో నిలబడ్డమండీ బాబూ చచ్చిపోతున్నాం

విసుగ్గా అన్నాడో కస్టమర్

మీరు చచ్చిపోకుండా వుండాలన్నదే మా కోరిక అందుకే యింత కట్టుదిట్టమైన ఏర్పాట్లు యివ్వాల్టితో ఆ రాకాగాడు అవుట్ రేపట్నుంచి మీరంతా హాయిగా నెత్తిన చెయ్యేసుకుని సారీ ఎవరి గుండెల మీద వాళ్ళు చెయ్యేసుకుని సుఖంగా నిద్రపోవచ్చు వివరించాడు కుక్కుటం

యస్సైలూ కానిస్టేబుల్స్ అంతా కలిసి కస్టమర్స్ అందర్నీ 'క్యూ'లో నిల్చోబెట్టారు

మొదటి కస్టమర్ని లోపలికి పంపించడానికి గ్రీన్ సిగ్నల్ యివ్వమన్నట్టుగా కుక్కుటం వేపు చూసాడు యస్సై

ముందుకి నడిచి ఆ కస్టమర్ని ఎగాదిగా చూసి

నీ పేరేంటీ? రీవిగా అడిగాడు కుక్కుటం

పోపట్‌లాల్ పోపట్ అండ్ పోపట్ కంపెనీకా మాలిక్ హూఁ ' చెప్పాడా

అరిచినట్టుగా అన్నాడు అసిస్టెంట్ కమీషనర్ కుందన్‌లాల్

పోపట్ లాల్‌ని వదిలేసి గున్న ఏనుగులా ఎ సి పి దగ్గరికి పరుగెత్తాడు కుక్కుటం

'వాట్టీజ్ దిస్ నాన్సెన్స్ కస్టమర్స్‌తో బిహేవ్ చెయ్యడం యిలాగేనా? బుద్ధిలేక పోతే సరి నీలాంటి స్పెసిమెన్స్ వుండబట్టే డిపార్ట్‌మెంట్ యిలా తగలబడింది కమాన్ బిహేవ్ యువర్‌సెల్ఫ్

అనేసి కారు పోనిమ్మట్టుగా డ్రైవర్‌కి సైగ చేసాడు ఎ సి పి కుందన్‌లాల్

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

మద్యాహ్నం పన్నెండు గంటల నలభై నిముషాలవుతోంది

బ్యాంక్ ముందు వేసివున్న కుర్చీలో దిగులుగా కూర్చుని టీ" తాగుతున్నాడు కుక్కుటేశ్వర్రావ్ తాగుతూ ఆలోచిస్తున్నాడు

అయిపోయింది రాకాని పట్టుకోడానికి తన కొచ్చిన రెండో అవకాశం కూడా చెయ్యి జారిపోతోంది యింక యిరవై నిముషాలే టైముంది

ఈ యిరవైనిముషాల్లో రాకా వస్తే '

తను పట్టుకుంటే '

## గడుసులోకం —బాబు







కస్టమర్

పోపట్‌లాల్ వెరీగుడ్ నేమ్ పొట్నాలు కట్టుకునే బిజినెసా?

క్యా బోల్తాహై అర్థం గానట్టు కుక్కుటం వేపు చూసాడా కస్టమర్

ఏం లేదు నీ నెత్తిన ఆ బొచ్చు టోపీ ఎందుకూహై ? టోపీని పరిశీలనగా చూస్తూ అడిగాడు కుక్కుటం

టోపీ ఓ ఆదా అది మాది రివాజ్‌హై

యిలాంటి పిచ్చి పిచ్చి రివాజులన్నీ పెట్టుకుని నా కళ్ళలోనే కారం కొట్టాలనుకుంటున్నావా మిస్టర్ రాకా నువ్వు పోపట్‌లాల్ వేషంలో వస్తే కనిపెట్టలేననుకుంటున్నావ్ కదూ '

అయిపోయింది ఈ రోజుతో నీ పని ఫినిష్ నీ రివాజుల బూజులు దులిపేస్తా కాసుకో

అంటూ రెండు చేతుల్తో బలంగా కావలించుకుని కదలకుండా పట్టుకున్నాడు కుక్కుటం

సరిగ్గా అదే సమయంలో అక్కడ ఆగిన కార్లోంచి

మిస్టర్ కుక్కుట్ కం హియర్

యాభై వేల రూపాయల బహుమానం

పోలీస్ పతకం

డి యస్ పి ప్రమోషన్

అన్నీ కళ్ళముందు మెదిలాయ్ కుక్కుటానికి

అదే సమయంలో బ్యాంక్ లోపల

ఏం శివా ? నీ అయ్యప్ప దీక్ష యింకా ఎన్నాళ్ళు ?

క్యాష్ కౌంటర్లో కూర్చుని వున్న పరమశివాన్ని అడిగాడు లెడ్జర్ కీపర్ లలిత్‌కుమార్

మరో పది రోజులు అంతే

అది సరేగానీ వచ్చిన దగ్గర్నుంచీ చూస్తున్నాను మన మేనేజర్ గారు మాటి మాటికీ బ్రీఫ్ కేస్ తెరిచి ఎవరన్నా చూసేసరికి మూసేస్తున్నారు నువ్వు అబ్జర్వ్ చేసావా ?

అవును లలిత్ క్యాష్ చెస్ట్ ఓపెన్ చేద్దామని అడగడానికి పొద్దున్నే క్యాబిన్‌లో కెళ్ళాను అప్పటి వరకూ తెరిచి వున్న బ్రీఫ్‌కేస్ రక్కున మూసేసాడు నువ్వు అంటుంటే నాకూ అనుమానం వస్తోంది కారణం ఏమై వుంటుందబ్బా

అని

"అవన్నీ మనకెందుకు గానీ..... ఈ రాకా పుణ్యమా" అని లోపల మనకెక్కువ హడావుడి లేదు. హాయిగా వుందిగదూ!" అన్నాడు పరమశివం.

అంతలో ఎవరో కస్టమర్‌లోపలికి రావడంతో బిజీ అయిపోయారిద్దరూ. సరిగ్గా అదే సమయానికి

మిలిటరీ జీప్‌ని దూరంగా పార్క్ చేసి చేతిలో చిన్న బ్రీఫ్‌కేస్‌తో బ్యాంక్ ముందు కొస్తున్నాడు మిలిటరీ డ్రస్‌లో వున్న ఓ సర్దార్‌జీ.

దూరం నుంచే అతన్ని గమనిస్తున్న కుక్కుటేశ్వర్రావ్‌లో ఏదో ఆశా చిరుదీపం వెలిగింది.

"ఏ సబ్ క్యా హోరహాహై.... ?"

వస్తూనే చిరాగ్గా అడిగాడు ఆ సర్దార్‌జీ. తన అనుమానాన్ని తాత్కాలికంగా అణిచేసుకుని వివరంగా..... రాకా విషయం చెప్పి 'క్యూ'లో నిలబడమన్నాడు కుక్కుటం.

అతన్ని విదిలించి కొట్టి జేబులోంచి ఐడెంటీకార్డు తీసి చూపించాడు సర్దార్‌జీ. ఆ కార్డ్‌ని చేతిలోకి తీసుకుని పరిశీలనగా చూసాడు కుక్కుటం. 'బ్రిగేడియర్ సుర్జీత్‌సింగ్' హైదరాబాద్ ఆర్టిలరీ విభాగానికి చెందిన ఐడెంటిటీకార్డు అది. ఫోటోలోని వ్యక్తినీ అతన్నీ పరీక్షించాయ్. కుక్కుటం పోలీస్ కళ్ళు. పోలికలు కలిసాయ్. అయినా ఈగడ్డం వెనకే అసలు రహస్యం వుండచ్చు అనుకుని.

"అచ్చా సర్దార్‌జీ..... లోపలున్న కస్టమర్ రాగానే మీరే వెళ్ళురుగాని.... అవును సర్దార్‌జీ.... మీ గడ్డం మీసం బహుత్ అచ్ఛాహై.... ఏం వేసి పెంచుతారు?"

చమత్కారంగా అతని గడ్డం మీద చెయ్యి వెయ్యబోయాడు కుక్కుటం.

ఛత్..... హటో ... ఈ గడ్డం, మీసం మిలటరీ వాళ్ళకి మగవాళ్ళకీ వుండేవి, మీ సివిల్ వాళ్ళకి వుండేది యివే...."

కుక్కుటం పొట్టని వేలితో పొడిచాడు సర్దార్‌జీ.

"సర్దార్‌జీకూ హాస్యం అచ్చావచ్చు...."

అంటూ రాని నవ్వుని తెచ్చుకుని అతని భుజం మీద చెయ్యేసాడు కుక్కుటం. ఆ చేతి వేళ్ళు భుజం మీద నుంచి పాకి సర్దార్‌జీ గడ్డంలోంచి పొడుచుకు కొచ్చిన ఓ వెంట్రుకని బలంగా లాగాయ్.

**అంతే –**

**"అరే...... హరామ్ ఖోర్......"**

పిడుగు పడ్డట్టుగా అరిచి కుక్కుటం మెడని దొరకబుచ్చుకున్నాడు. అతని బాహుబంధం నుంచి తమ సర్కిల్ యిన్స్పెక్టర్‌ని విడిపించడానికి పోలీస్ సిబ్బంది అంతా రెండు నిముషాలు సర్దార్జీతో పెనుగులాడాల్సి వచ్చింది.

**అంతలో –**

బ్యాంక్‌లోపలి కెళ్ళిన కస్టమర్ బయటికొచ్చేసాడు.

ఆత్రంగా గుమ్మం వేపు అడుగేసాడు సర్దార్‌జీ.

"ఎక్స్క్యూజ్‌మీ..... మీ రివాల్వర్ యిక్కడ హాండోవర్ చెయ్యండి. మీరు బయటికి రాగానే తీసుకోవచ్చు"

మర్యాదగా యింగ్లీష్‌లో చెప్పాడు యస్సై. మారు మాట్లాడకుండా తన నడుంకున్న సర్వీస్ రివాల్వర్ యిన్స్పెక్టర్ చేతికిచ్చి బ్రీఫ్‌కేస్‌తో సీరియస్‌గా బ్యాంక్‌లోపలి కడుగు పెట్టాడు సర్దార్‌జీ.

అప్పుడే లోపలున్న యిన్స్పెక్టర్ కౌంటర్ వేపు నడిచాడు.

సరిగ్గా అదే సమయంలో క్యాబిన్‌లో వున్న మేనేజర్ వాచ్ చూసుకున్నాడు.

పన్నెండు గంటల యాభైనిముషాలు –

టేబుల్‌డ్రాలోంచి బ్రీఫ్‌కేస్ తీసి టేబుల్‌పైన పెట్టి బ్రీఫ్‌కేస్ ఓపెన్ చేసాడు మేనేజర్ సదానందం.

(ఇంకా ఉంది)




అగ్రహారం నడిబొడ్డు నున్న ఆ పాత కాలం నాటి పెంకుటింట్లో చావు కళ చూరుల్ని పట్టుకు వేలాడుతోంది

ఆ ఇంటి నాలుగు గోడల మధ్య భయంకరమైన నిశ్శబ్దం రాజ్యమేలుతోంది

ఆ ఇంటి కిటికీలోంచి బయటకు చూస్తే అంతా చీకటిగా ఉంది వీధి లైట్లు చాలాసేపై ఆరిపోయాయి చల్లగాలి రివ్వున వీస్తోంది ఉండుండి మెరుపులు తళుక్కుమంటున్నాయి నల్లని ఆకాశం వర్షించడానికి ఉవ్విళ్ళూరుతోంది

ఆ ఇంటి వీది గదిలో వాలు కుర్చీలో జారబడి కూర్చున్న సీతారామయ్యగారు మౌనంగా కిటికీలోంచి బయటకు చూస్తున్నారు

ఆయన మనసు నిండా నిరాశ, నిస్తేజం, నిర్లిప్తత

ఆయనలో ఒంటరితనం ఎడారిలా

ఏ స్పందనలు లేవు

ఏ కోరికలు లేవు

వృద్ధాప్యం పులిలా మీద పడి ఒంటరిగా బారంగా చావు కోసం ఎదురు చూస్తూ రోజుల్ని వెళ్ళదీస్తున్నారు

మనసుకు శాంతిలేదు

బ్రతుకు మీద ఆశ లేదు

ఎందుకీ జీవితం? ఎవరి కోసం? ఒంటరిగా వృద్ధాప్యపు నిశీధి నీడల మాటున నా అనే దిక్కు లేక ఏ సంతోషాన్నీ, ఏ ఆనందాన్నీ చవిచూడక ఎంతకాలం ఇలా మోడులా బ్రతకడం? అన్న ప్రశ్నలు పదే పదే గుర్తొచ్చి ఆయన అంతరంగాన్ని ఆవేదనతో కుదిపివేస్తున్నాయి బ్రతుకు మీద చెప్పలేని రోతను, వైరాగ్యాన్ని పుట్టిస్తున్నాయి

మొన్న మొన్నటి వరకూ కొంత ధైర్యంగానే బ్రతకారాయన తాను, తన భార్య కన్నకొడుకుల ఆదరణకు నోచుకోక పోయినా ఒకరికొకరు తోడుగా బ్రతుకుతున్నామన్న తృప్తి అయినా ఉండేది

ఇప్పుడు అది కూడా లేదు

నెల రోజుల క్రితం మృత్యువు పిలుపందుకొని ఆయన భార్య కామాక్షమ్మ ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయింది వెళుతూ వెళుతూ ఆయనకు గుండెలు కాల్చే ఒంటరితనం మిగిల్చింది ఆయన కన్నీళ్ళలో తన జ్ఞాపకాలు కుమ్మరించింది

అయిపోయింది భార్య పోవడంతో సితారామయ్యగారి జీవితంలో వెలుగు ఆరిపోయింది ఆయన బ్రతుక్కి ఆలంబనగా ఉన్న ఒక్క తోడు ఒరిగిపోయింది

భార్య కన్ను మూసేక కొడుకులిద్దరికీ కబురంపారాయన తల్లి మరణవార్త విని ఇద్దరు కొడుకులు పరిగెత్తుకొంటూ వచ్చారు తల్లి అంత్యక్రియలన్నీ దగ్గరుండి జరిపారు

నెల రోజులు గడిచాయి

కార్యక్రమాలన్నీ ముగిసాయి

వచ్చిన కొడుకులు వచ్చినట్లే వెళ్ళిపోయారు

కొడుకుల ప్రవర్తనకు సీతారామయ్య గారి గుండెల్లో సన్నగా మంట రేగింది

భార్య పోయి దుఃఖంలో ఉన్న తనను ఓదార్చి 'నాన్నా ఈ ఒంటరి బ్రతుకు నీకెందుకు? మేమంతా లేమా? మాతో పాటు వచ్చి ఉండు మా కలలు, ఆశలు, భావాలు నువ్వూ పంచుకో' అంటూ తనను చేరదీయవలసిన కొడుకులు, ఒంటరిగా మగ్గిపో' అని శపిస్తున్నట్లు ఎవరి దారిన వారు వెళ్ళిపోవడంతో ఆయన మనసు రంపపు కోతకు గురైంది

"చీ చీ!" ఏం మనుషులో ఏం బ్రతుకులో వీళ్ళలో మార్పు వస్తుందనుకోవడం తన అవివేకం" అనుకున్నారాయన గుండె నిండిన ఆవేదనతో అలా అనుకొంటున్నప్పుడు ఆయన కళ్ళలో సన్నటి కన్నీటి పొర కదలాడింది ఆయన ఆలోచనల్లో ఒకనాటి చేదు గతం నిలిచింది

★ ★ ★ ★ ★

అవి సీతారామయ్యగారు ఉద్యోగం నుండి కొత్తగా రిటైరైన రోజులు ముందుగా భార్యతో పాటు విశాఖపట్నంలో ఉంటున్న పెద్దకొడుకు రఘురాం దగ్గరకు బయలుదేరి వెళ్ళారు వెళ్ళి వారం రోజులైనా అతడి ఇంట్లో గడపలేదు తృప్తిగా

ఓ రోజు రఘురాం ఆయన దగ్గరకు వచ్చేడు

"నన్ను క్షమించండి నాన్నా మిమ్మల్ని నా దగ్గర ఉంచుకోలేను ఇలా అంటున్నానని మీరు మరోలా భావించకండి దూరం నుండి మీ కంటికి నేను పచ్చగా బ్రతుకుతున్నట్లు కన్పించవచ్చు కానీ నా సమస్యలు నాకున్నాయి కన్న ఇద్దరు పిల్లల్నీ పెంచలేకనే నానా కష్టాలు పడుతున్నాను ఇక మిమ్మల్ని పోషించడమంటే నా తరం కాదు అందుకె సిగ్గు విడిచి చెప్తున్నాను ఇక్కడికన్నా తమ్ముడి దగ్గరైతే మీకు హాయిగా ఉంటుంది వాడికింకా పిల్లాజెల్లా లేరు మిమ్మల్ని పోషించడం వాడికి పెద్ద కష్టం కాదు అలా అని పూర్తిగా వాడి మీదే మిమ్మల్ని వదిలేయను నేను కూడా నెలకు ఎంతో కొంత డబ్బు వాడికి పంపిస్తాను" అన్నాడు

ఇంతలో ఏ పక్కనుండి వచ్చిందో కోడలు జయ–

"అవును మామయ్యగారూ మా పరిస్థితిని కాస్త అర్థం చేసుకోండి నిజానికి ఈ ముసలి

కాలంలో మిమ్మల్ని మేము కంటికి రెప్పలా కాపాడుకోవాలి. కానీ ఏం చేస్తాం? మాకు ఆ శక్తిని భగవంతుడు ఇవ్వలేదు". అంది.

కొడుకు, కోడలు అన్న మాటలకు సీతారామయ్యగారు కాసేపు తేరుకోలేక పోయారు. అలాంటి పరిస్థితిని ఆయన కలలో కూడా ఊహించలేదు.

తనకు ఇద్దరు కొడుకులని, రిటైర్ అయ్యాక ఏ కొడుకు దగ్గరకు వెళ్ళినా తన జీవితం, తన భార్య జీవితం ఆనందంగా గడిచిపోతుందని ఆశించారు ఆయన. కానీ ఆ ఆశ అడియాస అవుతుంటే ఆ నిజాన్ని జీర్ణించుకోలేక మెల్లగా తల తిప్పి పక్కనున్న భార్య ముఖంలోకి చూసారు.

"పోనీలెద్దురూ వాడు అన్నట్టు హాయిగా చిన్నవాడి దగ్గరకే వెళ్ళిపోదాం ఏ కొడుకు దగ్గరున్నా మనకు ఒక్కటే కధా....." అంది కామాక్షమ్మ భర్త ముఖంలోకి చూస్తూ అమాయకంగా.

భార్యను ఆ స్థితిలో చూస్తుంటే సీతారామయ్యగారి గుండె తరుక్కుపోయింది. ఆమె మనస్ఫూర్తిగా ఆ మాటలు అనలేదని ఆయనకు తెలుసు.

ఆ మర్నాడే భార్యను తీసుకొని హైదరాబాద్‌లో వున్న చిన్నకొడుకు సురేష్ దగ్గరకు బయలుదేరారు సీతారామయ్యగారు. అక్కడికి బయలుదేరుతున్న మాటేగాని అతడేం అంటాడోనని ఆయన మనస్సు ఒక ప్రక్క పీకుతూనే ఉంది. ఆయన అనుకున్నట్టు అతడి గడప ఎక్కి నాలుగు రోజులైనా గడవక ముందే చావు కబురు చల్లగా చెప్పాడు. "చూడండి నాన్నా.... ఈ మహానగరంలో ఇద్దరు వ్యక్తుల్ని పోషించడం అంటే సామాన్యం కాదు. నాకు ఆ స్థోమత లేదు. అన్నయ్య నెలకు ఏలాగూ కొంత డబ్బు పంపిస్తానన్నాడు. నేను కూడా కొంత పంపిస్తాను. మన స్వంత వూరు సొంత ఇల్లు ఉండనే ఉన్నాయి. అక్కడ అందరూ మీకు తెలిసిన మనుషులే. హాయిగా కృష్ణా... రామా అనుకుంటూ ఇద్దరూ కలిసి ప్రశాంతంగా అక్కడే ఉండండి" అన్నాడు.

చిన్నకొడుకు కూడా అలా అనేసరికి సీతారామయ్యగారి గుండెల్లో అగ్నిపర్వతం నిశ్శబ్దంగా బద్దలైంది. మెల్లగా అలజడి మొదలైంది. నిగ్రహించుకోవడానికి విశ్వప్రయత్నం చేయసాగేరు.

కామాక్షమ్మ మాత్రం తనను తాను నిగ్రహించుకోలేకపోయింది. నవమాసాలు మోసి కని, పెంచిన ఆ మాతృహృదయం ఒక్కసారి భగ్నమంది.

"ఉంటాం నాయనా ఉంటాం... ఆ మాత్రం మాకు తెలియక కాదు... అన్ని మైళ్ళు దాటుకుంటూ నిన్ను వెతుక్కుని వచ్చింది... కన్నందుకు మంచి ప్రతిఫలమే దక్కించావు" గద్గద స్వరంతో వౌరుషంగా అందావిడ.

"ఏం మీరు ఈయన ఒక్కరినే కన్నారా? మీ కష్టాన్నంతా ఈయన ఒక్కరికే ధారపోసినట్టు మాట్లాడుతారేం?" అక్కడే ఉన్న కోడలు సుధ నోటి వెంట మాటలు విసురుగా వచ్చేయి.

"కన్నానేమ్మా... ఇద్దరు బిడ్డల్ని కన్నాను. రత్నాల్లాంటి బిడ్డలు. కానీ ఏం లాభం. మా వరకూ వచ్చేసరికి ఎందుకూ పనికిరాలేదు" దుఃఖంతో కామాక్షమ్మ గారి గొంతు జీరబోయింది.

"ఎందుకమ్మా... నోరు పారేసుకుంటావు? మా ఆర్థిక పరిస్థితి...." సురేష్ మాటలు ఇంకా పూర్తి కాలేదు.

అంతవరకూ ఓర్పు వహించిన సీతారామయ్యగారి మనసు చితికి పోయింది. గుండెల్లో బాధ గొంతులోకి తన్నుకొచ్చింది.

"ఛీ... ఆ మాట అనేందుకు సిగ్గులేదురా? ప్రేమాభిమానాలను డబ్బుతోనా వెలకట్టేది? తల్లితండ్రుల అనురాగాన్ని లాభనష్టాలతో నా బేరీజు వేసుకొనేది? ఎందుకురా పుట్టేరు? దేని కోసంరా మీ వెధవ జన్మలు? ఈ లోకంలో ప్రతి వాళ్ళు పిల్లల్ని కని పెంచి పెద్ద చేస్తున్నారు.... ప్రయోజకులుగా తీర్చిదిద్దుతున్నారు. ఎందు కోసం.... పుట్టగానే చంపుకోలేరూ? ఏ ఆశతో పెంచుతున్నారో నీకు తెలునా? ఆ విషయాన్ని ఒక్కసారైనా ఆలోచించావా? చివరి కాలంలో.... ముసలితనంలో.... కన్న బిడ్డలు తమ బ్రతుకుల్లో ఏ ఆనందాన్ని అందిస్తారనో... ఏ వెలుగును వెలిగిస్తారనో ఆశతో.... ఓ చిన్న ఆశతో తమ కష్టాన్నంతా కన్నబిడ్డల కోసం ధారపోస్తున్నారు. తమ రక్తాన్ని చమటగా మార్చి కన్నబిడ్డల భావి జీవితానికి పన్నీటి జల్లు జల్లుతున్నారు. ప్రతీ క్షణం శ్రమించి వాళ్ళ బాగును కాంక్షిస్తున్నారు. కానీ మీలాంటి మూర్ఖులు రెక్కలొచ్చిన పక్షుల్లా స్వార్థంతో తమ సుఖాన్ని వెదుక్కుంటూ వృద్ధాప్యంలో కన్నవాళ్ళను చేరదీయడమే మహా పాపంగా తలిస్తే ఇక ఈ ప్రేమానురాగాలు ఎందుకురా? ఈ రక్తానుబంధాలు ఎవరి కోసంరా? మీరూ పిల్లల్ని కంటున్నారు. పెంచి పెద్ద చేస్తున్నారు. ఏ ఆశతో? ఒక్కసారి.... ఒకే ఒక్కసారి ప్రశ్నించుకొంటే ఓ జీవిత సత్యం బయటపడదూ? ఈనాడు మీరు కంటికి రెప్పల్లా కాపాడుకొని పెంచుతున్న మీ పిల్లలు రేపు పెరిగి పెద్దవాళ్ళై మిమ్మల్ని ఇలాగే నిరాదరణకు గురి చేస్తే మీ గుండెలు బద్దలు కావూ? మనసులో గాయం రేగదూ?.... ఇంత బుద్ధిహీనులుగా ఎందుకు పుట్టార్రా? చాలు.... మిమ్మల్ని కన్నందుకే సిగ్గుపడుతున్నాం. మీ పంచన చేరి మరింత పాపాన్ని ఒడిగట్టలేం..." అంటూ పక్కనున్న భార్య వైపు తిరిగారు.

అప్పటికే కామాక్షమ్మగారు దుఃఖాన్ని ఆపుకోలేక సన్నగా రోదిస్తున్నారు. ఆమెకు అది ఊహించని పరిణామం. కన్నబిడ్డలు అంత కృత్రిమంగా మాట్లాడుతారని ఏ తల్లి మాత్రం ఊహించగలదు?

సీతారామయ్యగారు ఆమె దగ్గరగా వెళ్ళి ఆమెను పొదివిపట్టుకున్నారు.

"చూసావా కామాక్షీ..... మనం పెంచిన మొక్కలు అమృత ఫలాలు అందిస్తాయని ఆశపడ్డాం.... కానీ ఇప్పుడు చూడెలా విషఫలాలు అందిస్తున్నాయో.... పద కామాక్షీ... పద.... వీళ్ళ దగ్గర మనం బ్రతకలేం" అంటూ భార్యను మెల్లగా నడిపించుకుంటూ అక్కడ నుంచి ముందుకు కదిలారు.

ఆ తర్వాత సీతారామయ్యగారు ఏనాడూ కొడుకుల గడప తొక్కలేదు. సొంత ఊరు చేరారు. పుట్టి పెరిగిన ఊరు. తెలిసిన మనుషులు. ఇద్దరూ




ఇటీవల జబల్‌పూర్‌లోని ఆయుధ కర్మాగారం ఉద్యోగుల సాంస్కృతిక కార్యక్రమంలో మేజిక్ ప్రదర్శిస్తున్న శ్రీ బి. వి. పట్టాభిరామ్.

# ఇ'వేమన' పద్యాలు

## ఆకలి




పనితొడువులు వేరు బంగారమొక్కటి
పరగదేహి వేరు ప్రాణమొక్కటి
యరయ తిండి వేరు నాకలి యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ.

బ్రతకడానికి ఫించను డబ్బులు పనికొచ్చేయి.

భారంగా రోజులు గడుస్తున్నాయి.

కామాక్షమ్మగారు కొడుకుల నిరాదరణ నుండి తేరుకోలేక పోయారు. రోజు రోజుకూ ఆమెలో మనోవేదన అధికమయింది. కన్నకొడుకుల మాటలు పదే పదే గుర్తొచ్చి బోరున ఏడ్చేదామె.

"ఏమండీ.... మనం ఏం పాపం చేసామని భగవంతుడు మనకి శిక్ష విధించాడండీ? ముసలి కాలంలో కన్నబిడ్డల నీడన బ్రతకాలని వాళ్ళు ప్రయోజకుల్లై పచ్చగా సంసారాలు చేసుకుంటూ తమ కళ్ళ ముందు జీవిస్తుంటే తృప్తిగా చూడాలని తాతయ్యా, అమ్మమ్మ అంటూ మనుమలు,

## విషఫలం

మనుమరాళ్ళు పిలుస్తుంటే చెవులారా వినాలని ఏ తల్లిదండ్రులు ఆశించరండీ? అలా ఆశించడం మన తప్పంటారా? మీ ఆనందాన్ని అణువంత పంచివ్వండి మీ దుఃఖంలో మమ్మల్నీ పాలుపంచుకోనివ్వండి అంటూ వాళ్ళ గడపలెక్కితే అభిమానానికి డబ్బుకీ లంకె పెట్టే షోకుళ్ళు మనస్తత్వాలు వాళ్ళకు ఎలా అబ్బేయండీ?" అంటూ గోడున విలపించేది ఆమె.

"ఊరుకో కామాక్షీ.... ఎందుకు ఏడుస్తావు? కాలం మారింది మనుషులు మారేరు. వాళ్ళంతా డబ్బు మనుష్యులు... మమతానుబంధాలు వాళ్ళకు తెలియవు. ప్రేమానురాగాలు వాళ్ళ దృష్టిలో నిలవవు. తల్లిదండ్రుల ఋణం తీర్చుకోవాలనే తపన వారికి లేదు. వాళ్ళంతా మరమనుష్యులు. అలాంటి వాళ్ళ గురించా నువ్వు బాధపడేది?" అంటూ సీతారామయ్య గారు దుఃఖంతో కుమిలిపోతున్న భార్యను ఒడి చేర్చుకొని ఓదార్చేవారు.

ఆయన ఓదార్పులకు ఆ మాత్ర హృదయం చల్లబడేది కాదు. ఆమె కొడుకుల సన్నిధిలో చివరి కాలంలో బ్రతకాలని ఎంతగానో ఆశపడింది. కొడుకులు తనను ప్రేమగా చూస్తుంటే ఆ సంతోషంతో తృప్తిగా ప్రాణాలు విడవాలనుకున్నది. కానీ ఆమె ఆశలన్నీ అడియాశలయ్యేయి. ఆ బాధతో... ఆ దుఃఖంతో రోజు రోజుకూ క్షీణించి తీరని మనోవేదనతో చివరకు కన్ను మూసిందామె.

* * * * *

కిటికీలోంచి విసురుగా వచ్చిన వర్షపు జల్లు సీతారామయ్యగారి ముఖం మీద పడింది.

ఉలిక్కిపడి గతం నుంచి వాస్తవంలోకి వచ్చేరు ఆయన.

బయట వర్షం.....

జోరున వర్షం....

బోరున ఏడుస్తున్నట్టు......

కూర్చున్న కుర్చీలోంచి మెల్లగా లేచి భారంగా నడుచుకొంటూ వెళ్ళి కిటికీ తలుపులు వేసారాయన....

ఒక్కసారి ఆ గది నిండా భయంకరమయిన నిశ్శబ్దం....

మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చుని ఆలోచనల్లో పడ్డారు.

అలా ఆలోచిస్తూ ఆ కుర్చీలో ఎంత సేపు కూర్చున్నారో ఆయనకే తెలీదు!

అర్ధరాత్రి వేళ ఓ నిర్ణయానికి వచ్చి లేచి నిల్చున్నారు!

* * * * *

తెల్లవారింది....

వర్షం వెలిసింది....

అగ్రహారం నడిబొడ్డు నున్న ఆ పాత కాలంనాటి పెంకుటింటి చూరుల నుండి వర్షం నీరు కన్నీరులా ఒక్కొక్క బొట్టు నేల రాలుతోంది.

అంతవరకూ ఆ ఇంటి చూరుల్ని పట్టుకుని వేలాడిన చావుకళ విజయగర్వంతో ఆ ఇంటి నాలుగు గోడల మధ్య నృత్యం చేస్తోంది.

ఆ ఇంటి మధ్య గదిలో దూలానికి కట్టిన తాడుకి సీతారామయ్యగారి దేహం నిర్జీవంగా వేలాడుతోంది....

# నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్

NAGARJUNA FINANCE

నాగార్జునహిల్స్, పంజాగుట్ట, హైదరాబాద్-500482 ఫోన్: 37389/224445

## డిపాజిట్ల స్వీకరణ/పునరుద్ధరణ

| స్కీము I | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | వడ్డీ రేటు | వార్షికాదాయము * |
|---|---|---|---|---|
| నెలసరి ఆదాయ పథకం | 1 సంవత్సరం | రూ. 10,000 | 14% | 14.90% |
| | 2 సంవత్సరాలు | రూ. 8,000 | 14% | 16.00% |
| | 3 సంవత్సరాలు | రూ. 5,000 | 14% | 17.25% |

* అదనపు సొమ్ము రూ. 1000/- గుణిజములలో ఉండాలి. * డిపాజిట్ చేయబడిన తేదీ నుండి మార్చినెల వరకు గల కాలవ్యవధికి గాను, ఫిక్సిడ్ డిపాజిట్ రశీదుతో పాటు మొదటి సంవత్సరపు వడ్డీ వారెంట్లు, ఇవ్వబడతాయి. * సంబంధిత ఆర్థిక సంవత్సరాలకు (ఏప్రిల్ - మార్చి) గాను పన్నెండు నెలసరి వడ్డీ వారెంట్లు, ఆ ఆర్థిక సంవత్సర ప్రారంభమునందు ఇవ్వబడతాయి.

| స్కీము II | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | వడ్డీ రేటు | వార్షికాదాయము * |
|---|---|---|---|---|
| త్రైమాసిక ఆదాయ పథకం | 1 సంవత్సరం | రూ. 3,000 | 14% | 14.75% |
| | 2 సంవత్సరాలు | రూ. 3,000 | 14% | 15.85% |
| | 3 సంవత్సరాలు | రూ. 3,000 | 14% | 17.00% |

* అదనపు సొమ్ము రూ. 1000/- గుణిజములలో ఉండాలి. * డిపాజిట్ చేయబడిన తేదీ నుండి మార్చినెల వరకు గల కాలవ్యవధికి గాను, ఫిక్సిడ్ డిపాజిట్ రశీదుతో పాటు మొదటి సంవత్సరపు వడ్డీ వారెంట్లు, ఇవ్వబడతాయి. * పూర్తి ఆర్థిక సంవత్సరానికి (జూన్/సెప్టెంబర్/డిసెంబర్/-మార్చి) గాను నాలుగు త్రైమాసిక వడ్డీ వారెంట్లు, ముందుగా ప్రతి ఆర్థిక సంవత్సర ప్రారంభములో ఇవ్వబడతాయి.

| స్కీము III | కాల వ్యవధి | కనీస డిపాజిట్టు | మెట్యూరిటీ సమయం నందు చెల్లింపబడు మొత్తం | వార్షిక ఆదాయము * |
|---|---|---|---|---|
| క్యుమ్యులేటివ్ డిపాజిట్ల పథకం | 6 నెలలు | రూ. 25,000 | రూ. 26,735 | 14 % |
| | 1 సంవత్సరం | రూ. 2,000 | రూ. 2,300 | 15 % |
| | 2 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 2,640 | 16 % |
| | 3 సంవత్సరాలు | రూ. 2,000 | రూ. 3,036 | 17.26% |

* అదనపు సొమ్ము రూ. 1000/- గుణిజాలలో ఉండాలి. వడ్డీ ప్రతి నెలా కలుపబడుతుంది.

రీ - ఇన్వెస్టమెంట్ మీద, సంవత్సరానికి 14% వడ్డీ ఉద్దేశించ బడినది.

అన్ని స్కీములకు వర్తించు అంశాలు * కంప్యూటరైజ్డ్ ఎంఐసిఆర్ వడ్డీ వారెంట్లు, ఇండియాలో 7,000 పైగా ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యొక్క అన్ని శాఖలలో ఒకే సారి చెల్లింపబడతాయి. * ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ. 2.500/- దాటని వడ్డీ మీద పన్ను లేదు. * డిపాజిటరు, ఫారం 15 హెచ్/15 ఎ నందు డిక్లరేషన్‌ను దాఖలు చేసినట్లయితే ఏ ఆర్థిక సంవత్సరంలోనైనా రూ. 2.500/- దాటిన వడ్డీ మీద కూడా పన్ను ఉండదు. * అన్ని స్కీముల విషయంలో కూడా మెట్యూరిటీ సమయమునందు డిమాండ్ డ్రాఫ్టుల ద్వారా సకాలంలో ఖచ్చితమైన చెల్లింపులు జరుపబడతాయి.

నాన్ - బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలు మరియు మిస్లేనియస్ నాన్ - బ్యాంకింగ్ కంపెనీల (ప్రకటనలు) సవరించబడిన 1977 నిబంధనల ప్రకారం వివరాలు.

| | |
|---|---|
| ఎ. కంపెనీ పేరు | నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్ |
| బి. ఏర్పాటు చేసిన తేదీ | 24-3-1982 |
| సి. కంపెనీ ద్వారా నిర్వహించిన వ్యాపారం మరియు శాఖల యొక్క వివరాలతో పాటు దీని యొక్క సబ్సిడరీలు | హైర్ పర్చేజ్ ఫైనాన్సింగ్, ఎక్విప్‌మెంట్ లీజికిచ్చుట, పెట్టుబడులు మరియు పారిశ్రామిక ఆర్థిక సహాయం ఈ కంపెనీ ఎటువంటి సబ్సిడరీలు కలిగి లేదు. ఈ కంపెనీ యొక్క శాఖలు/కార్యాలయాలు, బొంబాయి, మద్రాసు, మధురై, తిరుచ్చి, వైజాగ్, విజయవాడ మరియు కోయంబత్తూరుల్లో ఉన్నవి. |
| డి. కంపెనీ నిర్వహణ యొక్క సంక్షిప్త వివరాలు | అర్హత మరియు అనుభవం కలిగిన ప్రొఫెషనల్స్ యొక్క టీమ్ చేత సహాయ్యం చేయబడిన డైరెక్టర్ల బోర్డుచే ఈ కంపెనీ నిర్వహించ బడుచున్నది. |

ఇ. డైరెక్టర్ల పేర్లు, చిరునామాలు, మరియు వృత్తులు :

| పేరు | చిరునామ | వృత్తి |
|---|---|---|
| శ్రీ ఆర్. కె. తల్వార్ ఛైర్మన్ | తిరువినయ్, 2వ అంతస్థు, 13, పెరుమాళ్ కోవిల్ స్ట్రీట్ పాండిచ్చేరి - 605 001. | బ్యాంకర్ |
| శ్రీ మినూ ఆర్ ష్రాఫ్ | జి.కె. బిల్డింగ్, ఎన్. మొరార్జీ మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి - 400 038. | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ హెచ్.సి.రావిన | కామన్‌వెల్త్, ఫ్లాట్, నెం. 24, 6వ అంతస్థు, 181 బ్యాక్ బే రిక్లమేషన్ బొంబాయి - 400 020. | అడ్వకేట్, సుప్రీంకోర్టు ఆఫ్ ఇండియా |
| శ్రీ విమన్ ఎన్ కంపాని | 51, పెర్సిపోలిస్ అపార్ట్‌మెంట్సు 100 కుఫే పరేడ్ కొలబా, బొంబాయి - 400 005. | ఫైనాన్షియల్ కన్సల్టెంట్ |
| శ్రీ కె.ఎస్.రాజు | నెం. 6, నాగార్జున హిల్స్, హైదరాబాద్ - 500 482. | ఇండస్ట్రియలిస్ట్ |

ఎఫ్. లాభాలు మరియు లాభాంశాలు (డివిడెండ్లు)

| గడువు | పన్నుకుపూర్వం లాభం (రూ. లక్షలలో) | పన్ను తర్వాత లాభం (రూ. లక్షలలో) | ఈక్విటీ డివిడెండ్ సొమ్ము (రూ. లక్షలలో) | రేటు |
|---|---|---|---|---|
| 30-9-87 | 159.42 | 134.27 | 56.06 | 23 % |
| 30-9-86 | 143.07 | 133.72 | 56.06 | 23 % |
| 30-9-85 | 109.55 | 109.55 | 30.00 | 20 % |

జి. ఆడిట్ చేయబడిన గత రెండు బ్యాలెన్స్ షీట్ల ప్రకారం సంగ్రహపరచబడిన కంపెనీ ఆర్థిక స్థితి

| అప్పులు | 30-9-87 నాటికి (రూ. లక్షలలో) | 30-9-86 నాటికి (రూ. లక్షలలో) |
|---|---|---|
| వాటా మూలధనం | 241.80 | 241.07 |
| రిజర్వులు మరియు మిగులు | 269.88 | 191.67 |
| సెక్యూర్డ్ లోన్లు | 2322.71 | 1508.93 |
| అన్ సెక్యూర్డ్ లోన్లు | 956.27 | 815.12 |
| సప్లయర్స్ నుండి క్రెడిట్ చేయబడిన డిఫర్డ్ పేమెంట్ | 40.84 | - - - - |
| ప్రస్తుత అప్పులు మరియు ప్రొవిజన్లు | 1820.97 | 1543.69 |
| మొత్తం | 5652.47 | 4300.48 |

| ఆస్తులు | 30-9-87 నాటికి (రూ. లక్షలలో) | 30-9-86 నాటికి (రూ. లక్షలలో) |
|---|---|---|
| స్థిరాస్తులు | 824.65 | 598.94 |
| పెట్టుబడులు | 37.75 | 37 50 |
| ప్రస్తుత ఆస్తులు ఋణాలు మరియు బయానాలు (అడ్వాన్సులు) | 4731.70 | 3593.84 |
| మిస్లేనియస్ ఎక్స్‌పెండీచర్ | 58.37 | 70.20 |
| మొత్తం | 5652.47 | 4300.48 |

| తాత్కాలిక (కంటింజెంట్ అప్పులు) | 30-9-87 నాటికి (రూ. లక్షలలో) | 30-9-86 నాటికి (రూ. లక్షలలో) |
|---|---|---|
| i) బ్యాంకు గ్యారంటీలు సంబంధించి కౌంటరు గ్యారంటీలు | 48.25 | 1.49 |
| ii) డిస్కౌంట్ చేయబడిన బిల్లులు | 219.40 | 450.43 |
| iii) నిర్వహించ వలసిన మిగిలిన కాంట్రాక్టుల అంచనా చేయబడిన సొమ్ము | లేదు | 5.42 |

హెచ్. సవరించబడిన నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీల (రిజర్వు బ్యాంక్ సూచనలు) 1977 నిబంధనల క్రింద డిపాజిట్ల ద్వారా కంపెనీ పెంచగల మొత్తం రూ. 4.533 లక్షలు. 30-9-1987 నాటికి నిర్వహించబడిన మొత్తం డిపాజిట్లు రూ. 862.44 లక్షలు.

ఐ. ఈ ప్రకటన తేదీ నాటికి, అన్‌క్లెయిమ్డ్ డిపాజిట్లు మినహా కంపెనీ ఎటువంటి ఓవర్‌డ్యూ డిపాజిట్లను కలిగిలేదు.

జె. కంపెనీ ఇందుమూలంగా ప్రకటించుచున్నది (డిక్లరేషన్).

i) సూచనల ప్రకారం వర్తించునటువంటి అన్ని నిబంధనలను ఈ కంపెనీ పాటిస్తుంది.

ii) సూచనల ప్రకారం నిబంధనలను పాటించినంత మాత్రాన డిపాజిట్లు తిరిగి చెల్లింపునకు రిజర్వు బ్యాంకు ఎటువంటి గ్యారంటీ ఇవ్వదు.

iii) ఈ కంపెనీలచేత అంగీకరించబడిన డిపాజిట్లు అన్ సెక్యూర్డ్ డిపాజిట్లు మరియు ఇతర అన్ సెక్యూర్డ్ లయబిలిటీస్‌తో సమానమవుతాయి.

ఈ ప్రకటన కంపెనీ డైరెక్టర్ల బోర్డుయొక్క అధికారంతో మరియు వారి పేరున జారీ చేయబడుచున్నది. 30-11-87 నాడు నిర్వహించబడిన సమావేశమునందు, ఈ ప్రకటన ఆమోదించబడి, రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా, బెంగుళూరులో ఫైలు చేయబడినది.

బోర్డువారి ఆజ్ఞానుసారము
నాగార్జున ఫైనాన్స్ లిమిటెడ్ తరపున
ఎస్.ఎ.కృష్ణన్
ప్రెసిడెంట్.

స్థలము : బొంబాయి
తేది : 30-11-1987.

శాఖలు : డిపాజిట్లు, హైదరాబాద్‌లోని కంపెనీ యొక్క రిజిష్టర్డు ఆఫీసులోను మరియు ఈ దిగువ శాఖలలోను స్వీకరించబడతాయి. **బొంబాయి :** ఫ్లాట్ నెం. 44, ఫ్రీ ప్రెస్ హౌస్, 215, ఫ్రీ ప్రెస్ జర్నల్ మార్గ్, నారిమన్ పాయింట్, ఫోన్ : 2041622, 2042655, 2871383/2871384 మద్రాసు : రేర్ వింగ్, 3వ అంతస్థు, ఇండియా గ్యారేజి బిల్డింగ్, 184, అన్నాసలై, ఫోన్ : 862511/862566, టెలెక్స్ : 041-6535. **మధురై :** 57, నాయకర్ న్యూ స్ట్రీట్ (మొదటి అంతస్థు) ఫోన్ : 31741/35397 **కోయంబత్తూర్ :** 365, డా. రాజేంద్రప్రసాద్ రోడ్డు, తాతాబాద్, తిరుచ్చి, మొదటి అంతస్థు, ఎ-2 కాలనీ, మెయిన్ రోడ్డు (సౌత్), తిల్లాయ్‌నగర్, ఫోన్ : 37276
**విజయవాడ, ఫ్లాట్ నెం. 6, రైల్వే ఆఫీసర్స్ కాలనీ, వెంకటేశ్వరపురం, ఫోన్: 65440.**
**విశాఖపట్నం : 48-8-11, ద్వారకానగర్, ఫోన్ : 61994**

కొత్త పద్ధతుల్లో పెరుగుదల

# మహామనిషి

వెల్లాని ఉష

(గత సంచిక తరువాయి)

కాలం వేగంగా జరిగిపోతోంది. ఆనంద్ తల్లికి అతను ఆశించినట్టుగా అన్ని సుఖాలూ ఏర్పరిచాడు. అయినా భర్త లేని లోటు ఆమెను పీడిస్తూనే వుంది. జ్యోతి కొడుకుతో, భర్తతో తరచు పుట్టింటికి వచ్చి తల్లికి సందడి కలిగిస్తుంటుంది.

ఆ రోజు ఆనంద్ ఆఫీస్ రూమ్‌లో తీరికగా ఉన్నాడు. పెద్ద వర్కు లేదు. ఆఫీసు క్లర్క్సు కూడా తీరుబాటుగా పని చూస్తున్నారు. మధ్యాహ్నం మూడు దాటుతోంది. ఆనంద్ సెక్రటరీ విజయ ఆనంద్ రూమ్‌లోకి వచ్చింది. ఆమె నమస్కారం అందుకుని కూర్చోమన్నట్టుగా కుర్చీ చూపించాడు.

ఆమె కూర్చుంది.

"చెప్పండి మిస్ విజయా!" చిరునవ్వుతో అడిగాడు.

"నాకు వంద రూపాయలు అవసరం సార్! నా జీతంలో అడ్వాన్స్‌గా ఇప్పించండి" తల వంచుకుని మెల్లగా అడిగింది.

"అలాగే. మీకు ఏమిటి అవసరం? అలా అడిగానని కోపం వద్దు. ఏదో కాలక్షేపంగా అడుగుతున్నాను".

"నాకు ఇద్దరు తమ్ముళ్ళు, చెల్లి వున్నారు. వాళ్ళు నా మీదే ఆధారపడ్డారు సార్! మా తమ్ముడికి కాలేజి ఫీజు కట్టాలి అందుకు".

"ఐ. సీ. అలా అయితే ఇక నుండి నేను ఫ్రీగా మీ తమ్ముడు చెల్లెళ్ళ చదువులకు నెల నెలా కొంత డబ్బు ఇస్తాను".

విజయ మొహం ఎర్రబడిపోయింది. ఆనంద్ ఆఫీసర్‌గా, వ్యక్తిగా మంచి పేరు సంపాదించుకున్నాడు. అటువంటి మనిషి ఇలా ఒక ఆడదానికి డబ్బు ప్రలోభపెట్టటం ఆమెకు అనుమానం కలిగించింది.

ఆనంద్ ఆమె అనుమానం అర్థం చేసుకున్నాడు. ఆనంద్ జీవితం పైమెట్టు ఎక్కాకా అతను చాలా మందికి తనకు సాధ్యమయినంత సహాయాలు చేసాడు. ఫాదర్ చూపించిన మానవత మూలంగానే తనీ రోజు ఈ స్థితిలో ఉన్నాడు. అది కలలో కూడా మర్చిపోడు. అందుకే తను చాల మందికి సహాయాలు చేస్తాడు. అయితే అవి గుప్తంగా ఉంచుతాడు. అందుకే విజయ అతన్ని అపార్థం చేసుకొంది.

"మీ సహృదయానికి చాలా థాంక్స్! కానీ నాకు జీతంలో మాత్రం అడ్వాన్స్‌గా వంద రూపాయలు ఇప్పించండి. అంతే చాలు" కఠినంగా అంది.

"ఓ విజయా మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. మీరు నాకు సిస్టర్‌లాటి వారు. నేను జీవితంలో డబ్బు లేక చాల ఇబ్బందిపడ్డాను. అలా ఇబ్బంది పడేవారికి ముఖ్యంగా చదువు కోసం ఇబ్బందిపడే వారికి నాకు సాధ్యమయినంత సహాయం చేయాలని ఆశిస్తాను. మీరు అపార్థం చేసుకొంటే మీ ఇష్టం". భుజాలు ఎగరేశాడు.

విజయ సిగ్గు పడింది.

"సారీ సార్! ఆడపిల్లను కాబట్టి వేరే విధంగా ఊహించుకున్నాను" క్షమాపణ కోరింది.

"ఫరవాలేదు" అంటూ జేబులో నుండి వంద రూపాయల నోటు తీసి ఇచ్చాడు.

"విజయా! నేను మీ అన్నయ్యను అనుకోండి. మీకు ఎప్పుడేం కావాలన్నా నన్ను అడగండి".

"అలానే సార్! మీకు కృతజ్ఞతలు" అంటూ విజయ లేచి వెళ్ళిపోయింది.

ఆనంద్ వెంట తెచ్చుకున్న నవల తీసాడు.

ఆఫీస్ అవగానే అతనికేం తోచక సారథి ఇంటికి వచ్చాడు. సారథి ఇంకా ఆఫీస్ నుండి ఇంటికి రాలేదు. ప్రమీల వచ్చి అప్పుడే తల్లి తెచ్చి ఇచ్చిన టీ తాగుతోంది. ఆనంద్‌ను చూడగానే మర్యాదగా ఆహ్వానించింది. తన టీ కప్పు అక్కడ పెట్టేసి ఆనంద్‌కు మరో కప్పు టీ తెచ్చింది.

ప్రమీల ఒద్దిక, మర్యాద చూసి ఆనంద్‌కు ముచ్చటగా ఉంటుంది. ఆమెను చాలా సంవత్సరాల నుండి చూస్తున్నాడు. అప్పటికీ ఇప్పటికీ ఆమె ప్రవర్తనలో ఎటువంటి మార్పు లేదు.

ప్రమీల ఆనంద్‌తో కాసేపు మాట్లాడింది. ఇంతలో సారథి వచ్చాడు. ప్రమీల అన్నకు కూడా టీ ఇచ్చి తను లోపలకు వెళ్ళిపోయింది.

"ఆనంద్! పెద్ద ఆఫీసర్ అయ్యావు. నీ లెవెల్ స్నేహితులతో కాలక్షేపం చేయాలి కానీ మా ఇంటికి వస్తావెందుకు?" సారథి హాస్యంగా అన్నాడు.

"రాస్కెల్! మరోసారి ఆ మాట అన్నావంటే షూట్ చేస్తాను" ఆనంద్ కోపంగా అన్నాడు.

సారథి హాయిగా నవ్వాడు.

స్నేహితులిద్దరూ కబుర్లలో పడ్డారు.

"ప్రమీల పెళ్ళి చేయాలని ఎంత ప్రయత్నిస్తున్నామో. కానీ మనకు నచ్చిన సంబంధం చేయలేకపోతున్నాం. చూస్తూ చూస్తూ తక్కువ వాడికి

**జరిగిన కథ– 5:** ఆనంద్ భీమిలిలో తాగిన మైకంలో ఒక పవిత్రమూర్తిని మలిన పరుస్తాడు. కొన ఊపిరితో పడి ఉన్న ఫాదర్‌ని చూస్తాడు ఆనంద్. ఫాదర్ తప్పు తనపై వేసుకొని ఆనంద్‌ని రక్షిస్తాడు. జరిగింది తెలుసుకొని సారథి హడలి పోతాడు. ఈ సంఘటన ఆనంద్‌లో గొప్ప మార్పుని తెచ్చింది. చెల్లి జ్యోతి పెళ్ళి చేసెయ్యమని తండ్రి సుబ్బారావుకి సలహా ఇస్తాడు ఆనంద్. జ్యోతి పెళ్ళి జరిగి పోయింది. ఆనంద్, సారథి ఫస్ట్ క్లాసులో పాస్ అయ్యారు. ఆనంద్ కుటుంబ పరిస్థితి బోల్తా పడింది. సుబ్బారావు మరణిస్తాడు. ఆనంద్‌కి ఫాదర్ మంచి ఉద్యోగం ఇప్పిస్తారు. సారథికి చెల్లెలు ప్రమీల పెళ్ళి సమస్య అయ్యింది.

కట్నబెట్టలేక పోతున్నాంరా! మీకు ఆ పొలం ఉండబట్టి జ్యోతి పెళ్ళి దివ్యంగా చేసారు మాకు అలా స్థిరాస్థి లేదు కదా! మేం ఏం చేయాలిరా" బాదగా అన్నాడు సారథి

"నిజమేరా! ఈ కట్న పిశాచుల కోరల్లో ఎంతో మంది ఆడపిల్లలు మాడిపోతున్నారు జ్యోతి పెళ్ళికి కట్నం ఇచ్చే నాన్న అలాఅయిపోయారు అంటే చెల్లికి ఇచ్చి అలా అనకూడదనుకో కానీ పరిస్థితుల్ని బట్టి అనాల్సి వస్తోంది కానీ ఏదో పొలం ఇచ్చినా మా బావ దాన్ని బాగా చూసుకుంటున్నాడు కాబట్టి సరిపోయింది లేకపోతే అమ్మ కూడా నాకు దక్కేది కాదు " ఆనంద్ అన్నాడు

"అదే ఆనంద్ ఈ కట్న పిశాచి ఎప్పుడు అంతరిస్తుందో తెలియటం లేదు"

"ఇంటర్ కాస్ట్ మేరేజ్ చేయండిరా! అలా అయితే మంచి ఉన్నతంగా ఉన్నవాళ్ళే ప్రమీల కోసం ముందుకు వస్తారు "

సారధి గతుక్కుమన్నాడు కులాంతర వివాహానికి తల్లీ, తండ్రీ ఒప్పుకోరు అతనికీ వాటిలో పెద్ద నమ్మకంలేదు ఎలాగైనా ఏ కులం పద్ధతులు ఆ కులానివే ఏదో స్నేహం వరకూ ఎలాగో సరిపెట్టుకోవచ్చు గానీ కులం గాని వ్యక్తితో జీవితాంతం కలసి ఉండాలంటే సాధ్యపడుతుందా? ఒకరికి ఒకరికి కలవవు దాంతో ఆ దంపతుల మధ్య కీచులాటలు ప్రారంభం అయి చివరకు అవి విడాకుల వరకూ దారితీస్తాయి అని సారధి అభిప్రాయం అందుకే ఆనంద్‌కు సరిగా సమాదానం చెప్పలేకపోయాడు

"ఏరా ఆలో చనలో పడ్డావు?" ఆనంద్ సారధిని కుదిపాడు

"ఆ ఏం లేదురా! ప్రేమ వివాహాలు ఎక్కువగా ఫెయిల్ అయినట్టే కులాంతర, మతాంతర వివాహాలు పెయిల్ అవుతాయని నా నమ్మకం" బలవంతానా నవ్వుతూ అన్నాడు

"అది నీ పొరపాటు పైగా సమాజాన్ని ఉద్ధరించే రచయితవు కూడా నీలాటి వ్యక్తులే వెనుకంజ వేస్తే ఎవరు ముందుకు వస్తారు ఈ సమాజం మారేదెప్పుడు? కథలు రాసి పాఠకులను మాయచేసి పేరు తెచ్చుకొంటే కాదురా! నువ్వు కథల్లో చెప్పేవి ఆచరణలో పెట్టాలి" ఆనంద్ ఆవేశంగా అన్నాడు

"పోనిద్దూ ఆ చర్చ ఇప్పుడు దేనికి? అయినా నేనంత పెద్ద రచయితను కాను కదా! ఎప్పుడో ఒకటీ, అరా రాస్తూ ఉంటాను" సారథి తేలిగ్గాకొట్టేశాడు.

"సరే నీ ఇష్టం" అంటూ ఆనంద్ వెళ్ళటానికి లేచాడు

సారధి మనసులో అన్ని సంవత్సరాల నుండి దాగున్న సత్యం ఇప్పుడు గమనించాడు ఆనంద్ ఆనంద్‌దీ, తనదీ చెరో కులం అయినా తనను వాళ్ళింట్లో కలుపుకుంటే ఆ ఇంట్లో కులాల ప్రశక్తి లేదనుకున్నాడు కానీ వారికి కులాల పట్టింపు చాలా వుంది అందుకే ఎదురుగా తను కనిపిస్తున్నా చెల్లెల్ని పెళ్ళాడమని తనను ఎప్పుడు అడగలేదు అంతేకాదు ఇవాళ తనకు ఎంత సొమ్ము ఉన్నా ఒకప్పటి తన క్యారెక్టర్ సారధికి బాగా తెలుసు అందుకే తన ప్రసక్తి వదిలేసాడు ప్రమీల అంటే ఆనంద్‌కు మొదటి నుంచీ అభిమానమే తల్లి తన వివాహం మాట ఎత్తగానే అతనికి ప్రమీలే గుర్తు వస్తుంది కానీ సారథి తననెప్పుడు అడగలేదు. తనుగా అడగాలంటే గతంలో తాను చేసిన నేరాలు



సారధికి తెలుసు కాబట్టి అతడు అంగీకరించడని బయం దాంతో అడగలేక పోతున్నాడు కట్న సమస్యతో సతమతం అయినా సారధి చెల్లెలిని ఆనంద్‌కు ఇస్తామనటం లేదు పోనీ ప్రమీల పెళ్ళికి సాయపడదామన్నా అది ఆనంద్‌కు మించిన పని అంత సొమ్ము ఆనంద్ సర్దలేడు

ఈ రోజు సారధి మాటలతో ఆనంద్ మనసులో ఎక్కడో రెప రెపలాడుతున్న ఆశ కాస్తా అడుగంటి పోయింది ఇక ప్రమీలను మర్చిపోవాలని అనుకున్నాడు

ఆనంద్ ఇంటికి వచ్చేసరికి జ్యోతి ఇంట్లో ఉంది జ్యోతి కొడుకు సుమన్ రాజేశ్వరి దగ్గర జేరి కబుర్లు చెప్తున్నారు

ఆనంద్ చెల్లిని పలకరిస్తూ తీరికగా కూర్చున్నాడు సుమన్ అమ్మమ్మను

వదిలేసి మేనమామ దగ్గర చేరాడు

"అన్నయ్యా! నేను చెప్పిన మాటను నువ్వు ఏమైనా సరే వినాలి" సంభాషణ మధ్యలో జ్యోతి సడన్‌గా అంది

"చెప్పమ్మా తల్లీ అయినా నువ్వేం చెప్తున్నా వింటూనే ఉన్నానుగా!" ఆనంద్ నవ్వుతూ అన్నాడు

"ఈసారి అలా కాదు ఖచ్చితంగా వినాలి" గారంగా అంది

"ఓ కే చెప్పు" ముద్దుగా మేనల్లుడి జుట్టు చెరుపుతూ అన్నాడు

"నువ్వు పెళ్ళి చేసుకోవాలి" సీరియస్‌గా చెప్పింది

"ఓస్ అదేనా?" తేలికగా నవ్వేసాడు

జ్యోతి కోపంగా చూసింది

"అదుగో నా మాట వింటానని అలా అంటావేం?"

"వాడు అంతేనమ్మా!" రాజేశ్వరి విసుక్కుంది

"అమ్మా! కళ్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగదు అంటారు కదా! ఈలోగా మనం ఆరాటపడటం ఎందుకు?" ఆనంద్ అంటూ లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు

వెళ్ళి మంచంమీద పడుకున్నాడు సారథితో చేసిన చర్చతో మనసంతా పాడయిపోయింది తనకు ఇప్పుడు ఆస్తి, అంతస్తు, అందం, చదువు అన్నీ ఉన్నయ్యి కానీ సారథి కులం కానందు వల్ల ఇష్టమైన అమ్మాయిని పెళ్ళాడే అర్హత మాత్రం లేదు ఈ కులాలూ, మతాలు ఎవరు పెట్టారు? ఎందుకు పెట్టారు? అతని మనసంతా శూన్యంగా అయిపోయింది

ఎప్పటికప్పుడు కావాలనుకున్నది దూరం అవుతూ అందని పండులా విసిగిస్తోంది ఇది ఆ చనిపోయిన పవిత్రమూర్తి శాపమే విషాదంగా అనుకున్నాడు

జ్యోతి వచ్చింది గదిలోకి

"అన్నయ్యా! అమ్మ భోజనానికి పిలుస్తోంది".

"అలాగే పద" లేచాడు

సుమన్ మేనమామ ఒళ్ళో కూర్చున్నాడు

ఆనంద్ తను తింటూ వాడికి తినిపిస్తున్నాడు

"అన్నయ్యా! మా బజారులో ఒక అమ్మాయి ఉంది బాగా చదువుకుంది చక్కగా పాడుతుంది వారు కట్నం కూడా ఎక్కువే ఇస్తారు వారింట్లో అంతా నిన్ను చూసారట నువ్వు ఒప్పుకుంటే వారితో మాట్లాడతాను" జ్యోతి అంది

తన పెళ్ళి చేయాలని తాపత్రయపడి పోతున్న జ్యోతిని చూస్తుంటే నవ్వు వచ్చింది

"నవ్వుతావేం? మాట చెప్పు" కోపంగా అంది

"వాళ్ళదే కులం జ్యోతీ?" ప్రశ్నించాడు




"ఏ కులం ఏమిటి? మనవాళ్ళే"

"అలా అయితే నేను ఇంకొక కులం అమ్మాయిని చేసుకోకూడదా?" సూటిగా ప్రశ్నించాడు

"చేసుకోవచ్చు అనుకో అది నీ మనసు పైన ఆధారపడి ఉంది నువ్వు ఎవరినైనా ఇష్టపడితే కులగోత్రాలు చూడనవసరం లేదు అటువంటివి ఏమీ లేనప్పుడు లక్షణంగా కులం చెడకుండా ఉంటే బాగుంటుంది కదా!" జ్యోతి చెప్పింది

చెల్లెలి మాటలు విని మౌనంగా ఉండిపోయాడు

"ఎవరినైనా ప్రేమించావా అన్నయ్యా!" జ్యోతి అడిగింది

"నీకు ఇప్పుడు చెప్పినా లాభంలేదు అది వదిలెయ్" నిరాసక్తిగా అన్నాడు

అన్నయ్య మనస్సులో ఎవరో ఉన్నారని జ్యోతికి అప్పటికి అర్థం అయింది తనూ మౌనంగా భోజనం పూర్తిచేసింది

"సత్యమూర్తి కూడా ఇక్కడికేవస్తాడా?" అడిగాడు

"లేరు వాళ్ళ ఇంటికి వెళ్ళారు" జ్యోతి చెప్పింది

"అలా అయితే ఈ రాత్రి ఉండిపోతావా?" అడిగాడు

"ఉంటాను" చెప్పింది

* * * * *

మరో నెల రోజులు మామూలుగా గడిచిపోయాయి జ్యోతికి అన్న మనసులో ఉన్న ఆమె ఎవరో తెలుసుకోవాలని ప్రయత్నం చేసింది కానీ ఆనంద్ చెప్పలేదు

"అలా అయితే నేను చూసిన అమ్మాయిని చేసుకుంటావా?"

ఉండు నేను ఆలోచించి చెప్తాను" నవ్వాడు

"బాగా ఆలోచించు అప్పటికి తాతయ్యవు అవుతావు" కోపంగా వెళ్ళిపోయింది జ్యోతి

చెల్లెలి కోపానికి ఆనంద్ నవ్వుకున్నాడు తనకు పెళ్ళి చేసుకోవాలనే ఉంది కానీ అది సాధ్యపడదు నిరాశగా అనుకున్నాడు

* * * * *

ఆనంద్ ఆఫీస్‌లో కూర్చుని ముఖ్యమైన ఫైల్స్ మీద సంతకాలు పెడుతున్నాడు ఆ సమయంలో ఫోన్ మోగింది విసుగ్గా ఎత్తాడు అవతల కబురు వింటూనే మాన్పడిపోయాడు రిసీవర్ కింద పడేసి బైటకు వచ్చాడు

"ఏమిటి సార్?" హెడ్ క్లర్క్ ఎదురు వచ్చారు

"నేను అర్జంటుగా బైటకు వెళ్ళాలి మీరు చూస్తూ ఉండండి" అంటూ బైటకు వచ్చేసాడు

ఆఫీసు జీప్ ఎక్కి డ్రైవర్ కోసం కూడా చూడకుండా తనే డ్రైవ్ చేయసాగాడు

తనకు పునర్జన్మ ప్రసాదించిన ఫాదర్ మరణశయ్య మీద ఉన్నారట ఇటువంటి సమయంలో కూడా ఆ దేవుడు ఈ పాపిని చూడాలని కోరుకుంటున్నారట ఆనంద్ గుండెలో మంటలా వచ్చింది

రివ్వున జీప్ తెచ్చి హాస్పిటల్ ముందు ఆపాడు స్పెషల్ వార్డ్‌లో ఫాదర్ రూమ్‌లోకి వచ్చాడు

రూమ్‌లో దృశ్యం చూస్తూనే అచేతనుడయ్యాడు అప్పటికే జరగాల్సింది జరిగిపోయింది ఫాదర్ తల వరకూ తెల్లని ముసుగు కప్పి ఉంది ఆయన చుట్టూ జనం నిలబడి మౌనంగా ఆయన ఆత్మ శాంతి కోసం ప్రార్థన చేస్తున్నారు

ఆనంద్‌కు దుఃఖం ముంచుకొచ్చింది కానీ మనసు తీరా ఏడవటానికి ఇది సమయం కాదు దుఃఖాన్ని అదిమిపెట్టి తనూ వారి పక్కగా చేరి మౌనంగా ప్రార్థన చేయసాగాడు

* * * * *

ఫాదర్ మరణం ఆనంద్ గుండెలో పెద్ద గాయాన్ని చేసింది తనని కడసారిగా చూడాలని ఫోన్ చేయించిన ఫాదర్ ప్రాణాలు తను వెళ్ళే వరకూ ఆలేదు అదే

ఆనంద్ గుండెలో పెద్ద పుండులా ఉంది

తండ్రి చనిపోయినప్పటికంటే ఎక్కువగా బాధపడ్డాడు అయిన వారంతా కంటికి రెప్పలా చూడకపోతే ఆనంద్ పిచ్చివాడు అయ్యేవాడు

ఈ దుఃఖంలో పెళ్ళి మాట అసలు పట్టించుకోదని జ్యోతి ఆ విషయం వదిలేసింది

ఆనంద్ గుండెకు ఒక గాయం తగ్గితే మరో గాయం అవుతున్నందుకు సారదికి చాలా బాదగా వుంది స్నేహితుడికి తన సాధ్యమయినంతగా స్వాంతన చేకూరుస్తూనే ఉన్నాడు

* * * * *

ఫాదర్ చనిపోయి అప్పుడే ఆరు నెలలు గడచిపోయాయి ఆనంద్ ఫాదర్ కోసం ఎన్నో ప్రార్ధనలు చేసాడు ఈ ఆరు నెలల్లో ఆయన్ను తలవని రోజు లేదు

ఆ రాత్రి ఆనంద్ మంచి నిద్రలో ఉన్నాడు

ఫాదర్ వచ్చారు ఆయన్ని చూడగానే ఆనంద్ చిన్న పిల్లవాడిలా ఏడుస్తున్నాడు

ఆయన మాట్లాడుతున్నారు అస్పష్టంగా ఏదో ఏడవద్దని సంజ్ఞ చేస్తున్నారు ఆయన మాటలు ఆనంద్‌కు ఏమీ అర్ధంకావటం లేదు

చివరకు ఎక్కడికో వెళ్ళిపోయారు కాసేపటికి తిరిగి వచ్చారు ఈసారి ఆయన వెంట ప్రమీల ఉంది ప్రమీలను తెచ్చి ఆనంద్‌కు అప్పగించారు దూరంగా సారథి వస్తున్నాడు అన్నయ్యను చూడగానే ప్రమీల ఆనంద్ చేయి విదిలించుకొని ఎక్కడికో పారిపోయింది

పాదర్ నిర్వికారంగా చూస్తున్నారు

"పాదర్! నన్ను కనికరించండి" ఆనంద్ అరుస్తున్నాడు

"ఆనంద్!" రాజేశ్వరి కొడుకు మొహం మీద నీళ్ళు జల్లింది

ఆనంద్‌కు మెలువ వచ్చింది

"పీడ కల గాని వచ్చిందా బాబూ!"

"పీడ కలా?" ఉలిక్కిపడ్డాడు పీడ కల కాదు మంచి కల కనీసం కలలోనైనా పాదర్‌ని చూసాను అనుకున్నాడు

"లేదమ్మా! పాదర్ కలలోకి వచ్చారు అంతే నువ్వెళ్ళి పడుకో" అంటూ తల్లిని పంపేసి తను కాసేపు ప్రార్ధన చేసుకుని పడుకున్నాడు

* * * * *

"ఒరేయ్ శుభవార్త" సారది ఆనంద్ ఆఫీస్ రూమ్‌లోకి వస్తూనే చెప్పాడు

"కూర్చోరా సారదీ! ఏమిటి శుబ వార్త?"

"ప్రమీలకు పెళ్ళి సంబంధం కుదిరింది వరుడు ఐ ఎ ఎస్ పరీక్ష రాసాడు మాకు దూరపు బంధువులకు తెలిసినతను మా బంధువుల ఇంట్లో ప్రమీలను చూసాడట దాంతో ప్రమీల వివరాలు తెలుసుకుని నా దగ్గరకు వచ్చాడు ప్రమీలను చేసుకుంటానన్నాడు మేం కట్న కానుకలు ఎక్కువ ఇవ్వలేం అని చెప్పాను అవన్నీ అనవసరం అని కొట్టేసాడు"

సారది సంతోషంగా చెప్తుంటే ఆనంద్ మొహంలో నీలి నీడలు అలుముకున్నాయి

"అతడు మీ కులమేనా?" అడగలేక అడిగాడు

సారథి నవ్వాడు "ఒరేయ్! నాకుంది ఒక్క చెల్లెలు నువ్వు నీ చెల్లెలిని జీవితం చక్కగా చూడాలనుకున్నట్టుగా నేనూ నా చెల్లెలి మంచి కోరుకున్నాను తప్పా? అతడు మా కులమే"

ఆనంద్ మొహం నల్లబడింది

"పోనీరా! మనలో మనకు వాదాలు ఎందుకు? ఈ సాయంత్రం అతడు ప్రమీలను చూడటానికి మా ఇంటికి వస్తున్నాడు అతడితో పాటు అమ్మ, నాన్నా అక్కను తీసుకు వస్తానన్నాడు అందుకే నేను నిన్ను ఆహ్వానించటానికి వచ్చాను మన ఇద్దరం వెళదాం కమాన్!" సారది అన్నాడు

"వద్దు లేరా! నేను ఎందుకు?"

"అలా అనకు ఆనంద్! మనిద్దరం కలసి నీ చెల్లెలు పెళ్ళి చేసాం అలాగే న చెల్లెలి పెళ్ళి కూడా చేద్దాం" సారది బలవంతం చేయటంతో ఆనంద్ ఇక బెట్టు చూపలేక పోయాడు ఆఫీస్ అవగానే ఇద్దరూ కలసి బజారులో స్వీట్స్, పళ్ళూ పువ్వులు కొనుక్కుని సారది ఇంటికి వచ్చారు (ఇంకా ఉంది)

## బహుగుణ నిష్కర్షలు!!

రాజకీయాలలో తల పండిన నాయకుడు. గతంలో ఎన్నో బాధ్యతాయుతమైన పదవులను నిర్వహించిన సమర్థుడు, లోక్‌దళ్ (బి) అధ్యక్షుడు హేమవతీనందన్ బహుగుణ తన పార్టీ రాష్ట్ర నాయకుల మీద నిష్కర్షలు ఆడుతున్నారా? పార్టీ వ్యవహారాలలో రాష్ట్ర నాయకులయిన దేవీలాల్, కర్పూరీ ఠాకూర్, ములాయాం సింగ్ యాదవ్‌లకు ఉన్న స్థానం ఆయనకు లేనట్టు కనబడుతోంది. దాన్ని ఆయన తమ నిష్కర్షల ద్వారా వ్యక్తం చేస్తున్నారు. పార్టీ భవిష్యత్తు గురించి ఒక ప్రశ్నకు జవాబుగా ఆయన "దేవీలాల్‌ను అడగండి" అన్నారు. "ఆయనే మా నాయకుడు. అన్నీ మేం ఆయన నిర్ణయానికే వదిలేశాం" అని కూడా అన్నారు. మరి మీరు పార్టీ అధ్యక్షుడు గదా అని మళ్ళీ ప్రశ్నిస్తే "లేదు, లేదు, నేనెంతటి వాణ్ణి? నేను ఒక చిన్న మనిషిని. దేవీలాలే మా నాయకుడు. ఆయననే అడగండి" అన్నారు బహుగుణ!.....



## కళాశాల కోసం 60 వేల డాలర్ల నిధిని సమకూర్చిన మైఖేల్ జాక్సన్

ప్రపంచ ప్రఖ్యాత గాయకుడు మైఖేల్ జాక్సన్‌కి ఫిస్క్ విశ్వ విద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ పట్టాని ప్రదానం చేసి సత్కరించారు. యునైటెడ్ నీగ్రో కాలేజి సహాయార్థం ఆయన తమ ప్రదర్శనల ద్వారా అరవై వేల డాలర్ల నిధిని పోగు చేసి ఇచ్చినందుకు ఆయనని ఆ విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ బిరుదుతో సత్కరించారు...

★ ★ ★

ప్రపంచ హెవీ వెయిట్ ఛాంపియన్ మైక్ టైసన్ రెండు రోజుల్లో రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. అయితే

# వ్యక్తు

## రెండు రోజుల్లో రెండు
## బాక్సింగ్ ఛ

పెళ్ళికూతురు మాత్రం ఒకమ్మాయే! ఎ. బి. సి. టెలివిజన్ చిత్రం 'హెడ్ ఆఫ్ ది క్లాస్'లో నటించిన 23 సంవత్సరాల టి. వి. తార రాబిన్ గివెన్స్‌ని పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్న వెంటనే క్షణం కూడా వృధా.



## ...తం

### పెళ్ళిళ్ళు చేసుకున్న ...ంపియన్

పోనీయకుండా ఆమెని టైసన్ రోమన్ కాథలిక్ సంప్రదాయంలో చికాగోలో వివాహ మాడాడు. మళ్ళీ చట్టబద్ధంగా న్యూయార్కులో సివిల్ పద్ధతిలో పెళ్ళాడాడు. మైక్ టైసన్ వయసు 21 అయితే గివెన్స్‌కి 23 ఏళ్ళు...





### మంత్రిగారి మతి మరపు!

కేంద్ర దేశీయాంగ మంత్రి బూటాసింగ్‌కి ఈమధ్య మతిమరుపు ఎక్కువైపోయిందట. కేరళలోని కాలికట్‌లో ఉన్న కొట్టక్కల్ ఆర్య వైద్యశాలలో ఆయుర్వేద చికిత్స పొందుతున్న తమ సతీమణిని పరామర్శించే నిమిత్తం ఈ మధ్య ఆయన తరచు అక్కడికి వెళ్తున్నారు. ఈ ప్రయాణాల సందర్భంగా ఆయన మతిమరుపు సంగతి అందరికీ తెలిసింది. కేప్ కామరూన్‌కి వెళ్తూ ఆయన తమ చేతి గడియాన్ని కొచ్చిన్‌లో, బ్రీఫ్‌కేసుని తిరువనంతపురంలో మరచిపోయారట. వాటిని తిరిగి తీసుకు రావటానికి ప్రత్యేకంగా మనిషిని పంపించాల్సి వచ్చింది. మళ్ళీ తిరుగు ప్రయాణంలో తాము విమానాశ్రయానికి వచ్చిన కారులో చిన్న పెట్టిని ఒకదాన్ని మరచిపోయారట. కానీ అదృష్టవశాత్తూ భద్రతా సిబ్బంది వెంటనే దాన్ని గమనించి విమానం ఢిల్లీ బయలుదేరటానికి కొంచెం ముందుగానే దానిని ఆయనకి అందజేయగలిగారట!...

### ఇయాన్ బోధమ్ భవితవ్యం?

ఇంగ్లండ్‌కు చెందిన క్రికెట్ ఆటగాడు ఇయాన్ బోధమ్ చిక్కుల్లో పడ్డారు. అంతకు ముందే వివాదాస్పద మైన వ్యక్తిగా పేరున్న బోధమ్ ఇరుక్కున్న కొత్త వివాదం విమాన ప్రయాణానికి సంబంధించినది. ఆయన మెల్‌బోర్న్ నుంచి పెర్త్‌కు విమానంలో వెళ్తుండగా తోటి ప్రయాణీకులతో ఘర్షణ పడ్డారుట. ఆ ప్రయాణీకులను ఆయన అసభ్యకరమైన పదజాలంతో దూషించారట. ఈ వ్యవహారం కోర్టుకు చేరింది. ఇక ఇంగ్లీష్ క్రికెట్ బోర్డ్ ఈ విషయాన్ని తీవ్రంగా పట్టించుకుని ఒక నివేదిక సమర్పించమని బోధమ్‌ను ఆదేశించింది. క్రికెట్ ఆటగాళ్ళు వివాదాలలో తల దూర్చ వద్దని, ప్రవర్తన సక్రమంగా లేదని తేలిన వారిని కఠినంగా శిక్షిస్తామని బోర్డు ప్రకటించిన కొద్ది కాలానికే ఈ గొడవ జరిగింది...



# ఆడది కాదు... అమ్మ!



"అమ్మను సుఖపెట్టాలి! అవును కష్టాల్లో పుట్టి కష్టాల్లో పెరిగిన. అమ్మను ఎలాగైనా సరే సుఖపెట్టాలి ఇలా అనుకోవటం రామానికి కొత్త కాదు ప్రతిరోజూ కనీసం వందసార్లన్నా అలా అనుకుంటాడేమో

చిన్నప్పటి నుంచి అమ్మంటే పంచప్రాణాలు ఆమెకు చిన్న కష్టం వచ్చినా తనకే వచ్చినట్లు తల్లడిల్లి పోతుంటాడు తండ్రి చాలాసార్లు అమ్మమీద చెయ్యి చేసుకోవడం అతనికి తెలుసు అన్నెం పున్నెం తెలీని అమ్మని నాన్న అతని తల్లి మాటలు విని కొట్టటం రామానికి కోపం తెప్పించేది చీ చీ నాన్నమ్మలంతా వొరి కుళ్ళుమోతులు అనుకొనేవాడు నాలుగేళ్ళ వయసులో నే అతను

రామం అమ్మకి ఆ సంవత్సరమే ఆడపిల్ల పుట్టింది ఆ అమ్మాయి పుట్టిన వేళా విశేషమేమిటో గాని రామం తండ్రి తిరుగుళ్ళు కూడా బాగా తగ్గిపోయాయి అంతకు ముందు ప్రతి రోజూ తల్లి మాటో, మరెవరి మాటో పట్టుకుని ఆమెను చితగ్గొట్టే అతను పూర్తిగా మారిపోయాడు

చెల్లి పుట్టడం వల్ల అమ్మకి ఆ వయస్సులో చెయ్యి సాయం అయ్యాడు రామం అంత చిన్న వయసులో నే కష్టం విలువ తెలుసుకోవడంతో ప్రతి పనిలో నూ సామర్థ్యం సంపాదించాడు

నీ పనేబాగుందమ్మా కష్టం తెలిసిన మగ పిల్లవాడున్నాడు యిప్పుడు ఇద్దరు ఆడపిల్లలు అంటూ ఇంటి చుట్టూ వున్న అమ్మలక్కలు నవ్వినా సిగ్గుపడేవాడు కాదు రామం

చెల్లెలు పక్క గుడ్డలు ఉతకడం, పొడి బట్టలు ఉయ్యాల్లో వేయడం, జోల పాడడం, అమ్మకు నీరసంగా ఉంటే గ్లాసులో పాలు చెమ్చాతో చెల్లెలికి పట్టడం అన్నీ చేసేవాడు విసుగు లేకుండా

రామం ఏ పని చేసినా సిన్సియారిటీ వుండేది దానిలో పేదరికంలో పుట్టి, కష్టాల్లో బ్రతికిన అమ్మంటే అతనికి అభిమానం ఎలాగయినా సరె అమ్మను సుఖపెట్టాలి? అదే అతని ధ్యేయం అందుకు ఏ పనయినా అతడు చేస్తాడు కూడా

సంవత్సరాలు గడుస్తున్నాయి రామం కాలేజీలో చదువు పూర్తి చేశాడు అతన్ని 'అమ్మ కూచి' అని ఎందరు ముఖమ్మీదే అన్నా ఏమాత్రం కోపం తెచ్చుకోకుండా నాకు అమ్మంటే ప్రాణం ఆమెను విడిచి క్షణం వుండలేను అనేవాడు కాలేజీలో చదువుతున్న కాలంలో కూడా కాలేజీకి వెళ్ళే ముందూ, వచ్చిన తర్వాతా అమ్మ చేసుకొనే అన్ని పనుల్లోనూ సాయం చేసి పెట్టేవాడు

ఒకరోజు-

రామం ఇంటర్‌లో ఉన్నప్పుడు కామోసు కాలేజీ నుంచి సాయంత్రం ఇంటికి రాగానే ప్రొద్దున్న ఇడ్లీల కోసం పప్పు రుబ్బుతున్న తల్లి కనిపించింది నేను రుబ్బుతాను నువ్వు కూర్చోమ్మా' అంటూ పుస్తకాలు లోపల పెట్టి డ్రస్సన్నా మార్చుకోకుండా ఆ పని తన చేతులోకి తీసుకున్నాడు నీకెందుకురా వెదవా' నేను చేసుకుంటాను కదా' అని అమ్మ తిట్టినా సరే వినకుండా

ఆమెకు ముచ్చటగా వుంది ఇంట్లో ఆడపిల్ల వున్నా దానికంటే ఎక్కువగా సాయపడుతున్న కొడుకన్నా, అతని కష్టం సహించని మనసన్నా ఆమెకు ప్రాణం వీడి పెళ్ళాం అయ్యే పిల్ల సుఖపడిపోతుంది అనుకొంది తనలో తానే

సరిగ్గా అప్పుడే రామం ఇంటి ప్రక్క సందులో డాబాలో ఉంటున్న అతని క్లాస్మేటు రెండు జెళ్ళ గీత (కాలేజీలో రెండు జెళ్ళసీత లేదా పీతాఅని పిలుస్తుంటారు అంతా) నోట్సు కోసం వచ్చేసింది ఎదురుగా కనిపించిన దృశ్యంకి మతిపోయింది గీతకి క్లాసులో లెక్చరర్ల మతులు పోగొట్టే మోస్ట్ బ్రిలియెంట్ స్టూడెంట్ అమ్మాయిలు ఆరాధ్య ధైవంలా భావించే రామం పప్పు రుబ్బుతూ కలా, నిజమా అన్న భ్రమకు లోనై కళ్ళు నులుముకుని మరీ చూసింది

కల కాదు నిజమే ముందు కదుగులేసింది

తన క్లాస్మేటు తననా స్థితిలో చూసిందన్న బాదన్నా అతనిలో కలగలేదు

కూర్చో గీతా! ఐదు నిముషాల్లో వచ్చేస్తాను' అన్నాడు రామం

తల్లికి మాత్రం కొడుకు ఆ పరిస్థితిలో తోటి క్లాసులోని అమ్మాయికి 'కనిపించడం బాదేసింది నువ్వెళ్ళరా రామం రేపు నీ క్లాసులో ఎవరికన్నా ఆమె చెబితే బావుండదు అంది

పర్వాలేదు లేమ్మా' నేనేమన్నా చేయకూడని పని చేస్తున్నానా సిగ్గు పడడానికి?' అంటూ రుబ్బిన పప్పు గిన్నెలోకి ఎత్తి తల్లి కందించి చేతులు కడుక్కుని, నోట్సు అందించిన' రామం వంక ఆరాధానగా చూసింది గీత

అత్తయ్యగారూ' రామానికి మంచి ట్రైనింగే ఇచ్చారు రేపు కాబోయే మీ కోడలు ఎవరో గానీ గొప్పగా సుఖపడి పోతుంది లెండి' నవ్వుతూ అని నోట్సుతో వెళ్ళిపోయింది గీత

రామం తల్లిలోని అమ్మ మనసు పొంగిపోయింది

★ ★ ★ ★ ★

## యన్. కె. నాగేశ్వరరావు

ఒక్క రోజు కూడా అమ్మను విడిచి పెట్టి ఉండలేని రామానికి సంవత్సర కాలంపాటు కాకినాడలో ఉండాలని తెలీడంతో కష్టంగానే వుంది

అయినా తప్పదు

డిగ్రీ తర్వాత అతను అప్లై చేసిన ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణా సంస్థలో సీటొచ్చింది మెరిట్‌పై

కాకినాడ వెళ్ళి ట్రైనింగ్ పొందాలంటే ఆ కాలమంతా అమ్మకు దూరంగాగడపాలి ఎలా?

'అమ్మా' అంత దూరం వెళ్ళి ట్రైనింగ్ అవ్వకపోతే ఏం పోయింది? ఇక్కడే ప్రైవేట్‌గా ఎమ్మే కడతాను అన్నాడు

ఆ మాట తండ్రి దగ్గర అనాల్సింది కానీ అమ్మ దగ్గరున్న చనువు ఆ మాట తండ్రికి చెప్పి ఒప్పిస్తుందనే ధీమాతో అడిగాడు

గోపాలరావుకి సంగతి తెలిసి చిందులేశారు చెట్టంత ఎదిగిన కొడుకుని కూడా కోపం వస్తే చేయి చేసుకోవడం అతనికి కొత్త కాదు అంత పనీ ఆయన చేసేవాడు కానీ రామం తల్లి మధ్యకు రావడంతో వెనక్కి తగ్గారు అమ్మకూచిలా వాణ్ణి తయారు చేశావ్ వేలకు వేలు ప్రైవేటు సంస్థల్లో పోసినా రాని సీటు వాడికి వస్తే వెళ్ళనంటాడా? కోపంతో అన్నారాయన

పి జి చేస్తాను నాన్నా' తండ్రి కోపానికి జడిసినా, తల్లి దగ్గరే ఉండాలన్న ఆశతో అడిగాడు రామం

పి జి చేసినంత మాత్రాన ఈ రోజుల్లో ఉద్యోగాలొస్తాయా? టీచర్ ట్రైనింగయితే జాబ్ గ్యారెంటీ వుంటుంది ఎంత? సంవత్సరమేగా నెలా నెలా వద్దువుగానితే వెళ్ళు!" ఖండితంగా చెప్పేశారు ఆయన

అవున్రా రామం' నీకెప్పుడు రావాలంటే అప్పుడు రా, ఇంటికి నాన్నగారు చెప్పింది కాదనకు, అమ్మ



కూడా అలాగే అనడంతో తొలిసారిగా అమెను వదిలి దూరంగా వెళ్ళడానికి సిద్ధపడ్డాడు రామం.

★ ★ ★ ★ ★

అమ్మే యిల్లుగా, అమ్మే లోకంగా, అమ్మే సర్వస్వంగా ఉన్న రామానికి ఆ కొత్త చోటులో ఏదో వెలితి.

మొదటి రోజు క్లాసులో పాఠాలుతలకెక్కలేదు.

మర్నాడే ఇంటికి ప్రయాణయ్యాడు."అదేంరా! రేపు సెలవు కూడా కాదు. అప్పుడే వచ్చేశావేంటి?" నీ అదృష్టం బావుండి నాన్నగారు ఇంకా ఆఫీసు నుండి రాలేదు. వెళ్ళిళ్ళు... ఆయనకి తెలిస్తే చంపేస్తారు!" కొడుకుని రెండు రోజుల ఎడబాటు తర్వాత చూసానన్న ఆనందంకంటే, తన మీద బెంగతో కొడుక్కి ఆరోగ్యం పాడవుతుందేమోనన్న బెంగ ఆమెలో కలిగింది.

"ఒరే... రామం! నువ్వు మగాడివిరా. మనసు ధిటవు చేసుకోవాలి. నేనెక్కడికి పోతాను? నీ అమ్మను. నా కొడుకు ప్రయోజకుడై నన్ను సుఖపెట్టేందుకు వస్తాడన్న సంతోషంతో నీ కోసం ఎదురు చూస్తూ ఇక్కడే ఉంటాను... సరేనా... బయల్దేరు..."

అమ్మ చెప్పిం దాంట్లో నిజం కనిపించి వెంటనే వెనక్కి వచ్చేశాడు రామం...

కాల చక్రంతో మూడు నెలలు గడిచాయి.

ఈ మధ్య కాలంలో పదిసార్లన్నా సెలవులు వచ్చినప్పుడల్లా ఇంటికి వెళ్ళి వచ్చేవాడు రామం.

అమ్మను సరిగ్గా సుఖపెట్ట లేకపోతున్నాను. ఆడపిల్లగానైనా పుట్టినా బావుండును. ఈ చదువులు... ట్రైనింగులూ లేకుండా ఎప్పుడూ అమ్మ దగ్గరే, అమ్మకు సాయం చేస్తూ అక్కడే ఉండేవాడిని... అనుకొనేవాడు. ఆడపిల్లయినా వయసొచ్చాక పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోతుందని, అది తప్పనిసరని... రామం ఆలోచించలేదు.

ఇన్స్టిట్యూట్‌లో ఒక్కొక్కరే పరిచయమవుతున్నారు రామానికి. రామంలో ఉన్న తెలివితేటలకి ప్రిన్సిపాల్‌తో సహా సహోధ్యాయులు కూడా అతనంటే ప్రాణం పెడుతున్నారు.

అదే సమయంలో అతనికి పరిచయమయ్యింది సౌమ్య. సౌమ్యగొప్ప అందగత్తె కాదు. కానీ ఆమెలో ఏదో గొప్ప ఆకర్షణ కనిపించింది రామానికి. ఆ ఆకర్షణ అతని మనసును కట్టిపడేసింది.

సౌమ్య కూడా రామంలో ఉన్న సునిశిత ప్రతిభా సంపత్తికి చెయ్యెత్తి నమస్కరించింది ముఖ్యంగా ఆడవాళ్ళంటే అతను చూపించే గౌరవం ఆమెకు నచ్చింది. అక్కడ ఉన్న మిగతా మగవాళ్ళలా "ఎవరైనా సరే ఆడపిల్లతో మాట్లాడ్డం చాలు" అనే విధంగా ఏదో వంకపెట్టుకుని మాట్లాడే వాడు కాదు అతను.

తనంత తానుగా ఎవరైనా మాట్లాడితే తప్ప, వారి విషయంలో జోక్యమే చెసుకొనేవాడు కాదు.

నెల రోజుల పరిచయం తర్వాత ఒక రోజు తనంత తానుగానే రామాన్ని తనింటికి ఆహ్వానించింది సౌమ్య.

ఆ రోజు జనవరి ఫస్ట్.

సౌమ్య ఇంటికి ఉదయాన్నే లేచి, తయారై రూమ్‌కి లాక్ చేసి బయల్దేరాడు రామం. బజార్లో చాలా సందడిగా వుంది. యాపిల్, బొకేలా దుకాణాలు వద్ద జనం విపరీతంగా ఉన్నారు.

రెండు యాపిల్ పండ్లు, బొకేలు కొని సౌమ్య ఇంటికి వెళ్ళాడు.

ఎదురుగా ముగ్ధంగా, మనోహరంగా తలంటిన కురులు ఆరబోసుకుని నిల్చున్న సౌమ్య కళ్ళల్లో ఏదో తెలీని ఆనందం.

రామంకి ఆమెను చూస్తుంటే అప్రయత్నంగా అమ్మ గుర్తొచ్చింది. అచ్చు అమ్మ ఇలాగే వుంటుంది కదూ? అనుకున్నాడు.

"రండి..." లోని కాహ్వానించిన ఆమెకి తన వెంట తెచ్చినవాటిని అందించి నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పాడు

"రమ్మన్నాను కానీ... మీరు వస్తారని అనుకోలేదు... థాంక్స్" అంది.

సౌమ్య, తల్లి దండ్రులకు తొలి సంతానం. ఆమె తర్వాత ఇద్దరు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు. ఆమె తల్లిదండ్రులది ఇంటర్‌కాస్ట్ మ్యారేజ్. దాంతో అయినవాళ్ళకి దూరంగా వుంటోంది ఆ కుటుంబం.

ఆమె ఇల్లు బీదరికానికి ప్రతీకగా వుంది. ఒక మూల దీర్ఘకాల రోగంతో మంచం పట్టిన తల్లి వుంది. వ్యాపారాల్లో మునిగి తేలుతూ ఎప్పుడూ దూర ప్రాంతాల్లో వుండే తండ్రి ఆ రోజే ఇంటికి వచ్చారు ఆయన.

పరిచయాలయ్యాక, కాఫీ తెచ్చి అందించింది సౌమ్య.. ఆమె సాన్నిధ్యంలో కాలం తెలీలేదు రామానికి.

ఆమెకు తెలీకుండా అతని మనసులో ఒక భావం రూపుదిద్దుకొంది... అయితే అతనికి తెలీదు అదే భావం ఆమెలోనూ ఏనాడో ప్రాణం పోసుకుందని.

అది మొదలు రామం వీలు దొరికినప్పుడల్లా సౌమ్య ఇంటికి వెళుతున్నాడు. ఇప్పుడు సెలవు దొరికితేచాలు అమ్మ కోసం ఇంటికెళ్ళడం బాగా తగ్గింది. ఆ సమయాన్ని సౌమ్య వద్దే గడుపుతున్నాడు.

సౌమ్య అన్ని విధాలుగా అతనికి నచ్చింది.

కుటుంబానికి పెద్దగా, ఆడపిల్లయినా తన వంతు బాధ్యతని నిర్వర్తిస్తున్న ఆమె అంటే ఇష్టం పెరిగింది. వ్యాపారంలో నష్టం తప్ప లాభం ఎరుగని తండ్రికి ఆమె పెద్దకొడుకే.

ప్రతి రోజూ ఇన్స్టిట్యూట్‌కి వచ్చే ముందు రెండు గంటలు, సాయంత్రం పూట మరో మూడు గంటలు ట్యూషన్ చెబుతూ, ఆ సంసారానికి చుక్కానిలా సాయపడుతున్న ఆమె పట్ల ఒక రకమయిన ప్రేమానుభూతి అంకురించింది రామం మనసులో.

ప్రతి రోజూ ఇంటి పనులతోనూ, ట్యూషన్‌లతోనూ తన సమయమంతా ఖర్చు చేసే సౌమ్యకు తన చేతనయినంత సహాయాన్ని అందించసాగేడు రామం.

ట్రైనింగ్‌లో రికార్డులు ప్రిపేర్ చేయడం, ఎయిడ్స్‌ను తయారు చేయడం, లెసన్ ప్లాన్‌లు వెయ్యడం అన్నింటిలో రాత్రీ పగలూ కష్టపడి ఆమెకు కష్టం కలగకుండా, తను శ్రమించేవాడు.

ఇంటి దగ్గర అమ్మకు ఎలా సాయం చేసాడో, ఇక్కడ కూడా సౌమ్యకు తన సహాయం విద్యా విషయాల్లో అందించేవాడు. ఆమె కళ్ళల్లో కృతజ్ఞతా పూర్వకంగా కనిపించే కాంతిలో అర్తిని చూసేవాడు. అంతే!

అదే సమయంలో ఇంటి దగ్గర్నుంచి వెంటనే రమ్మని ఉత్తరం రావడంతో వెళ్ళలేక వెళ్ళాడు రామం.

"మంచి సంబంధమట, యాభై వేలుకట్నం, అమ్మాయిని చూడ్డానికి వెళ్దామని నాన్నగారి



# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు, అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే, అతనికి సెరిలాక్ లాభాలన్నింటినీ యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారు కావడం.

కాబట్టి, పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్, 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.

పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకుగాను, దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.






Nestlé

R K SWAMY/FSL/4974-TEL

పట్టుదల అందుకేనీకు రాశారు చెప్పింది అమ్మ

అమ్మకు చెప్పాలి?

నీలాగే కష్టాల్లో పుట్టిన, పేదరికంలో బ్రతుకుతున్న అమ్మాయిని ప్రేమించా.... ఆమెనే పెళ్ళాడుతానని ?

ఎలా? చెప్పాలి తప్పదు ఆలస్యం చేస్తే నాన్నగారు అవతల వారికి మాట ఇచ్చేయవచ్చు' అమ్మో

మథనపడి, మథనపడి చివరికి తను మనసుపడ్డ అమ్మాయి సంగతి చెప్పేశాడు అమ్మకి రామం

అచ్చం నీలాగే వుంటుందమ్మా " అన్నాడు

అమ్మ మంచిది

అమ్మ మనసు తన కోరిక కాదనదు అనుకున్నాడు

అలాగే రామం కోరిక ఆమె కాదనలేదు భర్త ససేమిరా అన్నా, 'ఒక్కగా నొక్క కొడుకు కోరిక తీర్చడం మన ధర్మం డబ్బు శాశ్వతమా? అంటూ ఒప్పించింది

ఎగిరి గంతేసి వెంటనే వచ్చేశాడు కాకినాడ రామం

సిన్సియర్‌గా ప్రేమించావన్న సంగతి నాకు తెలుసు కానీ మన ప్రేమ పండించుకొనే అవకాశం చిక్కాక, నువ్విలా వెనకడుగు వేయడం బాగోలేదు .' అన్నాడు అమ్మ మనసున్న ఆమెను వదులుకోవడం ససేమిరా ఇష్టలేదు రామానికి

"నేను పెళ్ళి వద్దనటంలేదు రామం! కానీ, పెళ్ళి తరువాత అందరి ఆడపిల్లల్లా అత్తవారింటికి రాలేను అంటున్నాను" అంది సౌమ్య

రామం నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది ఎంతో కాలంగా సంసార ఝంజాటంలో పడి నిరంతరం పనులతో విసిగిపోయిన అమ్మకు ఆడ సాయంగా కోడల్ని తీసుకెళ్దామనుకుంటే-

సౌమ్య ప్రవర్తన అందుకు విరుద్ధంగా? అలో చించలేకపోతున్నాడు రామం.

నేను అమ్మ కష్టాలు తీర్చలేనా? అమ్మను సుఖపెట్టనప్పుడు తనకు పెళ్ళెందుకు? ప్రాణానికి




జరిగినదంతా సౌమ్యకి చెప్పాలి?

ఈ సంగతి విని ఎంత ఆనందపడి పోతుందో?

ఆ ఆనందంతో విప్పారే అచ్చం అమ్మలాంటి ఆమె కళ్ళలో పొంగి పొరలే ఆనందం మనసు నిండేలా చూడాలి? అనుకున్నాడు రామం

సంగతి విన్న సౌమ్య, ఆనందపడలేదు అందుకు- ఆశ్చర్యపోయాడు రామం

"పెళ్ళి జరిగితే నేను మీ ఇంటికి వచ్చేయాలి కానీ నాకది ఇష్టంలేదు" అన్న సౌమ్య వంక మరింత ఆశ్చర్యంగా చూశాడు

ఏం? ఎవరికి పెళ్ళయినా ఆ అమ్మాయి అత్తవారింటికి రావడం సహజమే కదా! అడిగాడు

సహజమే! కానీ ప్రస్తుత మా ఇంటి పరిస్థితులను చక్కదిద్దకుండా స్వార్థంగా నేను దూరంగా నా సుఖాన్ని నేను వెదుక్కొని వెళ్ళిపోవటం అన్యాయం కదూ! అంది సౌమ్య

వింతగా మాట్లాడకు సౌమ్యా! నిన్నెంతో సిన్సియర్‌గా ప్రేమించాను నువ్వూ అంతే

ప్రాణమయిన అమ్మను విడిచి దూరంగా, శాశ్వతంగా ఉండగలనా? అతని గుండెల్లో ఆవేదన

సౌమ్య అభిప్రాయం ఖచ్చితంగా తెలిసిన తర్వాత మరి వాదాన్ని పొడిగించలేదు రామం

ట్రైనింగ్ పూర్తయి పోయింది ఇంటికి వచ్చేశాడు

సౌమ్య మామూలుగా ఉత్తరాలు రాస్తోంది తనకు ఇష్టమయిన రామంతో సహజీవనం కన్నా తననినమ్ముకొన్న ఇంట్లో వాళ్ళ పరిస్థితిని ఒక కొలిక్కి తీసుకు రావడం ముఖ్యం ఆమెకి ఆ ఉద్దేశ్యాన్నే పదే పదే వ్రాసేది రామంకి

అమ్మ సుఖం కంటే లోకంలో మరేదీ అక్కర్లేని రామం సౌమ్యను త్యాగం చేయడానికే సిద్ధపడ్డాడు

రిజల్ట్సు వచ్చాయి రామం ఫస్ట్ క్లాసులో పాసయ్యాడు అదే సంవత్సరం పోస్టు కూడా వచ్చింది వెంటనే జాయినయ్యాడు

తమ నుండి గ్రీన్ సిగ్నల్ వచ్చినా, పెళ్ళి తలపెట్టని కొడుకు పరిస్థితి చూసి రామం అమ్మకి అనుమానం వచ్చింది అదే విషయాన్ని భర్తతో చెప్పింది

వయసు వేడిలో ప్రేమించారు ఇద్దరికీ ఏ విషయాల్లోనైనా అభిప్రాయభేదా లొచ్చుంటాయి ట్రైనింగ్‌లో ఇలాంటి పరస్పర ఆకర్షణలు చివరి దాకానిలవ్వు ' అంటూ కొట్టిపారేశాడు అతను

అయితే రామం అమ్మగారి తల్లి మనసు అలా కొట్టి పారేయలేక పోయింది వెంటనే సౌమ్యతో నీ పెళ్ళి సంగతి మాట్లాడ్డానికి ఎప్పుడు బయల్దేర మంటావ్? నాన్నగారు అడగమన్నారు?" అన్నారామె

అంతవరకూ ఎంతో బింకంగా ఉన్న రామం తల్లి అలా అడగటంతో నీరైపోయాడు తల్లి వొడిలో తలపెట్టి బావురుమంటూ అంతా చెప్పేశాడు

నువ్వే చెప్పమ్మా! నిన్ను సుఖపెట్టడానికే కదా! కోడలు ఈ ఇంటికి వచ్చేది కానీ, సౌమ్య బాధ్యత లున్నాయంటూ నన్నే ఇష్టమయితే తన దగ్గరే ఉండాలంటుంది ఎలా?

చిన్న పిల్లాడిలా మాట్లాడుతున్న కొడుకుని చూసిఆమె నవ్వుకొంది

'నీ కాబోయే భార్య అడిగిందాంట్లో నేరమేం లేదు అలా చేయడంలో తప్పు కూడా నాకు కనిపించటంలేదు. చెప్పారామె

రామం విస్మయంగా అమ్మ వంకే చూడసాగేడు

ఔన్రా రామం! చిన్నప్పట్నుంచి తల్లి మీద ప్రేమ చూపించడం బిడ్డకు సహజమే అయితే పెళ్ళయ్యాక ఆ బిడ్డ ప్రేమ ఇంకా తనమీదే ఉండాలనుకోవడం మాత్రం నేరం రెక్కలొచ్చాక పక్షి తను పుట్టిన గూడు ఇరుగ్గా వుందని మరో గూడు వెదుక్కొని వెళ్ళిపోతే ఆపడం ఎవ్వరి తరం చెప్పు'

అంతెందుకు నేను కాపురానికొచ్చాక తన కొడుకుని తనకు దూరం చేస్తానేమోనన్న భయంతో మీ నాన్నమ్మ ఆయనకు చాడీలు చెప్పి నన్ను కొట్టించేది ఎంతకాలం అది జరిగింది? మీ నాన్నగారు తెలుసుకొనే దాకా అంతే కదా! ఈ రోజు నీ ప్రేమలో సగం నేను లాగేసుకుంటాననే బయంతోనో, తన వాళ్ళను దగ్గరుంటి ఆదుకోవాలన్న కోర్కెతోనో ఆ అమ్మాయి నిన్ను తనదగ్గరకే రావాలని కోరుకోవడంలో అర్థం వుంది నువ్వు ఇక్కడే వుండాల్సిన పనిలేదు నాకు భర్త అండ వుంది నీకు బాధ్యతలు తెలుసు చెల్లి పెళ్ళి చేయడం, పండగలకి ఆ పిల్లని అత్తారింటి నించి తీసుకొచ్చి నీ శక్తిమేరకు మర్యాద చేసి పంపడం నీ విధి అలా నీ పనులు నువ్వు చేయగలిగితే నువ్వెక్కడున్నా మాకు ఆనందమే

నువ్వు మనసు పడిన, నీవంటే మనసిచ్చే అమ్మాయి కోసం నీవు ఈ మాత్రం చేయకపోతే నీ ప్రేమకు విలువేలేదు ప్రేమించడంతో పాటు ఆ ప్రేమను బ్రతికించుకోడం కూడా నేర్చుకోవాలి. చెపుతూంది అమ్మ

ఆ క్షణం ఆమె ఆడదానిలా కాదు. అమ్మలా కాదు- అమృతమూర్తిలా కనిపించింది రామం కళ్ళకు అమ్మ అసూయకు రూపమయిన ఆడది కాదు అమ్మ నిజంగా అమ్మే! అనుకున్నాడు □

## ఆఫ్రికాలో మలేరియా జ్వరం!

ఆఫ్రికా నైరోబి, కెన్యా వంటి నగరాలలో మలేరియా జ్వరం వల్ల 14 ఏళ్ళ లోపు పిల్లలు ఏటికి సుమారు పది లక్షల మంది చనిపోతున్నారట మలేరియా జ్వరం ఆఫ్రికాలో విలయ తాండవం చేస్తోందట

## అంధత్వానికి కారణం విటమిన్ "ఎ" లోపం!

పిల్లలు పుట్టాక అయిదేళ్ళకుతమ కనుచూపు కోల్పోతున్నారట మన దేశంలో ఏటా సుమారు లక్షా నలభై వేల మంది పిల్లలు గుడ్డివారైపోతున్నారనీ, దీనికి కారణం విటమిను ఎ లోపమేననీ తత్ సంబంధశాఖ అన్నదట!

## పక్షుల్లో చిలుకల ప్రత్యేకత!

పక్షులలో కెల్లా చిలుకలు సుమారు వంద సంవత్సరాలు బ్రతుకుతాయట ఐర్లండ్‌కు చెందిన చిలుకలు నూట నలభైయ్యేళ్ళు కూడా బ్రతికినట్టు దాఖలాలున్నాయట

## ప్రపంచంలో కెల్లా పెద్ద విమానాశ్రయం!

ప్రపంచంలో కల్లా అతి పెద్ద విమానాశ్రయం జడ్డాకు చెందిన కింగ్ అబ్దుల్ అజీజ్ అంతర్జాతీయ విమానాశ్రయంట ఇది 10,620 హెక్టేకర్ల స్థలంలో నిర్మింపబడినదట సామాన్యంగా వో మాదిరి పెద్ద విమానాశ్రయానికి 600 హెక్టేకర్ల స్థలం చాలునట!

## దేని విలువ దానిదే!

ఒక్క న్యూక్లియర్ బాంబ్ ఫైటర్‌ను తయారు చేసే డబ్బుతో సుమారు వంద పడకలు గలిగిన 75 ఆసుపత్రులు నిర్మించ వచ్చునట న్యూక్లియర్ జలాంతర్గామి నిర్మాణానికి అయ్యే ఖర్చుతో సుమారు నలభై వేల అధునాతనమైన భవనాలు నిర్మించ వచ్చునట మెడకు కట్టుకునే టై ఖరీదుకు రెండు జతల చెప్పు లొచ్చినా అవి మెడకు తగిలించుకో డానికి పనికి రావు కదా!

## మితి మీరితే ఏదైనా ప్రమాదమే!

విటమినులు మంచివే చేస్తాయోహో అనుకుంటూ ఆ విటమిన్లను అధికంగా మింగుతూ పోతే అవి చాలా అపకారం కూడా చేస్తాయట ఆస్ట్రేలియాకు చెందిన విజ్ఞాని డాక్టర్ మైకేల్ ప్రిన్స్ అనే ఆయన విటమిన్ సి అధికంగా తీసుకోడం వల్ల మూత్ర పిండాలకు, మూత్రనాళాలకు సంబంధించిన రోగాలు వస్తాయని, కనుక పళ్ళు తినడం ఓ మితం మీరితే ప్రమాదమనీ అన్నారట– గాలెక్కువగా పీలిస్తే పూపిరితిత్తులు పగిలి ఛావరా!

## నాణెం ముద్రణ ఖర్చులో దూబరా!

భారత ప్రభుత్వానికి 5 పైసల నాణెం ముద్రించడానికి 10 37 పైసలు ఖర్చవుతోందట 25 పైసల నాణానికి 23 50 పైసలు 50 పైసల నాణానికి 44 81 పైసలు, ఒక రూపాయి ముద్రణకు 52 81 పైసలూ ఖర్చవుతోందట మనమేగాక మన దేశమూ కాస్త దూబరాయేనా ఏమి?!

## బ్యాంకు దోపిడి

సేలంకు చెందిన అర్థనారిపాలయానికి చెందిన కో–ఆపరేటివ్ బ్యాంకుమీద 18వ తేదీ రాత్రి నలుగురు దొంగలు దాడిచేసి, కాపలాదారుడు 47 ఏళ్ళ పెరియసామిని యినుపకమ్మిలతో కొట్టి చంపేసి, షట్టర్లు పగలేసి, ఎనిమిది కిలోల బంగారు నగలు, నగదూ ఎత్తుకుపోయాంట ఎంత చిన్న వూరైనా రాజమార్గంలో వున్న ఆ బ్యాంకు షట్టర్లు పగలేసి పాతిక లక్షలు అవలీలగా ఎత్తుకుపోగలిగిన ఆ దొంగలకోసం పోలీసు గాలిస్తోంచట




## కక్షతో హత్య!

ఆత్తూరుకు చెందిన 52 ఏళ్ళ కుప్పుసామి అనే వో హోమియోపతి డాక్టరు గారు వో హత్య కేసులో అరెస్టులు ఆనక జామీనులో బయటికి వచ్చారట తాను ఆత్తూరులో వుంటే యీ గొడవలలో ప్రాణాపాయం వుంటుందనే భయంతో విల్లుపురం వెళ్ళి అక్కడ వో గది తీసుకుని వున్నారట వో నాడు తన కూతుర్ని చూడాలన్న కోర్కెతో రాత్రి ఆ వూరు వెళ్ళారట అని తెలిసిన ఆయన విరోధులు, కత్తులతోనూ, గడ్డపారలతోనూ ఆ యింటి మీద పడితే, వెనుక దారి గుండా ఆయన బయట పడ్డాడట అది కనిపెట్టి, వారంతా అటు పరిగెత్తి ఆయన్ని పట్టుకు చంపేశారట

## మరో కట్నం చావు!

సేలం అన్నదానపట్టికి చెందిన రవీంద్రన్ అనే చేనేత కార్మికునికి ఏణ్ణర్థం క్రితం 19 ఏళ్ళ సిద్దేశ్వరి అనే ఆమెతో పెళ్ళయ్యిందట ఆ నాటి నుంచీ వీలున్నపుడల్లా పుట్టింటికి వెళ్ళి డబ్బు పట్రా అని చావ బాదేవాడట ఇవ్వగలిగినంత యిచ్చిన ఆమె తండ్రి ఇహ ముడియాదు అన్నాడట దాంతో ఆ రాత్రి రవీంద్రన్ ఆమెను చావ చితక గొట్టేశాడట ఈ ప్రత్యక్ష నరకం అనుభవించలేక ఆమె మొన్న రెండో తేదీ పురి పోసుకు చనిపోయిందట

## కేరళలో రోడ్డు ప్రమాదాలు!

భారత దేశంలో కల్లా కేరళలో ఎక్కువ రోడ్డు ప్రమాదాలు జరుగు తున్నాయట 1960లో ఈ రాష్ట్రంలో 1528 ప్రమాదాలు జరిగితే, 1985లో 9983 ప్రమాదాలుగా అభివృద్ధి చెందాయట అనగా రోజుకు ఆ రాష్ట్రంలో సుమారు 28 ప్రమాదాలన్న మాట!

## అమ్మాయిలను అమ్మే ముఠా ఆటకట్టు!

గుంటూరు తెనాలి ప్రాంతంలో అమాయకురాళ్ళయిన ఆడపిల్లలను మభ్య పెట్టి మద్రాసు బొంబాయి తరలించి వ్యభిచార గృహాలకు అమ్ముతూన్న వో ముఠాను ఆరో తేదీ అర్థ రాత్రి తెనాలి స్టేషనులో పట్టేశారట ఈ ముఠాకు నాయకురాలు సక్కుబాయి అనే ఆమె అట ఆమెతో బాటు ప్రసాద్ వన్నరు అనే మరో యిద్దర్ని కూడా పోలీసులు పట్టుకుని వారితో వున్న ఆరుగురు అమ్మాయిలనూ విడిపించారట

## భర్త అక్రమ సంబంధం– భార్యాపిల్లలు సజీవ దహనం

తన భర్త వో నర్సుతో సంబంధం పెట్టుకుని తనను నిర్లక్ష్యం చేస్తున్నాడన్న ఆవేదనతో సిరిపురం కు చెందిన ఆర్ యం ఎ డాక్టరు శ్రీనివాస్ అనే ఆయన భార్య 26 ఏళ్ళ సరోజ తన మీదే గాక, తన 8 ఏళ్ళ, ఆరేళ్ళ కూతుళ్ళు నాలుగేళ్ళ కొడుకుల మీద కూడా కిరోసిన్ పోసి నిప్పంటించేసుకున్నదట ఈ నలుగురూ సజీవంగా దహనమై పోయారట పోలీసులీ కేసులో కదనం మార్చ ప్రయత్నిస్తున్నారట– అయ్యో శంకులో పోస్తే గాని నీరు తీర్థంగా మారదు కదా! □

# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పశువుల భీమా చేయించి వుండకపోతే



నా ఎద్దులు చచ్చిపోయాయి, కాని పని మాత్రం ఆగి పోలేదు
ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త ఎద్దులు కొనుక్కోగలిగా.

రైతుకు అతడి ఎద్దులు ఎంత విలువైనవో, అతడికి, అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని, ఆ ఎద్దులకు రోగమొస్తే, ప్రమాదంలో దెబ్బ తగిలి పనికి రాకపోతే... లేదా చచ్చిపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యూరెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారి పశువుల భీమా**

ఒక ఏడాదిలో, పశువుల ఖరీదును బట్టి, ప్రతి 100 రూపాయలపై గరిష్ఠం 4 రూపాయలు చెల్లిస్తే చాలు! దేశమంతటా న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాల కోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యూరెన్స్




జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

**పశువుల భీమా–నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!**

R K SWAMY/NIA/3574/TEL

సీరియల్

# ఆడపిల్లలు-అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## ఆర్నెల్ల అసిస్టెంట్

సాయంత్రం ఆరు గంటలయింది. కాస్త వాన పడుతున్నది. ఆ రోజు ఆదివారం. దశరధరామయ్య ఇంట్లో కుటుంబ సభ్యులంతా, ప్రైవేట్ కంపెనీలో బోర్డాఫ్ డైరెక్టర్స్‌లా స్వీట్సూ, హాట్సూ తింటూ సమావేశమయ్యారు. ఏజెండాలో రెండు సబ్జక్ట్సు ఉన్నాయి. మొదటిది వ్యాపార బాధ్యతలన్నీ అభిలాష్ పూర్తిగా చూసుకోవటం. రెండోది అతనికి నచ్చిన సాంప్రదాయసిద్ధమైన కుటుంబంలోని చదువుకున్న ఆడపిల్లను, అతనికి అసిస్టెంట్‌గా వేసి ఆరు మాసాల తరువాత పెళ్ళి చెయ్యటం. కట్నం ప్రసక్తి లేదు. ఈ రెండు విషయాల మీద చర్చ సాగుతున్నది.

"డాడీ, మీ పేరు దశరధరామయ్య, ల్యాండ్ లార్డ్ అండ్ బ్యాంకర్ అనే చిన్న టైటిలూ ఉన్నది. మీరూ కాస్త పెద్దవారవుతుంటే ఆ టైటిల్‌ను చేజిక్కించుకోవలసిన బాధ్యత నాకూ ఉన్నది. దట్సాల్ రైట్, రెండో సబ్జెక్ట్ ఒక పిల్ల నాకు అసిస్టెంట్, ఆరు మాసాల తరువాత పెళ్ళి. ఈ కండిషన్‌లో అంతర్యం" నవ్వుతూ తల్లి వైపు చూసేడు. ఈ సబ్జక్ట్ తల్లిదని అతనికీ తెలుసు.

"అభిలాష్, మనకు డబ్బు, ఆస్తీ ఉన్నయ్యి. నీకు అందం చదువూ ఉన్నయ్యి. కాని బుద్ధి మాత్రం వక్ర మార్గంలో పోతున్నది. ఆ సంగతి నీకూ తెలుసు. ఆ హాబీలు నేను విన్నాను. పెళ్ళయితే ఆ భార్య మీద సర్వాధికారాలూ చెలాయిస్తావనేది నగ్న సత్యం. ఆడపిల్లల మీద నీకు గౌరవం లేదు. తాగి పారెయ్యి, తిని చంపెయ్యి, అనుభవించి నాశనం చెయ్యి అనేదే నీ మనస్తత్వం, అందుకనే...." మాట పూర్తి కాకుండానే లేచి తన గదిలోకి వెళ్ళాడు అభిలాష్.

"అభిలాష్ వెళ్ళిపోతావేం. రా ఇట్లా" అన్నదావిడ.

అభిలాష్ టేప్ రికార్డర్ తెచ్చాడు. క్యాసెట్ తెచ్చాడు. క్యాసెట్ ఉంచి టేప్ రికార్డర్ ఆన్ చేసాడు. క్రికెట్ మాచ్‌లు జరుగుతూ రేడియోలో ప్రత్యక్ష వ్యాఖ్యానం వస్తున్నప్పుడు, ఆ ప్రత్యక్ష వాఖ్యానాన్ని టేప్‌లో రికార్డ్ చేస్తాడు. మనస్సు బాగా లేనప్పుడూ, కాలక్షేపం కోసం అప్పుడప్పుడూ ఆ టేప్‌లు వేసుకుని విని ఆనందించటం అతని హాబీ.

ఇండియా, వెస్టిండీస్ మ్యాచ్ ఢిల్లీలో జరిగినప్పటి ప్రత్యక్ష వ్యాఖ్యానం టేప్ ఇప్పుడు వేసి వింటున్నాడు అభిలాష్. తండ్రి తల్లి వైపు చూస్తున్నాడు. తల్లి కొడుకు వైపు చూస్తున్నది. కూతురు పదేళ్ళ పిల్ల అనుపమ అర్థం అయీ కాక అందరి వైపూ చూస్తున్నది.

"తల్లీ తండ్రీ మాట్లాడుతుంటే, క్రికెట్ కామెంట్రీ వింటూ ఆనందిస్తున్నావురా, మాట్లాడవేంరా" కోపంతో అన్నదావిడ.

"అమ్మా, పేరులో ఏమున్నదీ, అని చాలామంది తోసి పారేస్తారు. ఉన్నదంతా పేరులోనే ఉన్నదమ్మా! నీ పేరు శాంతాదేవి, కాని ముక్కు మీదనే కోపం ఉంటుంది. కాస్త కోపాన్ని తగ్గించు. నా పేరు అభిలాష్ అని ఎందుకు పెట్టావో ఆ రోజుల్లో పసివాడినయిన నాకు తెలీదు. నా అభిలాష ప్రకారం నేను నడుచుకోవటంలో తప్పులేదు. నేనేదయినా తప్పు చేస్తే నువ్వు తల్లిగా నన్నెప్పుడూ శిక్షించలేవు. కన్న మమకారం కదా, అది సహజం. తప్పు, నేరం చేస్తే పోలీసులు అరెస్టు చేస్తారు. న్యాయస్థానం విచారించి నేను దోషినని ఋజువయితే శిక్ష విధిస్తారు. నేరము- శిక్ష అంటే అది, నువ్వు అది చేస్తున్నావ్, ఇది చేస్తున్నావ్ అంటే అది నేరం కానే కాదమ్మా" అన్నాడు. శాంతాదేవి విస్తుపోయింది.

"అభిలాష్, క్రికెట్ తరువాత ఇంటర్నేషనల్ గేమ్ ఏదిరా" అన్నాడు తండ్రి దశరధరామయ్య.

"సాముహిక మానభంగం".

అందరూ అటు చూసేరు. సింహద్వారం వద్ద వరండాలో నిల్చుని ఉన్నది సత్యభామ. ఎప్పటి నుంచి ఉన్నదో ఎవరూ చూళ్ళేదు.

"ఆడపిల్ల గుమ్మం దాటి ఇంట్లోకి వస్తున్నది. అయిన వాళ్ళ కూతురు కాదు. పరాయి వారి పడుచుపిల్ల" అని లోపలికి వచ్చి నిల్చున్నది.

"ఓ, సత్యభామ, రాక రాక వచ్చావ్, ఏమిటి విశేషం".

"కూర్చో సత్యా, ఏం జరిగింది. కూర్చుని తాపీగా చెప్పు" అన్నది శాంతాదేవి.

"చూడు మిస్టర్ అభిలాష్, డబ్బు కలవాడివి నువ్వొక్కడివే కాదు. తెలివితేటలు నీ ఒక్కడి స్వంతం కాదు. బి కేర్‌ఫుల్. నీకు ఇదే ఆఖరి వార్నింగ్. ఇందాక అన్నావే న్యాయస్థానం, శిక్ష , అని- యావజ్జీవ కారాగార శిక్షకు తయారయితే మరోసారి ప్రయత్నించు" కోపంతో అన్నది సత్యభామ.

అర్థంకాక అందరూ చూస్తున్నారు.

'పేరెంట్స్ ఆఫ్ ది, పెక్యూలియర్ మైండెడ్ సన్, మీ అభిలాష్‌ని కాస్త క్రాస్ ఎగ్జామిన్ చెయ్యనిస్తారా" అన్నది.

"మిస్ సత్యభామా, షటప్, ఇది కోర్టు కాదు. నువ్వు ప్లీడరువీ కాదు. ప్లీజ్ గో". కొరకొరలాడుతూ చూసేడు.

"మిస్టర్ అభిలాష్, శాంతాదేవి మీకు కన్నతల్లి. ఈ కన్నతల్లి మీద ప్రమాణం చేసి చెప్పండి, నేనూ గౌరవప్రదంగానే మాట్లాడుతున్నాను. సావిత్రి పనిచేసే కంపెనీ ప్రొప్రయిటరూ, మేనేజరూ, తమరూ కలిసి, అంటే సాముహికంగా సావిత్రిని మానభంగం చేద్దామని ప్రయత్నించారా, లేదా, ఆన్సర్ టు ది పాయింట్" అతని కళ్ళలోకి గుచ్చి చూస్తూ హుందాగా సోఫాలో కూర్చుని అడిగింది. శాంతాదేవి, దశరధరామయ్య అప్రతిభుల్లై కూర్చున్నారు.

"లేదు. అభూత కల్పన, సర్వ అబద్ధం. నన్ను అల్లరి చెయ్యటానికి పన్నిన కుట్ర, కుతంత్రం" కోపంతో అన్నాడు.

"అభిలాష్, కుట్ర, కుతంత్రం, వెన్నుపోటు, రిగ్గింగూ ఇవన్నీ జరపటానికి ఇవి ఎన్నికలు కాదు. వ్యక్తిగత విషయాలు. సావిత్రిని మానభంగం చెయ్యటానికి

**జరిగిన కథ-13:** విమల వింత ప్రవర్తనకు షాక్ తింటుంది శ్రీవిద్య. జగదీష్‌ను గురించి హేళనగా మాట్లాడిన అభిలాష్‌కు ఆమె సరైన సమాధానం చెపుతుంది. శ్రీవిద్య తల్లితో కూడా విమల వాళ్ల ఇల్లు విడిచి వచ్చి వాసు, రుక్మిణిల ఇంట్లో ఒక గదిలో చేరింది. శ్రీవిద్య తన ఎకౌంట్‌లో ఎ. ఎ. బి. బి. సి. సి. డి. డి. హేమంత్ అనే ఆయన పాతిక వేల రూపాయలు జమ కట్టబడి ఉండటం గమనించి అతను తమ వాలేరని బ్యాంక్ వారికి చెప్పింది. సావిత్రి జగదీష్ పర్ణశాలకి వచ్చి వెళ్ళింది.

మేం ప్రయత్నించలేదు. అని మీ తల్లిదండ్రుల మీద, వారి శిరస్సున చేతులు పెట్టి ప్రమాణం చేసి చెప్పండి" ఆదేశిస్తున్నట్లు అన్నది

"తప్పు లేకపోతే ప్రమాణం చేసి చెప్పరా అభిలాష్ ఈ పిల్ల దవగలు వాయించి పంపిస్తాను" అభిలాష్ కుడి చెయ్యి పుచ్చుకొని తన నెత్తిన పెట్టుకోబోయింది చెయ్యి లాగేసుకున్నాడు అభిలాష్

"ఈ విషయంలో గెలుపు " అర్థోక్తిలో ఆగింది

"నీదే, నీ అభియోగం వాస్తవం, నన్ను క్షమించండి" అటు తిరిగి చూస్తూ



అన్నాడు అభిలాష్

"గుడ్, యు ఆర్ గుడ్ జంటిల్‌మన్ పెద్దలిద్దరికీ నమస్కారం అనుపమకు నా ఆశీర్వచనాలు మీకు ఒక్కగానొక్క కొడుకు, ఒక్క కూతురు అంటే ఈ ఇద్దరూ మీ దంపతులకు రెండు కళ్ళు ఆస్తి, అంతస్థూ ఉన్నా కాస్త అల్పబుద్ధి ఆడపిల్లల్ని వేదించడం అనేది ఈ కాలపు యువకుల హాబీ పాలసీ, మానసిక జాఢ్యం మీ మాటలన్నీ నేనూ విన్నాను స్వదేశ వ్యవహారాల్లో విదేశీ జోక్యం పనికి రాదన్నట్టు, మీ కుటుంబ వ్యవహారాల్లో నేను జోక్యం చేసుకోవటం హర్షణీయం కాదు అయినా మాటలు విన్న తరవాత సలహా ఇవ్వాలనిపించింది చెప్పమంటారా?" నమ్రతగా చేతులు జోడించి ముకుళిత హస్తాలతో అన్నది

చెప్పమన్నట్టు చూసింది శాంతాదేవి

"సాంప్రదాయ కుటుంబంలోని పిల్లను అభిలాష్‌కు అసిస్టెంట్‌గా ఆర్నెల్లు వేసి ఆ తరువాత పెళ్ళి అన్నారు అసిస్టెంట్‌గా మీ దృష్టిలో ఎవరన్నా ఉన్నారా" ఆవిడ వైపు చూసింది సత్యభామ

"లేరు, నీ సజషన్‌కు మావాడు తప్పకుండా వప్పుకుంటాడు ఎవరు నువ్వా, సావిత్రా" అన్నాడు దశరథరామయ్య

ఆశ్చర్యపోయింది సత్యబామ

"మీ ఉద్దేశ్యం? ఆడపిల్లలతో ఎట్లా మాట్లాడాలో, ఎట్లా గౌరవించాలో, ఎట్లా ప్రేమించాలో, ఎట్లా తొందర పడకూడదో మీకు మానసికంగా, మర్యాదగా ఇచ్చే కోచింగ్ మీకు నచ్చితే పెళ్ళి, నచ్చక పోతే గుడ్‌బై" అన్నది సత్యభామ

చూస్తూ కూర్చున్నాడేగాని మాట్లాడలేక పోయాడు అభిలాష్

"నాదో చిన్న, పెద్ద సందేహం" అన్నది అనుపమ

"నీ సందేహం నాకూ తెలుసు, ఆర్నెల్ల తరువాత ఆ పిల్లను అభిలాష్ పెళ్లి చేసుకోకపోతే ఆ అమ్మాయిగతి ఏమౌతుంది" అనేగా నీ సందేహం" అన్నది సత్యబామ

"అవును" అనుపమ సమాధానం

"ఒక రేపిస్ట్ స్వబావం గల వ్యక్తిని, ఆడపిల్లయందు మర్యాద, గౌరవం చూపించలేని అర్భకుడిని, మానసిక వ్యబిచారిని సద్భావాలు గల మనిషిగా తీర్చిదిద్దాననే సంతృప్తి ఉంటుంది" అన్నది సత్యభామ

తలవంచుకున్నాడు అభిలాష్

"చెప్పండి, మా ఇద్దర్లో ఎవర్ని మీకు అసిస్టెంట్‌గా వేసుకుంటారు, నన్నా, సావిత్రినా"

"టూ - ఇన్- వన్"

"అట్లా కాదు, వన్ ఇన్ వన్, చెప్పండి"

"ఒక చిన్న పాయింట్, మీరునన్ను ఒక్కొక్కప్పుడు మిష్టర్ అబిలాష్ అంటారు, ఒక్కోసారి మీరు అని సంబోధిస్తారు నా మీద మీకు గౌరవం ఉన్నదనుకోవాలా, లేదనుకోవాలా" ఏం చెబుతుందోనని ఉత్కంఠతో చూసేడు

"గౌరవించ తగినంత సిద్ధాంతాలు మీలో లేవు

మిష్టర్ అబిలాష్ అన్నందువల్ల అగౌరవిస్తున్నట్టు భావించటం ఆడపిల్ల మీద మీకున్న అగౌరవానికి నిదర్శనం"

శాంతాదేవికి కోపం వచ్చింది దశరదరామయ్యకు ఏం మాట్లాట్టానికీ తోచలేదు

"కన్నతల్లి ముంధే మా వాడితో ఇంత దారుణంగా, తోటకూరలో పురుగుని విదిల్చినట్టుగా ట్రీట్ చేసి విదిల్చేస్తున్నావ్, ఒకవేళ పెళ్లి నీతో నే అయితే "

సరయిన జవాబు చెప్పి తీరాలి, సత్యాదేవీ జిందాబాద్, సత్యభామకూ జై" అని చప్పట్లు చరచింది అనుపమ

సత్యభా మ ముఖంలో గంభీరత చోటు చేసుకున్నది

రెస్పెక్టబుల్ పేరెంట్స్ ఆప్‌ది హాట్ బ్లడెడ్ సన్, నాలో అనేక బావాలున్నయ్యి, మీ అభిలాష్‌ని నేను ప్రేమిస్తున్నానని మీరు బావించటం, ఒక



# రచయిత జవాబులు

తోటపల్లి శ్రీహరినాయుడు, నెల్లూరు.

ప్ర: ఇప్పటి నవలలు, సీరియల్స్ మరుసటి వారానికి గుర్తుండవు. దీనికి కారణం రచయిత లోపమా? చదివే పాఠకుల లోపమా?

సి. సారధి, రాజమండ్రి

ప్ర: సెక్స్, క్రైం, వయలెన్స్ సాహిత్యంలో విపరీతంగా చోటుచేసుకుంటుంటే మంచి కథలు అరుదుగా కనబడుతున్నాయి. ఇది మారి మంచి కథలు రావాలంటే రచయిత బాధ్యత ఎంతవరకు వహించాలి?

కాజ హనిత, ఏలూరు.

ప్ర: నాటికీ, నేటికీ మన సాహిత్యంలో ఎవరూ వూహించలేనంత మార్పు వచ్చింది. సమాజానికి వుపయోగపడే రచనలు కరువుఅయిపోయి. యువతను రెచ్చగొట్టేవి వస్తున్నాయి. ఈ రాకూడని మార్పుకు కారణం ఏమిటి? ఏనాటికయినా మార్పువస్తుందా?

పై ముగ్గురి ప్రశ్నలకూ జవాబు: ఆ రోజుల్లోని సాహిత్యానికి కొన్ని మార్గదర్శక సూత్రాలు వుండి, పాఠకులకూ, సమాజానికీ ఒక సందేశాన్ని యివ్వాలనే తపనతో రచనలుచేసేవారు. ఈనాడు యిది రాకెట్ యుగం. స్పీడుతోనూ, పాఠకులలో కలిగిన అభిరుచులతోనూ పోటీపడి రచనలుచేసే పరిస్థితి ఏర్పడింది. వ్యాపారసరళి కూడా కొంత కారణం. యిందుకు బాధ్యత మూడొంతులు పాఠకులది, ఒక వంతు రచయితలది.

గెద్దం రమేష్, వత్తిపాడు.

ప్ర: (1) స్త్రీకి స్త్రీయే శత్రువు అంటారు. ఇది ఎంతవరకు నిజం?

(2) స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చేది ఎప్పుడు?

జ: (1) అది ఒక సామెత. ఆ శత్రుత్వం అనేది ఆ యిద్దరు స్త్రీల మనస్తత్వంమీదా, ఆయా పరిస్థితుల ప్రభావం మీదా ఆధారపడి వుంటుంది.

(2) సంపూర్ణ స్వాతంత్ర్యం అంటే విశృంఖలత్వమే అవుతుంది. సామాజిక, రాజకీయ, ఆర్థిక వాతావరణంలో అది సాధ్యంకాదు.

## ఉత్తమ ప్రశ్న

పి. విజయరాధ, ప్రొద్దుటూరు.

ప్ర: ఎంత తెలుసుకున్నా యింకా తెలుసుకోవాలి అనిపిస్తుంది. జ్ఞానానికి అంతులేదు. ఎంత తెలుసుకున్నా, ఎంత నేర్చుకున్నా నిండుకుండలా తొణకకుండా మామూలుగా వుండటం సాధ్యపడుతుందంటారా?

**జ: ఇంకా యింకా తెలుసుకోవాలనుకున్నదే జిజ్ఞాస. నిత్యం మారుతున్న ఈ సమాజంలో ప్రతి ఒక్కరూ ఒక్కొక్క అణువు. తొణకకుండా వుండటం అనేది సాధ్యపడదు. ఒకవేళ అట్లా వున్నా అమాయకుడనే ముద్రవేస్తారు.**

కుమారి కె. సింధూ, ఏలూరు.

ప్ర: "ఆడపిల్లలు – అనుభవాలు" అనే సబ్జెక్ట్‌మీద మీరు ఎందుకు రాస్తున్నారు? ఏదయినా ప్రత్యేకమైన ఇన్స్‌పిరేషన్ మిమ్మల్ని యిలాంటి మంచి థీమ్ తీసుకునేలా చేసిందా?

జ: ప్రేమ పేరుతో నేటి యువతీ యువకుల్లో చోటుచేసుకుని, వారి మానసిక ప్రవృత్తిలో సంచలనం కలిగించే తీరుతెన్నుల్ని అవగాహన చేసుకుని, వరకట్న రుగ్మతకు ఓ పద్ధతిలో పరిష్కారాన్ని సూచిస్తూ, పెళ్ళిళ్ళ ఆడంబరాల్ని విమర్శిస్తూ, ఆధ్యాత్మిక భావాల్ని మేళవింపజేసి, ఓ సామాజిక – ప్రయోగాత్మకపు నవలను పాఠకులకు అందజేయాలనేదే ఈ థీమ్‌కు ఇన్స్పిరేషన్!

చలపాక ప్రకాష్, విజయవాడ.

ప్ర: నేడు సమాజాన్ని మార్చేవిధమైన రచనలు చాలా వస్తున్నాయి కదా, ఆ రచనలు చదివిన వారిలో కొందరిలో అన్నా మార్పు వస్తుందంటారా?

జ: నవ్యమైన మార్పువస్తే సర్వత్రా హర్షణీయమేకదా. వెర్రితలలువేస్తే సాహిత్యం చెడగొట్టిందంటారు. అర్థంచేసుకుని చదివి ఆచరించవలసింది పాఠకులు.

ఎస్. మహమ్మద్ రఫీ, కాశిబుగ్గ.

ప్ర: స్త్రీ బిడియం వదిలి సొంపులు చూపిస్తూ సినిమాల్లో డాన్స్ చేస్తే, పురుషుడు తనివితీరా చూసి ఆనందిస్తాడు. ఆ స్త్రీయే అతని చెల్లెలు అనుకోండి, అప్పుడు అసహ్యించుకుంటాడు. కారణం?

జ: మొదటిది కమర్షియల్ ఔట్‌లుక్, రెండోది బ్లడ్ రిలేషన్‌షిప్.

బోలెం నాగేశ్వరమ్మ, చిన ఒగిరాల.

ప్ర: రచయితగా మీరు సాధించదలచిన ఆశయం ఏమిటి? ఆ ఆశయాన్ని "ఆడపిల్లలు – అనుభవాలు" ఎంతవరకు సఫలీకృతం చేయగిలిగింది?

జ: నవల పూర్తిగా చదివేక పాఠకులే చెప్పాలి.

---

**ఈ వారం ఉత్తమ ప్రశ్నని పంపిన పి. విజయరాధ (ప్రొద్దుటూరు) గారికి రచయిత 'హరికిషన్ వ్రాసిన 'దాంపత్య యుద్ధం' నవలని బహుమతిగా పంపటం జరిగింది.**

---

యాంగిల్‌లో పొరపాటు, మీకే తెలియని మరో విషయం. అతను అస్ఖలిత బ్రహ్మచారికాదు, మందూ అలవాటుంది. నాతో అతనిమీద ప్రేమ ఒక పరిధిలోనే ఉన్నది. అతన్ని బాగు చెయ్యాలనేదే నా కోరిక, అతనికి అసిస్టెంట్‌గా సావిత్రి ఉంటేనే నయం. సావిత్రిలో ఓర్పు ఉన్నది, నన్ను అర్థం చేసుకో గలిగితే ఆరు మాసాల తరువాత తీర్పు నాకు వదిలెయ్యండి. ఈ ఉద్యోగానికి సావిత్రిని నేను వప్పించాలి, మీరు ఇష్టపడక పోతే రేపు ఉదయం ఏడుగంటలకల్లా నాకు ఫోన్ చెయ్యండి శలవు" అందరికీ నమస్కరించి వెళ్ళింది సత్యభామ.

ఈ అసాధారణ పరిస్థితిని ఇట్లా ఎదుర్కోవలసి వస్తుందని ఎవ్వరూ అనుకోలేదు.

"అభిలాష్, సారీ అని చెప్పటంలో ఎస్కేపిజం వున్నది గాని, రిపెంటెన్స్ లేదురా, నువ్వు మగువ మందును అలవాటు చేసుకున్నావురా??" అన్నాడు తండ్రి దశరథరామయ్య. చేతులు నలుపుకుంటూ తల వంచుకున్నాడు.

"అలవాటు కాదు, ఏది లేదో అది కావాలనే కోరిక" అన్నాడు అభిలాష్.

కొడుకు దవడల్ని పేల్చేసింది తల్లి. రాత్రి పన్నెండయింది. అవమాన భారంతో అభిలాష్ మనస్సు సగమైంది. సత్యభామ ఇంటికి డయల్ చేశాడు.

"హల్లో, నేను అభిలాష్‌ని. నాకు అసిస్టెంట్‌గా మీరే వుంటే బాగుంటుంది. ప్లీజ్ కన్సిడర్ మై రిక్వెస్ట్" నమ్రతగా అన్నాడు.

"సారీ సర్, రాత్రి పన్నెండింటికి ఒక ఆడపిల్లకు ఫోన్ చేశారంటే, మీ బ్రూటల్ మెంటాలిటీకి చక్కని నిదర్శనం. ఫోన్ పెట్టేస్తున్నాను". ఫోన్ పెట్టేసింది.

అయిదు నిముషాలు గడిచాక మళ్ళీ డయల్ చేశాడు.

"క్షమించండి, చిన్న రిక్వెస్ట్, డబ్బు కలవాడిననే మనోగర్వంతో అసభ్యంగా ప్రవర్తిస్తున్న మాట వాస్తవం. నాకు సావిత్రి మీద ద్వేషంలేదు. రేపు ఉదయం సావిత్రిని కూడా మా ఇంటికి తీసుకురండి, ఇద్దరి పేర్లూ రాసి చీటీ తీస్తాను" ఖంగారుపడుతూ గద్గద స్వరంతో అన్నాడు.

# ఆడపిల్లలు - అనుభవాలు

"ఓ. కే. ఉదయం పది గంటలకు ఇద్దరం కనిపిస్తాం".

కాసేపు నిద్రపోయాడు. నాలున్నరకు అలారం కొట్టగానే నిద్ర లేచాడు. చేతులు జోడించి పంచముఖ ఆంజనేయస్వామిని ప్రార్థించాడు.

"స్వామీ, మా నాన్నకు డబ్బు సంపాదనే ధ్యేయం. మా అమ్మకు ఆ డబ్బులో నుంచీ సంప్రాప్తించిన అభిజాత్యం ఎక్కువ. ఆ రక్తాన్ని పంచుకొని పుట్టిన నాలో అభిజాత్యం అహంకారం, అహంభావం, దుడుకుతనం వెరసి నూటికి నూరుపాళ్ళు ఉన్నయ్యి. నేను వయసొచ్చిన వాడిని, ఈడొచ్చిన కోరికలు కలవాడిని, పదిహేను వెలుతురు తప్పులు, రెండు చీకటి తప్పులూ చేసేవాడిని. నేను నా జీవితపు ప్రొబేషనరీ పీరియడ్‌లో నాకు అసిస్టెంట్‌గా సత్యభామను కోరుకుంటున్నాను. చీటీలో సత్యభామ పేరు వచ్చేటట్టు అనుగ్రహించు తండ్రీ. నువ్వు కోరుకున్నన్ని కొబ్బరికాయలు నేను కొడతాను. ఆంజనేయస్వామీ! దయచేసి నన్ను కాపాడు. రక్షించు. కోరిక ఈడేర్చు" అని నమస్కరించి నూట ఎనిమిది గుంజెళ్ళు తీసాడు అభిలాష్. సత్యభామా అష్టోత్తరం కూడా చదివాడు. అతని మనస్సుకు అదొక తృప్తి, సంతోషం.

ఉదయం పది గంటలకల్లా కారులో వచ్చారు సావిత్రి, సత్యభామ, శ్రీవిద్య, శార్వాణీ, రుక్మిణి. ఈ ముగ్గుర్నీ కూడా చూసేసరికి అభిలాష్‌కు మతిపోయినంత పనయింది. పెద్దవారిద్దరి మనస్సుల్లో, ముఖాల్లో ఆశ్చర్యం, సంతోషం చోటు చేసుకున్నయ్యి. అందరికీ టిఫిన్, కూల్‌డ్రింక్స్ ఇచ్చింది శాంతాదేవి. ఆ నలుగుర్నీ పరిచయం చేసింది సత్యభామ.

"డియర్ పేరెంట్స్ ఆఫ్ ది బర్నింగ్ మైండెడ్ సన్!

అభిలాష్ స్వరూపం, స్టేటస్, అందం, ఆకర్షణ, మేనరిజమ్, బిహేవియర్, అందరికీ కొంతయినా తెలుసు. లంచగొండితనం, వ్యభిచారం, తాగుడూ వీటిని తొలగిస్తాం అని ప్రగల్భాలు పలికి ఎన్ని ఉపన్యాసాలిచ్చినా, ఆ రాక్షస త్రయానికి చావులేదు. ఆ రాక్షసుల్ని చంపగలిగిన రాముడు అవతరించే కాలమూ రాదు. వీటికి తీసిపోని మరో ముగ్గురు రాక్షసులూ ఉన్నారు. కులతత్వం, వరకట్నం, మానభంగం. ఆ ముగ్గురూ 'ఏ' క్లాసు రాక్షసులయితే, ఈ ముగ్గురూ 'బి' క్లాసు రాక్షసులు. వీళ్ళకూ చావులేదు. ఈ ఆరుగురినీ ఈ భూమ్మీదకు వదిలి పెట్టి ప్రతి మనిషినీ వంచిస్తున్నాడు ఆ లీలామానుష విగ్రహ స్వరూపుడయిన ఆ సృష్టికర్త ఆడదాని రొమ్ము నోట్లో పెట్టుకోని వ్యక్తిగాని, ఈ ఆరుగురు రాక్షసుల్లో ఏ ఒక్కడూ కూడా ఆవేశించని మనిషిగాని, ఈ ప్రపంచంలో ఎవరూ లేరు. సాంఘిక సంస్కరణలూ, సంఘసేవ, సాంఘిక దురన్యాయాలూ వీటన్నింటితో సంబంధం పెట్టుకుని కొంతవరకూ మనిషిని మరమ్మత్తు చేసిన మూర్తి త్రయం రాజారామ్ మోహనరాయ్, కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం. ఆ తరువాత వారంతా ఆ సంస్కరణల్ని తమ స్వార్థానికి చాలావరకు ఉపయోగించుకున్నారు. అవి ఆనాటి రోజులు.

ఈనాడు సంస్కరణలు పోయి సంఘసేవ అనే మరో మరమ్మతు, సహాయ కార్యక్రమం ఉద్భవించింది. ఈ సహాయ కార్యక్రమాలు సేవా కార్యక్రమాలు రూపొందించి అమలు చేస్తే అదే మానవసేవ అవుతుంది. అటువంటి వ్యక్తులూ, సంస్థలూ ఈనాడు కొన్నయినా ఉన్నాయంటే అది ఆ కార్య నిర్వాహకుల సద్భావానికీ, మనస్తత్వానికీ గీటురాయి. అటువంటి సంస్థ "కలిమి లేముల పార్టీ". ఆ సంస్థ మీద కూడా రాళ్ళు వేస్తున్నారు మిస్టర్ అభిలాష్. ఇదంతా ఈ సమయంలో ఎందుకు చెపుతున్నానంటే, డబ్బు ఈనాటి యువకుల్ని ఎంతవరకూ తీసుకువెడుతుందో తెలియ చెప్పటానికి. ఆడపిల్లల్ని టీజ్ చెయ్యటం కూడ ఈనాటి యువకులకు హాబీ. ఈ టీజింగ్ ముదిరితేనే సాడిస్ట్ మెంటాలిటీగా మారుతుంది. ఈ అంతటికీ మూల కారణం సెక్స్ భావాలు. ఈ భావాలు సున్నితంగా ఉంటేనే మాటల్లో చేతల్లో సున్నిత మనస్తత్వం, మనుగడ ఉండేది. విచ్చలవిడిగా తిరగడం, ఆలోచించటం, విశృంఖలత్వం, జీవితంలో ఏర్పడితే ఆడది వ్యభిచారి అవుతుంది. మగవాడు రౌడీ అవుతాడు. ఈ స్థితికి వచ్చిన ఏ వ్యక్తికీ గౌరవప్రతిష్టలు ఉండవు. అభిలాష్ కూడా ఈ దిశ వైపే ప్రయాణం చేస్తున్నారు. ఆయన మనస్తత్వానికి నేను జాలిపడుతున్నాను. ఈ వ్యక్తిని సద్భావ స్వరూపుడుగా తీర్చిదిద్దాలనేదే నా కోరిక. మరో ముఖ్య విషయం. మరో ఇద్దరితో కలసి సావిత్రిని మానభంగం చెయ్యటానికి ప్రయత్నించిన ఈ అభిలాష్‌కు ఒక అసిస్టెంట్‌గా సావిత్రినే పంపిస్తున్నానంటే నేను ఎంత రిస్క్ తీసుకుంటున్నానో మీరే ఆలోచించండి. నా సలహాను పాటించి సావిత్రి కూడా అభిలాష్ మనస్సు, జీవితం అనే పద్మవ్యూహంలోకి ప్రవేశించటానికి ఇష్టపడిందంటే ఈ సమస్యని మాటలతో పరిష్కరించటం ఎవరి వల్లా కాదు. ఇది నాకూ, సావిత్రికీ సంబంధించిన ప్రేమ విషయమూ, వ్యక్తిగత ఆకర్షణకు సంబంధించిన సమస్య కాదు. పెడమార్గాన పోతున్న అభిలాష్ జీవితాన్ని పూలబాట వైపు తిప్పటమే మా ధ్యేయం. పోలీస్ చర్య మాదిరి ఈ సావిత్రి చర్య ఎట్లా ఉంటుందో వేచి చూద్దాం. రుక్మిణి, శార్వాణీ, శ్రీవిద్య ఈ చిన్న కమిటీలో మెంబర్లు, ఛైర్మెన్ ఆఫ్‌ది కమిటీ ఆఫ్ మెంబర్స్ శ్రీమతి శాంతాదేవి. నేను సెక్రటరీని, దశరథరామయ్యగారు ఫైనాన్షియల్ ఎడ్వైజర్. ఇదంతా మీకు ఇష్టమేనా మిస్టర్ అభిలాష్" అన్నది సత్యభామ.

"నేను మనిషినా, ఏదయినా సంస్థనా, అన్నాడు అభిలాష్.

"నన్ను రేప్ చెయ్యబోయిన సంస్థ తాలూకు ముగ్గురు డైరెక్టర్స్‌లో మీరూ ఒకరు. ఇక మీరే ఆలోచించండి" అన్నది సావిత్రి. (ఇంకా ఉంది)

# దావణగెరె

## ఫ్యాషన్ ఫ్యాబ్రిక్స్

హుందాగా హాయిగా
ఉండే బట్టలు సోనీ
టెరీన్* ఫ్యాబ్రిక్స్.
పసందైన ఛాయలు
గల సొగసైన బట్టలు.
మీకు అందుబాటులో
గల ధరలు.

ఇంకా ఇవి కూడా లభిస్తాయి.

- సూటింగ్స్ • షర్టింగ్స్
- చీరలు
- కేంబ్రిక్స్
- టూ x టూ రుబియాలు
- టర్కిష్ టవళ్లు

T/8788/A/TEL

**ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్.**

హనుమంతప్ప బిల్డింగ్స్, చిత్రదుర్గ రోడ్, దావణగెరె 577 002.

**షో రూములు:** కావేరీ భవన్, బెంగుళూరు 560 009. దాజీబన్ పేట, హుబ్లి 580 020. చిత్ర దుర్గ రోడ్, దావణగెరె 57.

*టెరీన్ ... ట్రేడ్ మార్క్

# సుమలత సమాధానాలు

**ఇ. సీతారాణి, వనపర్తి**

ప్ర మీరొక చిత్రాన్ని నిర్మిస్తే, అందులో నన్ను హీరోయిన్‌గా తీసుకుంటారా, సుమలతగారూ?

జ : బావుంది.... తార అవడానికి ముందే కండిషన్లు పెట్టేస్తున్నారే!

**కె. ఎస్. రెడ్డి, పలాసా**

ప్ర పేదరికం కష్టమా? ఐశ్వర్యం కష్టమా?

జ : పేదరికాన్ని భరించడం కష్టం. ఐశ్వర్యాన్ని నిలుపుకోవడం కష్టం.

**వేదుల సాయికుమారి, గుంటూరు**

ప్ర నువ్వు క్షమించాలి మీరు ఎప్పుడైనా చిననాటి స్నేహితురాండ్ర నెవరినైనా గుర్తుకు తెచ్చుకుంటుంటారా?

జ : మరచిపోతే కదా గుర్తుకు తెచ్చుకోవడం, సాయికుమారి గారూ..... క్షమించాలి.... సాయికుమారీ!

**ఎల్. సత్యనారాయణమూర్తి, చెండపాడు**

ప్ర పురుషుడు స్త్రీని బలాత్కరించినట్లే స్త్రీ, పురుషుడ్ని బలాత్కరించగలదా?

జ . బంధించగలదు.

**కె. ప్రవీణ్, గుంతకల్లు**

ప్ర భోంచేయడం కూడా శ్రమ అంటాను మీరు ఏకీభవిస్తారా?

జ : ఆ లెక్కన మీరు చాలా శ్రమ పడుతూండాలి.

**పి. వీరకుమార్, అంగలూరు**

ప్ర ఎవరినైనా ఎప్పుడు పొగడడంలో తప్పులేదు?

జ . బుద్ధిమంతుని పరోక్షంలో, బుద్ధిమంతురాలిని సమక్షంలో పొగడడంలో తప్పేమీ ఉండదు.

**కొత్త సూర్యారావు, విరించిపేట**

ప్ర : ఆకాశానికి, ఆనందానికి అంతు లేదంటారు నిజమేనా?

జ : ఆకాశానికి అంతులేక పోవచ్చు. ఆనందానికి లేకేం? విషాదం ఉందిగా?

**పెద్ద నిరంజన్, కోళ్ళపర్రు**

ప్ర పురాణ కాలంలో లాగే ఇప్పుడు కూడా రాక్షసులు ఉంటే ?

జ : ఇప్పుడు లేరని ఎవరన్నారు? వాళ్ళెప్పుడూ ఉంటారు. ఎటొచ్చీ కాలానుగుణంగా వాళ్ళ వేషభాషలు మారుతుంటాయంతే.



**పదాల శాంతకుమారి, కొవ్వూరు**

ప్ర బంగారం లాంటి కల కంటూండగా అకస్మాత్తుగా మెలుకువ వచ్చేస్తుంది. కాని, అలాంటి కలే నిజమైన రోజున . ?

జ : గాఢ నిద్ర ముంచుకొచ్చేస్తుంది.

**షేక్ జలానీ, హొస్పేట**

ప్ర మన చిత్రాలు సాంకేతికపరంగా విదేశీ చిత్రాలతో పోటీ చేయగలవా?

జ : విదేశాలలో ఉన్న అత్యాధునిక పరికరాలూ, సౌకర్యాలూ, మన దేశంలో కంటే – మన సాంకేతిక నిపుణులు ఇతర దేశాలవారికి ఏమాత్రం తీసి పోరు. ఇప్పుడున్న మామూలు పరికరాలతో నే మనవాళ్ళు మెచ్చుకోదగ్గ ప్రమాణాలు సృష్టిస్తున్నారు. □

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న. .. .. . .......... .. . .. .. ... . .. .. . .... .. ...... . . . .

.. .. ... . . . . . .... . .... . . . ............. . ..

. ... . .... . .. .. ....... . . . ..... . .. ..

పంపినవారి పేరు . .. .. . . ....... . . .. ...... .. ..... .

పూర్తి చిరునామా .... ....... . ......... . .... .... .

"అశ్వద్ధామ"లో



విజయశాంతి

## సినిమా

### కౌసల్యా పిక్చర్స్
### "పెళ్ళి చేసి చూడు"

"ఎందరో అబలల నిండు జీవితాలను బలికొంటున్న వరకట్న సమస్యకు నవ్య పంథాలో పరిష్కారమార్గం చూపే 'అవళే నన్న హెండ్తి' (ఆమె నా భార్య) అనే కన్నడ చిత్రం కర్నాటకలో ఇప్పటికీ హౌస్‌ఫుల్ కలెక్షన్‌లతో ప్రదర్శింప బడుతోంది. దాని రూపాంతరమే మా చిత్రం. ఆ చిత్రంలో ప్రధాన పాత్రను అసమాన చాతుర్యంతో నిర్వహించిన తార అనే వర్ధమాన నటి మా చిత్రంలో ఆ పాత్రనే ధరిస్తోంది. అలాగే కన్నడ చిత్రానికి చక్కని బాణీలు కూర్చిన హంసలేఖ కూడా మా చిత్రానికి పని చేస్తున్నారు. ఏప్రిల్ 1 నుంచి 12 వరకు రాజమండ్రిలో మొదటి షెడ్యూల్ జరిగింది," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన సమర్పణలో బి. కౌసల్య నిర్మిస్తున్న కౌసల్యా పిక్చర్స్ వారి ఈ చిత్రంలో రాజేంద్రప్రసాద్, అశ్విని, రాజా, గొల్లపూడి మారుతీరావు, సాక్షి రంగారావు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, అన్నపూర్ణ, పి. ఆర్. వరలక్ష్మి నటిస్తున్నారు. ప్రభాకర్ కథకు దివాకర్‌బాబు సంభాషణలకర్త. సీతారామశాస్త్రి గీతాలు, హంసలేఖ సంగీతం, బి. కోటేశ్వరరావు ఛాయ, రంగారావు శిల్పం, పొన్నతోట రఘురామ్ నిర్మాణ సారథ్యంలో రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

### జె. జె. మూవీస్
### "నీకూ నాకూ పెళ్ళంట"

"21వ శతాబ్దపు ఓ బొమ్మ ఎలా ఉంటుంది? తన మనుమరాలు సుఖపడాలనే ఉద్దేశ్యంతో ఆమె వేసే పథకాల వల్ల ఎలాంటి కష్టసుఖాలు ఎదురౌతాయి? ఇదే పేరుగల మల్లాది నవల ఆధారం. హైదరాబాద్‌లో ఏప్రిల్ 14 నుంచి నెల రోజులపాటు ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జంధ్యాల. ఈయనా, జయకృష్ణా కలిపి "వివాహ భోజనంబు" అనంతరం నిర్మిస్తున్న ఈ జె. జె. మూవీస్ చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, చంద్రమోహన్, నూతన్ ప్రసాద్, వేలు, వీరభద్రరావు, కోట శ్రీనివాసరావు అరగుండు బ్రహ్మానందం, రత్నాసాగర్, రాజ్యలక్ష్మి, శ్రీలక్ష్మి మరి కొందరు రంగస్థల కళాకారులు పాల్గొంటున్నారు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, సి. విజయకుమార్ ఛాయ, ఇ. వి. వి. సత్యనారాయణ ప్రధాన సహకార దర్శకత్వం, బత్తుల రామకృష్ణ – జె. పుల్లారావు సహకార దర్శకత్వం, యోగానంద్ – రామ్మోహన్ ప్రొడక్షన్, గౌతమ్‌రాజు కూర్పుతో డి. సుబ్బిరెడ్డి సమర్పణ. □


"భార్యాభర్తలు"లో సుహాసిని

## రాజేంద్రప్రసాద్ కొత్త చిత్రాలు

కౌసల్యా పిక్చర్స్ పెళ్ళి చేసి చూడు, మహేశ్వరీ మూవీస్ చిక్కడు - దొరకడు, కళానికేతన్ ఇంటర్నేషనల్ జీవన గంగ, సేనా క్రియేషన్స్ మౌనరాగం, శరత్ దర్శకత్వంలో అడుసుమిల్లి గోపాల కృష్ణ నిర్మించే గోపీ మూవీస్ చిత్రం, శుభోదయా ఆర్ట్ ప్రొడక్షన్, కోడి రామకృష్ణ దర్శకత్వంలో డి వి ఎస్ ప్రొడక్షన్స్ రవికళామందిర్, కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎన్ రామలింగేశ్వరరావు నిర్మించే రాంప్రసాద్ మూవీస్ చిత్రం, కె ఎస్ రామారావు నిర్మించే క్రియేటివ్ మూవీస్ చిత్రాలతో రాజేంద్రప్రసాద్ మరింత బిజీ అవుతున్నారు

## ఛాయాగ్రహణ దర్శకుడు నవకాంత్ నిర్మించే "జీవనగంగ"

పూర్తిగా విశాఖపట్నంలో ఏప్రిల్ 26 నుంచి మే 5 వరకు తొలిషెడ్యూల్, మే 20 నుండి జూన్ 15 వరకు మలిషెడ్యూల్, అన్నారు ఎస్ నవకాంత్ ఈయన చాయాగ్రహణం నెఱపుతూ నిర్మిస్తున్న కళానికేతన్ ఇంటర్నేషనల్ వారి జీవన గంగ చిత్రంలో రాజేంద్రప్రసాద్, బానుచందర్, రజని, తులసి, చరణ్‌రాజ్, జగ్గయ్య, వేలు, రాళ్ళపల్లి ఆదిగా గల ... పాల్గొంటున్నారు పూసల సంబాషణలు, ...



ఒకే టిక్కెట్టుపై రెండు సినిమాలు చూపిస్తారంటే ఒక దాని తర్వాత ఒకటి చూపిస్తారనుకున్నా!

సురేఖ నృత్యాలు, రామచంద్రన్ - ఎల్ పి రామారావు సహకార దర్శకత్వం, కె గోపి - జి ...మురళి ప్రొడక్షన్ కణా... సహాయ దర్శకత్వం గౌతంరాజు కూర్పు, జె సీతామహాలక్ష్మి నిర్మాణతతో మౌళి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తున్నారు శివుడి శిరస్సున ఉద్భవించిన గంగానది అందర్నీ పునీతం చేస్తూ, చివరికి కడలిలో కలిసి పోతున్నట్లే ఈ చిత్ర నాయిక గంగ అనాద అయినా - సమాజం మీద కసి పెంచుకోక ఎందరో అనాదలకు సేవ చేస్తుంది ఇందుకు ఎన్నో ఇక్కట్లను, ఎదుర్కోవలసి వస్తుంది, అన్నారు మౌళి

## యువచిత్ర "జానకిరాముడు"

అత్యదిక ప్రజాదరణ పొందే చిత్రాలను అందించడంలో అనుభవజ్ఞుడు యువచిత్ర నిర్మాత మురారి ఈయన కె రాఘవేంద్రరావు, నాగార్జున కాంబినేషన్‌లో నిర్మిస్తున్న మరో జనరంజకమైన చిత్రానికి పై పేరు పెట్టినట్లు ఇతర నటవర్గం శివశక్తిదత్తా, విజయేంద్రప్రసాద్ కథకు సత్యానంద్ సంభాషణల కర్త కె వి మహదేవన్‌స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు కె ఎస్ ప్రకాష్ చాయ, రాజా శిల్పం, విజయన్ సాహసాలు, ఎన్ హరిబాబు సహకార దర్శకత్వం, జార్జి ప్రసాద్ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో ఈ చిత్రాన్ని సమర్పించే కె నరసింహంనాయుడు "ఆఖరి షెడ్యూల్ మే 18 నుండి జూన్ 5 వరకు రాజమండ్రి ప్రాంతాలలో జరుగుతుంది", అన్నారు



# సాఫల్యం

## జొన్నలగడ్డ సుబ్రహ్మణ్యం

'సోమయాజులు '

పర్జన్య గర్జనలా భీకరంగా విన వచ్చిన ఆ కేకకి- కళ్ళు మూసుకుని జపం చేసుకుంటున్న సోమయాజులుగారు వులిక్కిపడి- చేతిలోని జపమాలని వదలివేసి- విన వచ్చిన దిక్కుకి తల యెత్తి తీక్షణంగా చూశాడు

తులసి కోట చుట్టూతా ప్రదక్షిణ చేస్తున్న భ్రమరాంబగారు అదిరిపడి- ప్రదక్షిణ ఆపి- వీధి వాకిలికేసి కంగారుగా చూసింది

జాకెట్టు హుక్స్ కుట్టుకుంటున్న శ్యామ అదిరిపడి- గదిలోంచి గబ గబ ఇవతలకి వచ్చి- గుమ్మంలో నిలబడ్డ శాస్త్రిని చూసి, మళ్ళీ బయంగా అంతే వేగంతో లోపలికి తప్పుకుంది

వీధి గుమ్మానికి అటూ- ఇటూ- రెండు చేతులు జాపి కుడి కాలుని మండిగం మీద వుంచి- విస్ఫులింగాలు కురిపిస్తూ నిలబడ్డాడు అవదాని

అవధానికేసి కొన్ని క్షణాలు తీక్షణంగా చూసి, అంతలోనే తమాయించుకుని- వివేకం తెచ్చుకుని- 'రండి రండి బావగారు' అంటూ ఆహ్వానించేడు సోమయాజులుగారు

ఆయనకి తెల్సు- నేడో రేపో- ఇలాంటి పరిస్థితి వస్తుందని

"హా !" వెటకారంగా తల తిప్పి- "నీచేత మర్యాదలు అందుకోవటానికి రాలేదు" అంటూ మండి పడ్డాడు అవధానిగారు ఆయన ముఖం ఆ క్షణంలో మద్యందిన మార్తాండునిలా వుంది

"ముందు లోపలికి రండి వీధి గుమ్మంలో ఎందుకు అన్నయ్యగారు అంది భ్రమరాంబగారు అప్పుడే అక్కడికి వచ్చి చీరె చెంగుని మరింత భజం చుట్టూ లాక్కుంటూ

'అమ్మా శ్యామా! మీ నాన్నకి కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు తీసుకురా" లోపలికి కేక వేసి చెప్పాడు సోమయాజులుగారు

అవదానిగారు అసహనంగా నిలబడ్డాడు అక్కడే! నిప్పులో పడ్డ ఉప్పులా చిటపటలాడుతున్నాడు

శ్యామ నీళ్ళ చెంబు తెచ్చి అందించింది తండ్రికి తల వంచుకుని

కూతురికేసి చీత్కారంగా చూశాడు అవధానిగారు

చెంబుడు నీళ్ళు- మెట్ల మీద నిలబడి- కాళ్ళు మీద ధభీలుమని గుమ్మరించుకుని- చెంబుని అక్కడే విసిరి పడేసి ఆవేశంగా లోపలికి వచ్చి- విసురుగా కుర్చీలో కూలబడ్డాడు ఆయన

ఈలోపు భ్రమరాంబగారు కాఫీ కలిపి తెచ్చింది అవధానిగారికి అందించబోయింది "తీసుకోండి అన్నయ్యగారు" అంటూ

కాఫీ గ్లాసు వంక- భ్రమరాంబగారి వంక- మార్చి- మార్చి చూస్తూ- "ఈ కాఫీలు గట్రా నాకవసరం లేదు ముందు నేను విన్నది నిజమేనా చెప్పండి? అసలు ఏమిటి నీ ఉద్దేశం" అంటూ సోమయాజులుగారిని నిలదీశాడు

సోమయాజులుగారు చిన్నగా మందహాసం చేసి- "మంచి పనే సదుద్దేశంతోనే చేస్తున్నాను అంతా విని, వివరంగా తెల్సుకునే వచ్చేరుగా మళ్ళీ నేను చెప్పినా అదే" అన్నాడాయన శాంత స్వరాన

"అదే అడుగుతుంటా! మీరెవరూ మీ ఇష్టం వచ్చినట్లు చేయటానికి నేను చచ్చిపోయాను అనుకున్నారా? అసలు మా వంశం ఏవిటి? మేము ఇంత కాలం ఎలా గౌరవంగా బ్రతికేమొ తెలియదా? మా పరువు- ప్రతిష్ట- మంట గలిపే ఈ పనిని ఎందుకు చేస్తున్నావు మేము ఏదన్నా మునగాకు బాపతు అనుకున్నారా?" హూంకరించేడు ఆయన చిటికెడు నశ్యం ముక్కులోనికి జొనిపి

వియ్యంకుడికేసి చూస్తూ- మెల్లగా- "పరువు- మర్యాదల కన్నా- నూరేళ్ళ పచ్చని జీవితం ముఖ్యమనిపించింది నాకు అందుకే నేను ఈ నిర్ణయానికి వచ్చాను ఈవేళ మీకు కబురు పంపిద్దామనుకున్నాను ఈలోపు మీరే స్వయంగా వచ్చేరు" అన్నాడు సోమయాజులుగారు

"అహా అలాగా నీ కూతురి విషయంలో ఏమైంది ఈ నిర్ణయం ఆమె పట్ల ఎందుకు చేయలేదు? పరువు పోతుందనిపించింది అంతేనా? ఇప్పుడు నా కూతురి విషయంలో ఇంత చేస్తున్నావంటే- ఈచొరవ- ఈ తెగింపు- నీకు కల్గటానికి కారణం నాకు బోధ పడలేదనుకోకు పోయేది మా పరువు- మర్యాద నిప్పులాంటి మా వంశానికేగా పట్టేది తుప్పు నీకేం నువ్వొక ఆదర్శవాదివి అనుకుంటారు లోకులు కీర్తి దక్కుతుంది నీకు అంతేనా " సోమయాజులుగారి మీద చూపు నిల్పి- కసిగా అన్నాడు అవధానిగారు

అవదాని చేస్తున్న ఆరోపణకి క్షణ కాలం సేపు స్తబ్దుడైనాడు సోమయాజులుగారు

"ఏం? మాట్లాడవేం? గొంతులో ముసాంబరం పలుకు అడ్డం పడ్డట్టు వుందా? నీ గుట్టు బయట పడిందని భయపడుతున్నావా?" రెట్టించేడు అవధానిగారు

"మీరు ఏమైనా అనుకోండి! ఇటు మా రగంలోను- అటు మీ రంగంలోను ఇలాంటి బావాలు ఇంత వరకూ కల్గని మాట నిజమే కానీ ఎందుకో నాకు కల్గింది ఇది బగవత్ప్రేరణేనని నా నమ్మకం దాని నూరేళ్ళ జీవితం వసివాడి పోగూడదనిపించింది తప్పు కాదనిపించింది అంతే '

ఆయన కంఠం జీరబోయింది ఏదో విషాద దృశ్యం తలుపుకొచ్చిందిలా వుంది ముఖం కళా విహీనమైంది గోడ మీద ఫొటో కేసి చూపు నిల్పి వుండిపోయాడు

"అహో హో ఏం ఆదర్శనం ఏం కబుర్లు వ్యంగ్యంగా ఎత్తి పొడిచేడు అవదానిగారు

"అన్నయ్యగారు సంతోషించాల్సింది పోయి, మా మీద విరచుకు పడటం బావ్యం కాదు "

అంత వరకు ప్రేక్షకురాలిలా నిలబడి వున్న భ్రమరాంబగారు అంది

"ఏమని సంతోషించాలి? ఇదేమన్నా పునకార్యమా? మాకేదో తవ్వి తలకెత్తుతున్నారని ఆనంద పడిపోవటానికి ఓ ప్రక్క వూరు వూరంతా చెవులు కొరుక్కుంటుంటే- తల యెత్తుకుని తిరగలేక చస్తున్నాం మీకు సిగ్గు లేకపోవచ్చు. మేము నల్గురిలోను బ్రతకవలసిన వాళ్ళం వీల్లేదు దాన్ని నేను తీసుకు వెళతాను "

కుర్చీలోంచి లేచాడు అవదానిగారు

"ఆగండి బావగారు! నిదానించి ఆలోచించండి దానికెంత వయస్సు కేవలం ఇరవై సంవత్సరాలు అసలు జీవితం ఏవిటో తెలియదు కనీసం కొద్ది మాసాలైనా బర్తతో కల్సి జీవితం అనుబవించలేదు దానికి ఎంత బవిష్యత్తు వున్నది ముందున్న జీవితమంతా వంటరిగా- తెల్ల గుడ్డలకి కట్టబడి- ఏ ఆశలు తీరక కోర్కెలు చంపుకుని జీవచ్ఛవంలా బ్రతకాలి మన కళ్ళ ముందు అది అలా తిరుగుతుంటే బరించగలమా? చెప్పండి?? ఆలోచించండి! అవధానిగారికి నచ్చ చెప్పబోయారు

సోమయాజులుగారు.

"దాని ఖర్మకి మనం ఏం చేస్తాం!" చేసుకున్నమ్మకి చేసుకున్నంత మహా దేవ" అని, హైమ కేసి తిరిగి "బయలుదేరు" అంటూ గర్జించేడు అవధానిగారు.

హైమ కళ్ళల్లో బెదురుతో పాటు లీలలా తడి మెరిసింది.

సోమయాజులుగారి మనస్సు కలచి వేసినట్లయింది.

అవధాని పట్టుదల ఆయనకి తెలియంది కాదు. తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళు అనే రకం. మొండి మనిషి ఒకరి నోట మాట వినటం అసలు లేదు.

అందుకు ఉదాహరణగా చెప్పాలంటే- మనవరాలి వయసున్న పిల్లని పెళ్ళి చేసుకోవటమే. అదీ సంవత్సరం క్రితం.

కొడుకు ఇష్ట పడలేదు. బంధువులు గడ్డి పెట్టేరు. ఐనా ససేమిరా వినలేదు. చేసుకున్నాడు. హైమని కన్యాదానం చేశాడు.

ఆలోచనలలోంచి తేరుకుని- దయ వుంచి మరోసారి ఆలోచించండి బావగారు. హైమ ముందు నిరాకరించింది. మేము ఉభయులము పట్టుబట్టి ఒప్పించేము. పైగా అతగాడు నా శిష్యుడు. మంచివాడు. మా కోర్కెని మన్నించి ముందుకి వచ్చాడు చేసుకోవటానికి. ఈ అవకాశాన్ని పాడు చేయకండి. విధి ఒకసారి ద్రోహం చేసింది ఆమెని. మరోసారి మీరు ద్రోహం చేసి ఆమె బ్రతుకు బండలు చేయకండి." అవధానిగారి చేతులు పట్టుకుని బ్రతిమాలేడు సోమయాజులుగారు.

"వీల్లేదు... నాకు పరువు చాలా ముఖ్యం. మీదేదో సాంప్రదాయ సిద్ధమైన కుటుంబం అని తలచి పిల్లనిచ్చేను. అదీ పొరపాటైంది. మీకు నైతిక విలువలు లేవు అని ఇప్పుడర్థమైంది. నా పిల్లని నేను అప్పుడే తీసుకు వెళ్ళి వుంటే చాలా బాగుండేది. ఇప్పటికే చాలా అల్లరి పడ్డాను. ముందు నా పిల్లని పంపండి."

అవధానిగారి మాటలకి భ్రమరాంబగార్కి మండిపోయింది. "ఏ అత్తా- కోడలు మళ్ళీ పెళ్ళి చేసుకుంటే సహించదు. బాధపడతారు. అడ్డు పుల్లలు వేయటానికి ప్రయత్నిస్తారు. అలాంటిది



## ఏమి ఆలోచించాలి?

డబ్బు సంపాయించడం ఎలా? అని వారం రోజుల్నుంచి తిండి తిప్పలు మాని ఆలోచించాను! వారం రోజుల బియ్యం డబ్బులు ఆదా అయినై...



## ధర్మపథం

ప్రతి ప్రాణికీ ఆహారం సంపాదించడంలోనూ, ఆత్మరక్షణలోనూ ఆలోచన ఉంటుంది. పశు, పక్ష్యాదులకు ఉండే ఈ ఆలోచనలకంటె మానవాళికి మరి ఎన్నో ఆలోచనలు ఉంటాయి. దానికి మానవునికి గల జ్ఞానమే కారణం. ఆహారం, ఆత్మరక్షణలతో మనిషికి తృప్తి లేదు. ఎన్ని విధాలుగానో సుఖంగా జీవించడానికి ఆలోచనలు చేస్తూ ఉండడం వల్ల దానికి ధనసంపాదన అవసరమై ఉంటుందిగదా! దానిని సంపాదించడానికి వివిధ మార్గాలు ఆలోచించడం మానవుని స్వభావం. అట్టి ఆలోచన వల్ల – అనుకొన్న ధనం మొదలైనవి దొరికే వరకూ మనస్సు కలత పడుతూ ఉంటుంది. నిద్రపట్టదు. ఆహారం రుచించదు. ఆ ఆలోచన లేనప్పుడే నిర్విచారంగా ఉండవచ్చును.

ఇతర ప్రాణులకంటె మనిషికి జ్ఞానం ఎక్కువ. అందువల్ల అతడు తన సుఖజీవనానికి అనేక సౌకర్యాలను కల్గించుకోగలడు. ఇతర ప్రాణులను స్వాధీనం చేసుకుని వివిధాలైన పనులకు వానిని ఉపయోగించు కొంటాడు. అంతేకాక – పుట్టినవాడు ఎప్పుడో ఒకప్పుడు గిట్టక తప్పదనే సంగతీ అతనికి తెలుసును. అయినా– దానిని విస్మరించి, తాను శాశ్వతంగా ఉంటాననే భ్రాంతితో ఇతరాలోచనలు లేక స్వార్థం కోసమే యోచిస్తాడు. జీవిత పరమార్థం స్వార్థంకాదు. ఇతరులకు తనకు సాధ్యమైనంత వరకు ఉపకారం చెయ్యడానికే ఆలోచించాలి. ఇతరులు తనకు సహాయ పడకపోవచ్చు. కాని, దానిని బట్టి ఇతరులను ఉపేక్షించుట సరియైన పద్ధతికాదు. ఇతరులు మనకు ఏమి చేశారు?" అనే ఆలోచనకు బదులు "మనం ఇతరులకు ఏమి చేశాము?" అనే ఆలోచన ఉండాలి.

యావత్ ప్రపంచమూ ఒకే కుటుంబ మని భావించి సర్వమానవ శ్రేయస్సును కోరే ఉదార హృదయులు "మనం లోకానికి ఏమి చేశాము?" అని ఆలోచిస్తారు. స్వార్థ పరాయణులైన సంకుచిత హృదయులు మాత్రం "మనకు లోకం ఏమిచేసింది?" అని ఆలోచిస్తారు. మనకు భగవంతుడు ప్రసాదించిన బుద్ధిని సరియైన మార్గంలో ప్రవేశపెట్టి, మంచి పేరు తెచ్చుకోడానికి ప్రయత్నించడం సరియైన పద్ధతి అని గ్రహించాలి.

–బులుసు వేంకటరమణయ్య

## సాఫల్యం

కన్న తండ్రియై వుండి మీరు మీరు అడ్డు పుల్లలు వేస్తున్నారు. మా మంచితనం మీకు అసమర్థతలా వుంది. మా పిల్ల మా పిల్ల అని గుంజు కుంటున్నారు. పెళ్ళి కాక ముందే మీ పిల్ల. పెళ్ళయినాక మా పిల్ల. మా పిల్ల మా ఇష్టం. మేము కన్యాదానం చేస్తాం. కన్న తండ్రివి, పెద్దవాడివని ఇంత సేపు గౌరవంగా చెప్పాం. మీ గౌరవాన్ని మీ దక్కించుకునేలా లేరు. మీ ఖర్మ. మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోండి. పిల్లని మేము పంపము. దానికి పెళ్ళి చేసి తీరతాం." తెగేసి చెప్పేసిందామె.

"అలాగా.. నేనేం చేతకాని వాడిని అనుకున్నారా! చూపిస్తా నా తడాఖా! ఇప్పుడే నా పిల్లని జుట్టు పట్టి లాక్కెడతా! ఎవరు అడ్డం వస్తారో చూస్తా."

ఆవేశంగా హైమ దగ్గరగా వచ్చి- జబ్బ పట్టుకుని ఈడ్వబోయాడు అవధాని.

"ఆగు." అపర కాళిలా గర్జించింది భ్రమరాంబ గారు.

బిత్తరపోయాడు అవధాని ఆ గర్జనకి.

"రేపో మాపో కాటికి చేరే నీకు పడుచు పెళ్లాం కావల్సి వచ్చింది. పాతిక సంవత్సరాలు కల్సి కాపురం చేసిన ఇల్లాలు చితిమంట ఆరక ముందే మళ్ళీ పెళ్ళి కొడుకువైనావు. భర్తతో కల్సి పట్టుమని వారం రోజులైనా కాపురం చేయని- ఆ పిల్ల పరిస్థితికి జాలి పడి- నువ్వు చేయవలసిన కార్యం మేము నిర్వహిస్తుంటే- బాధ్యత మరిచి- పరువు- మర్యాద అంటూ గుంజాకుంటున్నావు. నువ్వసలు మనిషివేనా? ముందు మా గుమ్మం దిగి వెళ్ళు మరోసారి ఎక్కే అర్హత కోల్పోయావు. వెళ్ళు ముందు."

కళ్ళల్లో నిప్పులు రాలుస్తూ- ఆవేశంతో వూగిపోతున్న భ్రమరాంబని చూడలేక- చిన్నబోయిన వదనంతో తల వంచుకుని బైటకి నడిచేడు అవధాని.

భార్య వంక ఆప్యాయంగా చూశాడు సోమయాజులు గారు.

"భ్రమరాంబా క్షణకాలం సేపు మహిషాసుర మర్దినిలా గోచరించేవు నాకు. ఆ పిల్ల జీవితం కాపాడేవు" అంటూ భార్యని మెచ్చుకున్నాడు. కళ్ళతోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

మోకాళ్ళ మీద చేతులు వుంచుకుని- చేతుల మధ్యగా తల దించుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న హైమని- ఆప్యాయంగా లేవనెత్తింది భ్రమరాంబ గారు. "పిచ్చి పిల్లా ఎందుకేడుస్తావు. ఇది నీభర్త నిర్ణయం." అంది ఆమె తల నిమురుతూ.

తల అడ్డంగా వూపింది హైమ. "నాకు వద్దు ఈ పెళ్ళి అన్నట్టు".

"వయో వృద్ధులం మేమే చెట్టంత కొడుకుని పోగొట్టుకుని విలవిలలాడుతున్నాం. వాడి నిర్ణయానికి- ఆదర్శానికి మేము తల ఒగ్గేము. వాడి కోసం, నువ్వు కూడా మాతో ఏకీభవించక తప్పదమ్మా.

రామశాస్త్రి మంచివాడే. నిన్ను పువ్వుల్లో పెట్టుకుని చూచుకుంటాడు. నా పుత్ర సమానుడే. రామశాస్త్రిని, నీ భర్తని ఈ చేతులతోనే పెంచేము. వాళ్ళిద్దరి అభిరుచులు ఒక్కటే. ఆదర్శాలు ఒక్కటే. అంతే కాదు. ఈ సాంప్రదాయానికి తెర పడాలి? అదే నా కోర్కె కూడా.

ఆ మాటలు అంటున్నప్పుడు సోమయాజులుగారి కళ్ళ నుంచి రెండు అశ్రు భిందువులు చెంపల మీదుగా జారి నేల మీద పడ్డాయి.

భ్రమరాంబగారి గుండె బరువైంది.

హైమ వెక్కుతూ వుండిపోయింది.

ఇంతకీ హైమ గురించి చెప్పలేదు గదూ! హైమ మూగ జీవి. □

# వారఫలం

## 20-5-88 శుక్రవారం నుండి 26-5-88 గురువారం వరకు

★ **మేషం :** ఆకాశమార్గా, గ్రహరాశియందు, మీకు అనుకూలమైన 'వారఫలం' లభ్యమయ్యేలాగు మార్పు జరిగింది 24 తా నుండి, వారమంతా శుభదాయకమే వృత్తియందు మీకు ఎదురులేదు తెల్లని వస్తువిక్రేతలకు అదిక లాభదాయకం స్త్రీలకు ధనలబ్ధి, వృత్తియందు పెంపు, ఆనందం

★ **వృషభం :** దూరబారాల నుండి బందుమిత్రులు రానున్నారు మాటకు విలువ పెరుగుతుంధి అప్రయత్న లాభమున్నది వ్యాపార రీత్యా సర్వానుకూలం శుభదాయక దినంగా, చివరకు ఈ వారమంతా శుభదాయకమని గ్రహించాలి స్త్రీలకు నూతనోద్యోగ యత్నం శుభం యత్న కార్య సిద్ధి ద్రవ్యలబ్ధి

★ **మిధునం .** సర్వ విదాలా అనుకూల వారం అయితేనేం? ఆదాయాన్ని మించిన వ్యయం అదయినా శుభ కార్యం నిమిత్తమని గ్రహించాలి సర్వకార్యాలందునూ యిది శుభదాయకవారమే అనుకూల మిత్రసమాగమం స్త్రీలకు రాజకీయ వ్యవహారాలందు సర్వానుకూలం దనలబ్ధి వృత్తి వికాసం

★ **కర్కాటకం :** శుబదాయకవారం ఎందుకా? 'శని' అనుకూలుడైనందుకు 'త్రిషట్ ఆయః' అనునట్లు రాశికి ముందున, ఆరవ రాశిన, పదునొకండవ రాశిన శనిబగవానుడున్న అధికలాబ దాయకం ఇదిగోచార వ్యవహారం స్త్రీలకు అనేక రీతుల శుబమార్పులు రానున్నవి వృత్తి వికసింప నున్నది ఆదాయం వృద్ధి చెందనున్నది, గ్రహించండి

★ **సింహం .** వ్యయప్రయాసలతో సతమతమవుతారు అయితేనేం, సర్వవిధాలా మీ పనులు సానుకూలమవుతాయి రాజకీయ రంగానమాత్రం మీకు ఏవిధంగా మేలుగాదు అనుకూల వార్తాశ్రవణం, గమనించండి స్త్రీలకు వృత్తియందు అనుకూలం, రాజకీయంగా మేలు వస్తు వాహన సేకరణకు నిశ్చయంగా అనుకూలం

★ **కన్య :** ఇదొక విచిత్రమైనవారం అనుకొన్నదానికన్న మిన్నగా ఎన్నిక సేయదగిన ఆదాయమున్నది అయినవారి సంబందం కొరకు తాపత్రయ పడుతారు ఎలాగయినా నిశ్చయం కాక తప్పదు రాజకీయాలందు అనుకూలమున్నది స్త్రీలకు విచిత్ర వస్తుసేకరణకు అనుకూలవారం

★ **తుల ·** ఆదాయమున్నది కళారంగావ కాశాలుంటాయి పదిమందిలో పేరు ప్రతిష్ఠ లుంటాయి ఉత్సాహజనకమైన సమయం ప్రజా రంగాన ప్రతిబ రాణిస్తుంది పత్రికారంగాన ప్రసిద్ధి స్త్రీలకు వస్తు వాహన సేకరణకు ఆస్కారం, గమనించాలి

★ **వృశ్చికం :** విధీ విరామం ఎరుగక తిరుగు తారు అదిక తిరుగుడు వలన లాబంలేదు సబా మర్యాదకు ఆస్కారం వృత్తి రీత్యా ఎలాంటి లోపం జరుగదని బావించండి మీ మనోధైర్యమే మీకు శ్రీరామరాక్ష స్త్రీలకు కళారంగాన ప్రసిద్ధి, వృత్తియందు అనుకూలత చేకూరనున్నది

★ **ధనుస్సు :** శుబదాయకం దినమంతా ఏవిదంగా లోపం లేకుండా జరుగుతుంది అయితే, ఒకానొక విషయం సులబ సుందరంగా జరుగు తుంది అయితేనేం, అధికవ్యయం మాత్రం జరుగక తప్పదు అందు అనవసర వ్యయం కూడా లేకపోలేదు స్త్రీలకు విద్యా విషయంగా మేలు, వృత్తియందు అనుకూలత

★ **మకరం .** సరిఅయిన సమయంలో బంధుమిత్రులు యింటికిరాగలరు 'శని' వ్యయకార కుడు, 'వ్యయరాశి' యందున్నాడు, అని బయపడ నక్కరలేదు సుఖ శాంతులకు లోపం లేదు ఆదాయం ఉండనే ఉన్నది, ఆరోగ్యం మాత్రం జాగ్రత్తగా చూచుకోండి స్త్రీలకు అన్ని విదాలా అనుకూలమే కళారంగావకాశాలుంటాయి

★ **కుంభం .** అనుకూల వార్తాశ్రవణం సుఖ శాంతులకు అనుకూలం రాబడి ఎంత ఉన్నా ఏదో విదంగా యిబ్బంది రానేవస్తుంది కళాసాహితీ అనుబవం గడించిన వారికి అనుకూల మున్నది శుబకార్యాచరణమునకు అవకాశమున్నది గ్రహించండి స్త్రీలకు వస్తువాహన సేకరణకు అనుకూలం వృత్తియందు వికాసం

★ **మీనం :** అన్నిరంగాల వారికి అను కూలమే రాజకీయాలందు శ్రమించే వారికి మేలే ఉత్తరాల వలన అనేక వివరాలు గ్రహిస్తారు బంధువులకో యితరులకో సహాయం చేయ వలసి రావచ్చు, గ్రహించండి స్త్రీలకు గురుగ్రహాను కూల్యతగలవారం రావలసిన డబ్బుకు ఎలాంటి విఘాతం జరుగదు ప్రయాణం వలన మేలున్నది, గ్రహించండి

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి




## పిల్లలతో చెలగాటం పెద్దలకే ఇరకాటం

రచన ఆత్రేయ రచనా సహకారం మానాపురం రాజేంద్రప్రసాద్ ట

ఇందులో ఒక తండ్రి కూతుర్ని చచ్చే ముసలాడికి ఆస్తి కోసం ఇవ్వటానికి ప్రయత్నిస్తాడు ఆ పిల్ల అర్ధరాత్రి బావిలో పడుతుంది ఈ సోమవారం ఎందుకో కరెంటు పోలేదు అందుకని శ్రార్ధయోగ్యంగా ఉన్న ఈ నాటిక చూడటం పడింది పాత సినిమాల టిక్కిక్కు కూడా కాదు చెత్త సినిమా టిక్కిక్కుతో వ్రాసిన ఈ నాటిక చూస్తుంటే చాలా విచారంగా ఉంది. గతంలో ఆత్రేయ మంచి నాటకాలు వ్రాశారట ఈ నాటకం చూస్తుంటే నమ్మ బుద్ధి కావటం లేదు

## లవ్ ఎట్ ఫస్ట్ సైట్

రచన దర్శకత్వం స్క్రీన్‌ప్లే లాటివన్నీ కాదంబరి, కిరణ్‌కుమార్– ఎ క్లాస్ చెత్త నాటకం ఒకడికి జాతక ప్రకారం ధనప్రాప్తి, ప్రేమ వివాహం ఉన్నయ్యట అందుకని ఆడపిల్లల వెంటబడుతూ ఉంటాడు. ఆ హీరో వెకిలిగా ఉన్నాడు ఇక హీరోయిన్ ఎవరో తెలియదు టెలిఫోను చేసిన పిల్ల మాత్రం అప్పుడప్పుడు నాటకాల్లో కనిపిస్తుంది అందం లేకపోయినా సెక్సీగా ఉంది డైలాగు ఒక మాదిరి కథ సెలెక్షన్, పాత్రధారుల ఎంపిక చాలా తెలివి తక్కువగా ఉంది

## సినిమా తీసి చూడు

కమ్యూనిమ్మల పుణ్యమా అని బుధవారం కరెంటు ఉంచారు అందుకని ఈ సినిమా నాటకం చూడటానికి వీలయింది– రచన యర్రంనేని ఎవరు? దర్శకత్వం రామినేని? ఎవరు? పేర్లు వినలేదు–' ఈ ఒక భాగంలోనే మూడు విధాల ఆత్మహత్యలు చూపించి, కల అని తేల్చి – ఒక నిజం చావు చూపించారు అక్కడతో వచ్చిన విసుగు చాలదని కాబోలు కూతురుని గారాబంగా– కోడల్ని ఘోరంగా చూసే పాత అత్త పాత్ర ఒకటి చూపించారు ఇందులో కూతురు వేసినమ్మాయి తరుచు టి వి లో కనిపించే సెక్సగరల్ లాగానే ఉంది పమిట వేస్తే సరిగ్గా గుర్తు రావటం లేదు ఇంకో అమ్మాయి నల్లగా లావుగా భయంకరంగా ఉంది ఇందులో సినిమా తీసి చూసిందేమీ లేదు మరి

## హానీ – అన్‌హానీ

నాటిక – ఆఖరి భాగం – రవీంద్ర పీపట్ ఇచ్చిన చందమామ కథల్లో ఇది చివరిది – దీపాలు కదలటం చూసి దేముడు ప్రత్యక్షమయ్యాడని అంధ విశ్వాసం గల మూర్ఖులకు శంఖ ధ్వనికీ సముద్రపు గాలికీ, దీపాలకీ ఉండే సంబంధాన్ని సైంటిఫిక్ రీజన్ అని అందరి కళ్ళూ తెరుస్తాడు ఒక ప్రొఫెసరు ఇంతటితో ఈ గొడవ వదిలింది – చివరికి దెయ్యాలు ఆత్మలు అన్నీ సైన్సుకి అందుతాయని సందేశం కాబోలు – టైటిల్‌గా ఇవి హానీ – అన్‌హానీ – అంతే కాలక్షేపం కథలు

## ఇంతెజార్

శుక్రవారం నాడు పర్వత ప్రాంతపు పుష్పకుటుంబాలను బోటనీ పేర్లతో చెపుతూ చక్కని డాక్యుమెంటరీ వేశారు నిజం చెప్పాలంటే, పూలూ – సెలయేళ్ళూ – అడవులూ – జంతువులూ చాలా బాగున్నాయి పనికి మాలిన ప్రసంగాలూ – అర్థంలేని నాటకాలూ వేసే మానవుల కన్న వారి మేనరిజం కన్నా 'ఇంతెజార్" రైల్వే వారు సమర్పిస్తున్న ఈ నాటిక గొప్పగా ఉంది అమాయకుడైన జటా శంకర్‌కి పెళ్ళి చేస్తామని జోక్ చేస్తారు ఇద్దరు కాని జటా శంకర్ మొదట నమ్మినా చివరకి వాళ్ళ మోసం తెలుసుకొని – వాళ్ళని క్షమిస్తాడు జటాశంకర్ వస్తున్న నాటకాల్లో ఇది బాగుంది

## షణ్ముఖ శ్రీనివాస్ శ్రుతిలయలు

మంగళ వారం నాడు షణ్ముఖ శ్రీనివాస్ శ్రుతి లయలు చక్కగా చూపించారు ఈ చిరంజీవికి భగవంతుడు బంగారు భవిష్యత్తుతో పాటు దీర్ఘాయుర్దాయం ఇవ్వాలి ఇలాటి రత్నాల్ని చూసినప్పుడు పూర్వజన్మనీ దాని సుకృతాన్నీ నమ్మి తీరాలి

## రామాయణ్

ఆదివారం కోసం రామాయణం కోసం చాలా మంది ఎదురు చూస్తారు– ఈ వారం యుద్ధం ఇంద్రజిత్తుది ట్రాజెడీ ఏమిటంటే అతని నాగ పాశాలకి శ్రీరాముడు కూడా మూర్ఛ పోతాడు ఇది వాల్మీకం కాదు మరి అహిరావణుడి ప్రవేశానికి అనుకూలంగా ఈ సంఘటన పెట్టాడులాగుంది రామానందసాగర్ కాని ఇది వాల్మీకంలో లేదు గాని కొన్ని తదనంతర రామాయణాలు ఇతర మతాల ఇన్‌ఫ్లుయన్స్‌కి లోనై రాముడు కూడా పెద్ద గొప్ప వాడేం కాదు అనటానికి వ్రాశారు అలాగే సులోచన కథ కూడా ఆమె శేషనాగుడి కూతురు గొప్ప పతివ్రత, సీత లాగే ఆమె భర్తని చంపి అన్యాయం చేశారు అని భావం నాగాస్త్రానికి రాముడు పడిపోడు – గరుడాస్త్రం వేసి దాన్ని తప్పించుకున్నాడని వాల్మీకం □



# నిత్య నూతన సీరియల్




## పందొమ్మిదవ అధ్యాయము

(గత సంచిక తరువాయి)

ధర్మారావు తెలుగు వైద్యు నొకనిని పిలిపించి అరుంధతికి మందిప్పించుట ప్రారంభించెను పదిరోజులైన తరువాత ఆమెకు కొంచెము నెమ్మదిగా ఉన్నట్లు తోచెను ధర్మారావు మందు పని చేయుచున్నదని సంతోషించెను ఉంది నుండి వచ్చిన తరువాత అరుందతి మనిషి దిగాలపడి పోయెను ఎందు కట్లుంటి వనగా చిన్న అరుంధతిని వదలిపెట్టి నే నుండలేను మన మచ్చుటనున్న వారము దినములును పిల్ల నన్ను వదలిపెట్టియే ఉండలేదు అనెను ఈ సంగతి దర్మారావు పశుపతికి లేఖ వ్రాసెను పశుపతి మఱల జవాబు వ్రాసెను మీరు వచ్చిన తరువాత చిన్న అరుంధతి వారమురోజా లన్నమే తినలేదట అనసూయ వారివెంట పిల్లను పంపించనైన పంపించితిమిగా దనుకొన్నది పదినాళ్ళయిన తరువాత అరుంధతి కొంచెమ్ము కలక దేరినది మఱల కొడుకు, భర్త, అత్తగారు నన్న ప్రపంచములో పడినది ధర్మార్థావునకు మునుపటికన్న కొంచెము చేతులు కాళ్ళాడు చుండెను నలుబది రూపాయిలు చేతిలో ఉన్నవి కదా? అవి ఖైపోవు వఱకును పరవాలేదు కోటలోనుండి మోమీను వచ్చుచుండెను కుమారస్వామి వచ్చుచు పోవుచుండెను రమ్మనును దర్మారావు మన్నుతిన్న పాముపలె ఇంటినుండి కదలడు రెండు వారములైన తరువాత ఒకనాడు కుమారస్వామి మీరీనాడు వచ్చి తీరవలయు నని పట్టుపట్టెను దర్మారావు వెళ్ళెను రాధాపతి, మంగమ్మలు కూడ అచ్చటనే ఉండిరి

రాదా మీరు వచ్చిన తరువాత చక్రవర్తిగారు లేకుండుటలో సొగసులేదు మంగమ్మ నవ్వెను పంకజమ్మ చిన్నబుచ్చుకొనెను

శ్యామల ఆయనకు నొప్పు గొట్టవలెనంత కోపము వచ్చినదట, ఏమిటిది? తనకన్న గొప్పవాడు లేడన్నట్లు మాటాడును? ఆయన అంతసేపు వాగి వెళ్ళిపోయినంతనే తనవాదమే నిజమైనట్లా? ఆయన చెప్పిన వాని కన్నింటిని ప్రతి సమాదానములు చెప్పవచ్చును అని చక్రవర్తి

అని శ్యామల ఆగెను కుమారస్వామి గింజు కొన్నాడని పూర్తి చేసెను

పంక అయినను మఱల రమ్మని వ్రాసితిని! రెండు మూన్నాళ్ళలో మఱల వచ్చును

కుమార ఇంక దర్మారావుగా రీ ఊరినుండి లేచిపోవలసినదే

రాదా మీ రానాడు చెప్పిన విషయములు చాల బాగున్నవండి అయినను మీరు చెప్పినవాని కన్నిటికి ప్రతి సమాదానములు చెప్పవచ్చును

కుమా మీరు చెప్పిన ప్రతి సమాదానములకు మఱల ప్రతి సమాదానములు చెప్పవచ్చునుగదా? ఇట్లి అనవదిగా పోవును దీనికి సిద్ధాంత మెచ్చట?

రాదా దానిని సహృదయులు నిర్ణయించ వలయును

దర్మా ఇతడు సహృదయుడని నిర్ణయ మెట్లు? ప్రతివాడును తనకు తానే సహృదయుడు, తా నెఱిగియున్నదియే సర్వోత్కృష్టమైనది

రాదా అట్లు కాదులెండి ఇప్పుడింగ్లీషులో పెద్ద పెద్ద గ్రంథకర్తలున్నారు వారు ఒప్పుకొన వలయునుగదా

కుమా : మన భాషలో ఉన్న గొప్ప గ్రంథకర్తలును ఒప్పుకొనవలయును.

రాధా : మఱి వారివలె గొప్పవారు మనలో ఉన్నారా?

ధర్మా : రహస్యమంతయు అచ్చటనే ఉన్నది. మీ యభిప్రాయమది. నేనింక ఎంత వాదించిన నేమిలాభము? అందుకనియే యిది ప్రమాణమని నిర్ణయించుకొనకుండ వాదనలోనికే దిగరాదు. నీకు ప్రమాణమైనది వేఱు, నాకు ప్రమాణమైనది వేఱైనచో ఇద్దరిమధ్య సామాన్యమైన భావమే లేదు. అప్పుడు వాదమే లేదు. తల్లియు, సహోదరియు పురుషునకు పవిత్రమూర్తులన్న సిద్ధాంత మంగీకరించని వానితో స్త్రీ పురుష కామేచ్ఛను గురించి వాదించుట యెట్లు? అతని కందఱు ఒక్కటియే. అతనికి తల్లిలో గూడ స్త్రీత్వమే గోచరించును, మాతృత్వము గోచరించదు.

కుమా : రాధాపతిగారు కొంతవఱ కంతేనండి.

రాధా అవును నేనే కాదు, పాశ్చాత్యులైన కొందఱు మహా పురుషు లీ సిద్ధాంతమును నిర్ణయించిరి నాకు వారి తర్కము నచ్చినది

ధర్మా ఎవరి సంస్కారమును బట్టి వానికి కొన్ని మనస్కరించును జనులు బిన్న మతములయందు పుట్టుట వారి వారి సంస్కారమును బట్టియే అది యాదృచ్ఛికమైనచో మతములందు దురభిమానములు ప్రబలవు క్రైస్తవునకు, మహమ్మదీయునకు విగ్రహారాధన పనికిరాదు హిందువునకు పనికివచ్చును వాడది అచ్చట బుట్టెను గనుక వీడది యిచ్చట పుట్టెను గనుక ఇద్దరును మహాతత్వవేత్తలైన ద్రష్టలు కారు తాను పుట్టిన మతము భావములు తనకు రుచించు చున్నవి దానినే సంస్కార మందురు

రాదా మీరు ప్రతి వాదనయు కొన్ని హిందూ మతములోని శబ్దములతో వాదింతురు ఆ సంస్కారమన్న శబ్దము తీసివైచి మాట్లాడుడు ఆ మాటలకు కొంత అర్థము నిర్ణీతమైయున్నది ఆ శబ్దము మామీద ప్రయోగించెదరు

దర్మా నేనిదే చెప్పినది భిన్న భాషలట్లే ఉండును మీ యింగ్లీషులో మాత్రము కొన్ని శబ్దములు నిర్ణీతార్థములు గలవి యితర మతముల వారి యెడల ప్రయోగించినచో వారిని

**జరిగిన కథ – 49 :–** రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు దేవదాసి ప్రతిరోజా దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది రామేశ్వరము జైలుకి పోయిన తరువాత మంగమ్మకు అతని ఆస్తి దక్కుతుంది దర్మారావుకు కొడుకు పుడతాడు గణాచారి ఎప్పటిలాగానే తిరుగుతూ ఉంటుంది పంకజమ్మగారి ఇంటిలో అప్పుడప్పుడూ జరిగే చర్చలలో ధర్మారావు పాల్గొంటూ ఉంటాడు ఆ చర్చలలో భారతీయ సంప్రదాయం గురించి ధర్మారావు ఆవేశంగా ఉపన్యసిస్తారు ధర్మారావు అరుంధతి పశుపతి ఇంటికి వెడతారు ధర్మారావు విద్యనుగురించి వివరిస్తాడు చిన్న అరుంధతి ధర్మారావు భార్యకు చాలా చేరిక అవుతుంది ధర్మారావు బెజవాడలో దుర్గను సకుటుంబంగా దర్శిస్తాడు



తెలివి తక్కువ వారిగా కనిపింప చేయునవి లేవా! అర్థడాక్సు పెసిమిస్టు సూపర్ స్టిషన్ ఈ శబ్దము లేమిటి? నీకు వ్యతిరేకముగా వాదించు వానిని నీ వీ శబ్దములు పెట్టి పిలిచి, వాడు మూర్ఖుడన్నట్లు తేల్చెదవా, లేదా? అందుకనియే యే బాష కా బాప, యే సంస్కారమున కా సంస్కారము

శ్యామల ఎప్పుడు నీ వాదములతోనే గడచిపోవుచున్నది మీ రెప్పుడు పద్యములు చదువుమన్నను నిట్లే యేదియో మాటాడి పోదురు ఈ వాదనవలన పలిత మేమున్నది? రాదాపతివంటి వారు నేటితో తమ యభిప్రాయములు మార్చుకొనరు మీరు వారితో కలియరు

దర్మా పద్యములు నేను చదువకపోయినచో రాదాపతిగారినే చదువమనరాదా? ఆయనయు కవియే కదా!

కుమార మనమందఱము బయటికి పోదము రాధాపతిగారు పద్యములు చదువును

అందరును నవ్విరి

రాధాపతి నా గొంతు బాగుండదు మీరు శ్రావ్యముగా చదువుదురు

శ్యామల మీరు రేపు వేషము వేయుదురు కాబోలునే దానికి సంగీతము లేదా?

రాదా ఏమున్నది బంట్రౌతు వేషములు సుబుద్ధి నన్ను వేయమన్నారు. దానికి పద్యము లున్నవి నాకు వలదంటిని

దర్మా సారంగధర నాటకమా?

కుమార అవునండీ! మంగమ్మగారు చిత్రాంగి, రంగావదానిగారు సారంగధరుడు ఎవరో పెద్ద నటకుడు, తెలుగు దేశమంతయు పేరు మ్రోగినాడట ఆయన పేరెరుగనిది నేనొక్కడనే

## యూరో జూడో

మొట్టమొదటి యూరోపియన్ జూడో క్లబ్‌ను లండన్‌లోని వెస్ట్‌మినిస్టర్‌లో ఏర్పాటు చేశారు.



## అనేక పతకాల విజేత



19 సంవత్సరాల కాలంలో ఫుట్‌బాల్ క్రీడాకారుడు జిమ్మీడెలానే స్కాటిష్, ఇంగ్లీష్, ఉత్తర ఐర్లండ్, రిపబ్లిక్ ఆఫ్ ఐర్లండ్ పతకాలను గెలుచుకున్నారు. వాటిలో 1937లో సెల్టిక్ పతకాన్ని, 1984లో మాంచెస్టర్ యునైటెడ్ పతకాన్ని, 1954లో డెర్రీ సిటీ పతకాన్ని, 1956లో కార్క్ అథ్లెటిక్ పతకాన్ని గెల్చుకున్నారు.

ఆయన, వచ్చి - రాజరాజనరేంద్రుడు వేయును. వారి పేరేమిటండీ!

రాధా : కుమారప్ప.

ధర్మా : కుమారప్పగారని యెచ్చటనో విన్నానే!

కుమార : ఆయన వేరు, ఈయన వేరు. ఈయన నటకుడండీ!

ధర్మా : నాటక మెప్పుడు?

కుమా : ఇంక నాల్గు రోజులున్నది.

పంక : మంగమ్మగారికి సంగీతము కూడ వచ్చునా?

కుమా : ఒక్క సంగీత మేమిటి? ఒక్క సంవత్సరములో అగస్త్యుడు సముద్రమును వలె విద్యలన్నిటి నీమె పుక్కిలించినది. "ఏక చుళుకాహంకార నిశ్శేష శోషిత పాథోధి వయస్కుడైన" మునివలె.

రాధా : కుమారస్వామి నీవు కుఱ్ఱవాడవు, తెలుగు చక్కగా చదువుకొన్నావు. సరేకాని, ఎప్పుడెట్లు మాట్లాడవలయునో నీకు తెలియదు.

కుమార : మీకు కోపమెందుకండీ! మంగమ్మగారు బాగుగానే ఉన్నది. ఆమె కేమియు కోపము రాలేదే.

మంగమ్మ : కుమారస్వామి యేమన్నను నాకు కోపమురాదు. లేకపోయినచో ఊవు నేను చిత్రాంగి యేమిటి? అందులో నీ ఊరిలో ననా!

ధర్మారావు: భ్రూయుగము ముడివడెను. అతనికి ముండ్లమీద కూర్చున్నట్లుండెను.

శ్యామల : రంగావధానిగారు మంచి నటకులా?

రాధా : చాల గొప్పవాడు, అతనికి పేరు రాలేదు. కాని, నటకుడన్నచో అతడే నటకుడు.

కుమార : నిజముగా నటకుడే యైనచో పేరెందుకు రాదు? ఏదో గుణము లేనిచో ఎంత మూఢ లోకమైనను మెచ్చుకొనదు. లోక మొక్కొక్కప్పుడు

### వేయి పడగలు

దుర్గుణములు సుగుణములను కొనును. కాని లోకము మెచ్చుకొనిన యెడల ఏదో ఒక విశేష ముండవలయును.

రాధా : అతడు గొప్ప నటకుడే! లోకమునకు తెలియలేదు.

ధర్మా : ఇప్పుడు స్త్రీలే స్త్రీ పాత్రలు ధరించవలయును కాబోలు.

కుమా : భరతాచార్యు లింద్రుని సభలో నచ్చరలచేత నాటక మాడించగా అచ్చరలే పురుష వేషము వేయుచుండిరట. అప్పుడు మేనక పెద్ద యుద్యమము లేవదీసెను. తన పక్క ఊర్వశిగాని, రంభగాని పురుష వేషము వేసినచో తాను స్త్రీ వేషము వేయనన్నదట.

ధర్మా : రావణాసురుని లంకకేమైన వెళ్ళివచ్చెనా యేమి?

శ్యామల : లంకలో స్త్రీలు స్త్రీ వేషములు, పురుషులు పురుష వేషములు ధరింతురా?

ధర్మా : అక్కడ అంతియేనట.

కుమా : అవునండీ! అది వాల్మీకీ రామాయణములో నున్నది.

రాధా : నీవు చదివితివా?

కుమార : నేను చదువలేదు. మంగమ్మగారు చదివితినన్నది.

శ్యామల : ఏమండీ, చదివినారా?

మంగ : "కుమారస్వామి యబద్ధమాడునా?" కుమారస్వామి కుఱ్ఱవానివలె ఎగిరి చప్పట్లు చఱచెను.

రాధా: కుఱ్ఱవానివలె నా అల్లరి యేమిటి?

కుమార : నేను కుఱ్ఱవాడను కానా? నా కిన్నేండ్లనుకొన్నారు.

ధర్మా : ఒకనలుబదేండ్లుండునా?

కుమార : రాధాపతిగారికా?

శ్యామల : వారికి పదునెన్మిదేడులండీ! నాకు పదునాల్గు.

ధర్మా : మా యిద్దరి నడుమ నంతియే వారు

కుమార : వెనుకనొకసారి యేడెనిమిదేండ్ల వార యుంటిరే!

ధర్మా : మాది పూర్వకాలపు పెండ్లి గనుక వయస్సులో తారతమ్య మున్నది. మీది మాకన్న కొంచెముపై మెట్టు కాదూ! వారడి తగ్గినది.

కుమా : ఈ లెక్క ప్రకారము మరి పదేండ్లు పోవునప్పటికి మగడు చిన్నవాడు, భార్య పెద్దదియు నగును.

ధర్మా : అప్పుడు మన దేశ మమెరికావలె ఉండును?

రాధా : ఆ దేశమున మనవలె నిట్టి పెండ్లిండ్లు చేసికొనరు. ప్రేమయున్ననే చేసికొందురు

ధర్మా : ప్రేమ యనగా నేమిటి?

రాధా : ప్రేమ దివ్యమైనది. అదియే భగవంతుడు.

ధర్మా : సామాన్య సూత్రము లెప్పుడును బాగుగానే ఉండును. ప్రత్యేక విషయముల వద్దనే తగాదా! మనుజులందరు దైవభక్తి కలిగి యుండవలయు నన్న మాటలో అందఱ కభిమతమే ఉన్నది. దైవమనగా ఎవరు, భక్తి యనగా నేమి అన్నచో భేదము వచ్చును. ప్రేమ భగవంతుడే! ప్రేమ యనగా మీ అర్థమేమి? స్త్రీ పురుషుల మధ్య నున్న ప్రేమయా. ఇద్దరు పురుషుల మధ్య నున్న ప్రేమయా? ఈ "ప్రేమ" అను మాటలో "నాత్మవ త్సర్వభూతాని" అన్నంత అర్థమున్నది, అడ్డ దిడ్డముగా పెండ్లాడి, ఇది ప్రేమ, అది దివ్యము - ఈ




మాటల కర్మము లేదు

రాదా స్త్రీ పురషుల మద్య నున్న ప్రేమ కూడ దివ్యమే

కుమార అయినచో మనమందరమును దేవతలమే

రాదా కుఱ్ఱవాడవు, నీకు తెలియ దూరకుండుమనలేదా!

కుమా నేను కుఱ్ఱవాడనేమిటి? వయస్సులో కుఱ్ఱవాడనైన ఇంక కుఱ్ఱవాడేనా?

ఉత్తమ జ్ఞాన వృద్ధుగా నుండెనేని బాలుడయ్యును పూజ్యుండు బ్రాహ్మణుండు

శ్యామల మన మిప్పు డదికాదుకదా!

కుమా పెండ్లియైనదాక చెడిపోనట్లే

పంక పెండ్లి పెండ్లి, పెండ్లి! యీయన నన్ను నిదురపోనిచ్చుట లేదండి?

శ్యామల చక్రవర్తిగారు వెళ్ళి పోయిన తరువాత అసలు నిద్దుర లేదు

తల్లి కూతురు వంక చుఱచుఱ చూచెను

కుమార ప్రొద్దు పోయినది ఇక సభ చాలింతమా?

రాధా ఇచ్చట సభ ఎవరు చేసిరి?

కుమార మంగమ్మగారు

తరువాత ఎవరిదారిని వారు పోయిరి వెన్నెలలు వచ్చెను పంకజమ్మ రాదాపతి, మంగమ్మలును, శ్యామలా కుమారస్వాములును దర్మారావును సాగనంపిరి.

అది పూర్వము కోటలో నగారాలు మ్రోయువేళ నౌబత్తుఖానాలు మ్రోయుచుండెను ధర్మారావు ధ్వని ఎచ్చటి దనెను

కుమా మంగమ్మగారు మఱల సినిమాలు మొదలు పెట్టించెనుగదా?

శ్యామల మీరా ధ్వని యేమనుకొన్నారు?

దర్మా అదే యనుకొన్నాను

నాటి రాత్రి రామేశ్వరశాస్త్రి పోరుపెట్టి ఏడ్చెను దర్మారావు "పిల్ల వానికి దృష్టి తగిలినదేమో" అనెను సావిత్రమ్మగారు కచ్చిక యాముదములో ముంచి వెలిగించి దృష్టి తీసి ద్వారబంధము వద్ద రెండు వైపుల ఉంచెను అరుందతి పసి పిల్లలకు గాని రెండేండ్ల పిల్లవానికి కచ్చికలు దృష్టి తీయుట యేమి టన్నది

సావిత్రమ్మ పిల్లవానికి రెండేండ్లా? చోద్యము పోయెదవు! ఏడాది వెళ్ళలేదు

దర్మా అమ్మా ఏడాది వెళ్ళకపోయినచో పుట్టిన రోజు పండుగ ఎందుకు చేసినాము?

సావి ఆ రీతిగా పిల్లవాని కేండ్లెక్కు వున్నవని చెప్పుకోరాదు

అరుంధతి ఉప్పుదీసి నూతిలో వేసి వచ్చెను. పిల్లవాడు పోరు మానలేదు ఎవ్వరికి ఏమియు తోచినదికాదు సావిత్రమ్మగారా దేవునకు మ్రొక్కుకొనుమీ దేవునకు మ్రొక్కుకొమ్మనెను అరుంధతి "పోరాని కొంపలకు పోయి వత్తురు పిల్లవాడు పోరు పెట్టినా" దనెను ధర్మారావు బయలుదేరి సుబ్రహ్మణేశ్వరస్వామి ఆలయమునకు పోయెను ఆలయము తలుపు లప్పటికి వేయలేదు దర్మారావు ధ్యానించెను స్వామీ నా హృదయము నీ యెడల వినతమైనది 'వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం' అన్న వాక్యములో నున్న సహస్ర శిరస్సులతోడి శౌరివి నీవని యెఱుంగుదును నాయందు నీకంత దయయే కాని, నేను తిన తిండి కట్టగుడ్డ లేనివాడను నావలన నీకేమి ఉపకారము జరుగును? నేనొక మహా సంస్థ కద్యక్షుడనైనగాను, కొంతవఱకైన నీ యాజ్ఞ నిర్వర్తించుటకు కలి ప్రబలిన కొలది జగత్తునుండి నీవే నిన్నుపసంహరించుకొనుచున్నావు వేయి పడగల స్వామివి రెండు పడగల వాడవైనావు నేనును ప్రవాహగామినే కాని యెదురీదెడి వాడనుకాను ఎదురీదియు ప్రవాహ వేగముచే ప్రవాహము వెంటనే పోవుచుంటిని ప్రవాహమున సముద్రాభిముఖముగా ఈదువాడు ఎదురీదువాడు నిద్దరును సముద్రమునకే పోవుచున్నారు కాని వీ డెదురు తిరిగి ఉండుట లోకమునకు విపరీతముగా ఉండును నేను వేళానుగుణముగా కొంత అనిష్టమైనది చేసినను అది నేను బుద్ధిపూర్వకముగా చేయుటలేదు ఒఱదలో కుమ్మరి పుర్వువలెనే ఉండుటకు ప్రయత్నించుచున్నాను నీవు కోపగించితివా, మానివేయుదును నీ రెండు తలలు పూర్వమున్నట్లే ఉండునని ఏమి నమ్మకము? కొంత మాఱవచ్చును మారుచునే ఉన్నవి కార్యమును శంకించి కారణము నిర్మూలనము చేయుచున్నారు ప్రమాణములలో అదమాదమ, ముత్త మోత్తమమైనది నన్ను



మన్నించుము. నేను రామేశ్వరశాస్త్రి పుత్రుడను మాత్రమే! మరి యింకొక భావము నా యందుంచకుము

ధర్మారావు తిరిగి యింటికి వచ్చెను పిల్లవాడు పోరుమాని తల్లి భుజముమీద నిద్దుర పోయెను మరునాడు కుమారస్వామి వచ్చెను ధర్మారావు విశేషము లేమి? అనెను

కుమా నే నీనాడు ప్రొద్దున మంగమ్మగారి యింటికి పోయితిని నేను వాకిట నిలుచుంటిని లోపల మంగమ్మ రాధాపతు లిద్దరును వాదించుకొనుచుండిరి వారి సంభాషణ యిది -

రాదా . నీవు చెడిపోవుచున్నావు, కుమారస్వామితో కలిసి నామీదకి దండు వచ్చుచున్నావు ధర్మారావు చెప్పినది ప్రతిదియు నీకు వేద వాక్యముగా ఉన్నది వాడొక చాదస్తుడు వీంద్రు బి సి నాడు పుట్టవలసినవాడు నేడు పుట్టినందుకు సంతోషించవలయును

మంగ · అంతసేపాయన వద్ద నోరుమూసికొని యుండి నా మీద చలాయించెదరేమి!

రాధా ఆయన పెద్ద మహామేధావి! ఆయన ముందు నేను మాటాడలేను అందుచేత భయపడితిని

మంగ మీ నోటివెంట నిజముచూడుడెట్లు వచ్చుచున్నదో!

రాధా నీవు వట్టి యజ్ఞానురాలవు నిన్ను నేను తెచ్చి సంవత్సరము నానా విషయములు బోధించి బాగుచేసినందులకు నాకు మంచి గురుదక్షిణ యిచ్చుచున్నావు!

మంగ మీరు కాక మరొకరైనచో నింతకన్న బాగుండెడిదేమో! అది యట్లుంచి, మిమ్మిప్పు డేమంటిని? కుమారస్వామి కుఱ్ఱవాడు, అతడేదో నవ్వుచు అనిన మీ కంత కోపమెందులకు?

రాధా నీకు కుమారస్వామి మీద ప్రేమ పుట్టినది

మంగ అవును పుట్టినది నేను రామేశ్వరమును వదలిపెట్టిన తరువాత నాకు ప్రేమ పుట్టని దెవనిమీద? నే నెందుకే పుట్టినది

రాధా నేను నవ్వుచునన్నానులే, కోపపడకు

మంగ ఇప్పుడు బాగుగానున్నది! హెచ్చిన తగ్గుమన్నారు, తగ్గిన హెచ్చుమన్నారు

వీరిట్లు మాట్లాడుకొనుచుండగా నేనంతయు విని లోనికి పోయితిని రాధాపతి మొగము వెలతెల వేసినాడు నేనెరుగనట్లు కొంచెము సేపు కూర్చుండి, మంగమ్మగారితో 'సెలవండి అని చెప్పి లేచివచ్చితిని వచ్చుచు రాధాపతి వంక ఓరగా చూచితిని ఆయన నా వంకనే చూచుచున్నాడు .

దర్మా చక్రవర్తి వెళ్ళిపోవుట వలన పంకజమ్మ గారి కసలు నిద్ర పట్టలేదన్నదే శ్యామల! అది యేమిటి?

కుమార అదా? అది ఒక కథ మాకు మొన్న తెలిసినది చక్రవర్తి పంకజమ్మగారికి కొన్ని ఉత్తరములు వ్రాసెను అవి ఆమె పెట్టెలోనున్నవి తాళపుచెవు లెప్పుడు ఆమె కొంగుననే ఉండును మొన్న పొలమునకు పోవుచు అవి మఱచి పోయి పోయినది నేను పెట్టె తెఱచి చదివితిని అవి తప్పేననుకొందు ఇంగ్లీషులో అందురే -ఫలితమ వలన చేసిన కార్యమును సమర్థించుట అని అలాగు ఆయుత్తరములలో చక్రవర్తి రకరకములుగా వ్రాసినాడు కొన్ని చోట్ల శ్యామలను పొగడెను నా ఉనికిని గురించి పంకజమ్మగారిని నిందించెను ఈమె నీవువచ్చి శ్యామల హృదయము నాహరించుమని వ్రాసినదట ఆయన అట్లే వత్తును! మీరు కూడ సహాయపడినగాని అట్లు చేయుటకు వీలుండదని వ్రాసెను ఆ యుత్తరములతో ఇద్దరు దొంగలును పట్టు పడినారు నే నవియన్నియును శ్యామలకు చూపించితిని శ్యామల 'నాకేసంగతియు తెలియదు ఏదో పెద్ద మనిషి వచ్చినాడని సాయంకాలములయం దతనితో షికారు పోయితిని గాని మరియొకటి గాదు అత డనిన కొన్ని మాటలు నా కిప్పుడర్థమగుచున్నవి. ఇదియా దీని వెనుకనున్న రహస్య మని అన్నది ఆ రాత్రి తల్లి కూతుంద్రిద్దరును పోట్లాడుకొనిరి చివరికామె

కొంతసేపేడ్చునది. ఈమెకొంతసే పేడ్చునది కావలసిన వారిలో పోట్లాటలకు చివరియంకమదియే గదా! ప్రొద్దుననే మఖల మాటాడుకొనిరి.

ధర్మా : మఖల చక్రవర్తిని రమ్మని వ్రాసితి నన్నదే.

కుమా : అది అతని కన్నీళ్ళు తుడుచుటకు. అతనికి రెండు విధముల ఇచట పరాభవమైనది. ఒకటి యిది, రెండవది మీరు చేసినది.

ధర్మా : నేనేమి చేసితిని?

కుమార : అది కాదండీ! అతడదివరకు వారందరిముందు సర్వజ్ఞునివలె మాట్లాడెడివాడు. ఆనాడు మీరు మాట్లాడుచున్నప్పుడు నోరు మెదల్పలేక పోయెను గదా! అది ఒక దతనికి పరాభవ మనిపించింది. ఈ సారి వచ్చినచో మిమ్ము గెల్చుటకే గాని మమ్ము గెల్చుటకు గాదు.

ధర్మా : గెలువనిమ్ము. ఇందులో ఏమున్నది? ఈపతడు వచ్చినచో నేనే తగ్గి మాట్లాడెదను. నీకతని బాధ వదలిన తరువాత నన్నతడేమన్నను ఫరవా లేదు. ఇవి అన్నియు మానసికములైన గెలుపులు, ఓటములు. వీని వలన అగునది లేదు. పోవునది లేదు. కొంత ధనము పోయినచో, కుదిరినదన్న సంబంధము చెడినచో విచారించ వలసినదది.

కుమా : మీదంతయు చమత్కారమండీ! ఒకప్పుడు శత్రువుల మీద పడి చీల్చుదురు. ఒకప్పుడు మీ అంతట మీరే లొంగిపోయెదరు. ఆ ఉత్తర రామచరిత్రలోని శ్లోక మేది, మీరు చదువుచుందురే?

ధర్మా : "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి, లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి".

కుమార : నాకు మీరు కూడ అట్లనిపింతురు.

ధర్మా : అదే అన్నాడు దుష్యంతుడు. "సర్వః కాంత మాత్మీయం పశ్యతి" యని. తమవారన్నచో అందరికి నిష్టమే.

కుమార : నేనట్లు చూచుటలేదు. నిష్పాక్షికము గానే చెప్పుచున్నాను.

ధర్మా : నాకు పనియున్నది. నీవు వెళ్ళుము. కూమారస్వామి "రేపు వత్తు" నని వెడలిపోయెను.

ఆనాడు సారంగధర నాటక మనగా కుమారస్వామి వచ్చి ధర్మారావున కొక టిక్కెట్టునిచ్చెను. "మంగమ్మగారు మీకో టిక్కెట్టిమ్మన్నదండి. ఇంక వారమునకొక నాటకముగా వేయుదురట. ఈ నాటకమునకే కాదీ టిక్కెట్టు, అన్ని నాటకము లకు ఉపయోగపడును", అనెను.

ధర్మా : ఈ టిక్కెట్టు జాగ్రత్తగా దాచుకొనుట నాకిది ఒక పనియా?

కుమార : మీ రన్ని నాటకములకును రావచ్చు నని చెప్పుటయే కాని మిమ్ము తరువాత టిక్కెట్టడుగువా రెవ్వరుందురు?

ధర్మ : నేనసలు నాటకమునకు వత్తునో, రానో!

# ఎడ్ల లాగుడు పోటీ గండపెండేరధారి శ్రీ పోతిరెడ్డి

ప్రకాశం జిల్లా, పర్చూరు మండలం, రమణాయపాలెం రైతు శ్రీ ఈదర చింపిరిరెడ్డి – రావమ్మ దంపతులకు 1940లో శ్రీ పోతిరెడ్డి జన్మించారు. 1964లో గుంటూరులో జరిగిన ఎడ్లలాగుడు పోటీలో తమ జత ఎడ్లను ప్రవేశపెట్టి, ఒంటిద్దు, జతఎద్దు ఇసుకలాగుడులో ప్రథమ, ద్వితీయ, బండలాగుడులో ప్రథమ, ఎద్దుబండి బోల్తావేయడం, మర్లా బండిని యధాలాపంగా తీయడం ప్రదర్శనలో ప్రథమ. పెదగొట్టిపాడులో ఒంటిద్దు, జతల ఇసుకలాగుడులోనూ రెండు ప్రథమములు, ఎగ్జిబిషను బహుమతి. ఈ గ్రామంలో మూడు సంవత్సరాలు పోటీల్లో పాల్గొని బహుమతులు నెగ్గారు. గణపవరంలో జరిగిన నాలుగు రాతి చక్రాల బండి మీద ఇసుక బస్తాలు వేసి, దుక్కిమళ్ళో 10 నిముషాల వరకూ జతఎడ్లతో



లాగించి ప్రథమ బహుమతి. అలాగే ఈ పోటీలో 4 సంవత్సరాలు పాల్గొని విజయం సాధించారు రెడ్డిగారు. 1969లో శ్రీ ఎన్. టి. రామారావు నటించిన "పెత్తందార్లు" సినిమాలో వీరిజత నటించి ప్రేక్షకుల మన్ననలు పొందాయి. 1970లో ముప్పై అడుగులు పొడవు, మూడు గజాల నలువలకల వెడల్పు నల్లరాతి ధ్వజస్తంభాన్ని రెండు ఇనుప బళ్ళ మీద వేసి తమగిత్తల జతతో లాగించి ప్రజా మన్ననలు చూరగొన్నారు శ్రీ రెడ్డిగారు. రెండవ జత 1973లో నాగులపాలెం రాతి చక్రాల బండి లాగుడు పోటీలో రెండు సంవత్సరాలు పాల్గొని ఒంటిద్దు, జోడెడ్లుతోనూ లాగించి ప్రథమ, ద్వితీయ, పొన్నూరులో ఒంటిద్దు, జత ఇసుకలాగుడులో రెండు ప్రథమములు. బండ, రాతిచక్రాల బండి లాగుడుతోనూ ప్రథమములు.

1981లో గురుజాల గుంట పాలెంలో రాతిగాళ్ళ ఒంటిద్దు బండిలాగుడులో ప్రథమ, ద్వితీయ. తెనాలి ఒంటిద్దు ఇసుకలో ప్రథమ. నార్నపాడు పోటీలో రెండు సంవత్సరాలు పాల్గొని రాతి చక్రాల ఒంటిద్దు లాగుడులో 4 సైజుల్లో, 4 ప్రథమములు గెల్చుకున్న ఎద్దుకు "ఆంధ్రా టైగర్" అని కమిటీవారు బిరుదు పెట్టారు. జొన్నల గడ్డలో రాతి చక్రాల ఒంటిద్దు లాగుడులో ప్రథమ. ఆ బండిలో 9 పుట్లు ఇసుక బస్తాలు వేసి లాగి రికార్డు నీల్పు. గణపవరం పోటీలో మూడు సంవత్సరాలు ఒంటిద్దుతో రాతి చక్రాల బండిని లాగించి మూడు ప్రథమములు, ఒక ద్వితీయ. జోడెడ్ల రాతి చక్రాల లాగుడులో రెండు సంవత్సరాలు పాల్గొని మూడు ప్రథమములు, ఒక ద్వితీయ, జాక్‌పాట్‌లో ప్రథమ, మరియూ శ్రీ పోతి రెడ్డిగారికి వెండి గండపెండేరం చేతికి తొడిగి సత్కరించారు. తిమ్మాపురంలో రాతి చక్రాల బండి జోడెడ్ల లాగుడులో 4 ప్రథమములు, చిన్న జాక్‌పాట్‌లో ప్రథమ, పెద్ద జాక్‌పాట్‌లో మిగతా జతలు పొడి నేల మీద లాగించేరు. ఆ రాత్రి వర్షం కురవడం వల్ల మర్నాడు ప్రొద్దుట శ్రీ రెడ్డిగారి జతను బురదలో 20 పుట్లు బరువు లాగించి ద్వితీయ. గురజాలగుంట పాలెం రాతి చక్రాల ఒంటిద్దు లాగుడులో ప్రథమ, జోడెడ్ల జాక్‌పాట్‌లో ప్రథమ. మరియూ శ్రీ రెడ్డిగారికి వెయ్యినూట పదహార్లు ఇచ్చి సత్కరించి, గుర్రం మీద ఊరేగించారు.

నాటి నుండి నేటి వరకూ ఎడ్లజతలను పోటీల్లో నేర్పుతో తోలుతూ విజయం పొందుతున్నారు శ్రీ పోతిరెడ్డి.

బొజ్జా సత్యనారాయణ

కుమార మీరు రాక తప్పదు

దర్మా ఏమంత బలవంతము?

కుమార వారి కోసము కాదండీ! నా కోసము నాకు మీ రేమైనను చెప్పవచ్చును గదా!

దర్మా ఏమియు తెలియని పదిమంది దౌర్భాగ్యులకు చెప్పుటకన్న ఒక బుద్ధిమంతునకు చెప్పుటయే మంచిది

కుమార (నవ్వుచు) నేను బుద్ధిమంతుడను గదండి అందుకనియే రమ్మనుచున్నాను నాటి రాత్రి దర్మారావు బయలుదేఱెను

అరుం మంగమ్మ మీకు టిక్కెట్టు పంపించెను కాబోలు ఎదో కథ చెప్పెదరే, అట్లున్నది మీరు చివరికి నాటకములకు కూడ బయలుదేరినచో చెప్పవలసిన దేమున్నది? మొన్న రాత్రి పిల్లవాడు పోరు పెట్టినాడు నేడు మఱల మీరు బయలు దేరుచున్నారు మొన్నటి దొక చిన్న వ్యవహారము గనుక తేలిపోయినది ఈసారి యేదో నాకే కావలయును

దర్మా ఇంగ్లీషువాడు చెప్పినట్లుగా నీవు వట్టి సూపర్‌స్టిషన్ అయిపోవుచున్నావే!

అరుందతి – ధర్మారావు మనసులో పలుచవడుట చూచి బయపడెను నిరంతరము సముద్రమువలె లోతుగానున్న యీయన ప్రకృతి నేడేలొకో మిగుల తేలిక యైనది! అని ఆమె ఊహించి ఆ అర్థమెఱుగలేక పోయెను భర్తను గూర్చి చెడుతలంపామెకు రాదు మఱి దీని కర్థమేమి? అరుందతి అట్లే మౌనముద్ర వహించి చూచుచుండగనే దర్మారావు వెడలిపోయేను అతడు వెళ్ళు వఱకు నాటకపుచావడి అంతయు క్రిక్కిరిసి ఉండెను ద్వారముల వద్ద రకరకముల క్రాసింగువా రధికారము చేయుచుండిరి కుమారస్వామి ధర్మారావు లెట్లో త్రోవజేసికొని లోనికి పోయిరి కూర్చుండుటకు స్థలములేదు కుమారస్వామి యొక స్థలము చూచి, యిరువురును గూర్చుండిరి మచ్చునిసినాటి సముద్రము వలె చావడి మ్రోత పెట్టుచుండెను

కుర్చీల మీద సంఖ్యలు వేసి ఆ ప్రకారముగా సామాజికులు కూర్చుండ వలయు ననిరి ఒక కుర్చీపై ఒకడు కూర్చుండెను ఆ కుర్చీ సంఖ్య గల టికెట్టు వాడు వచ్చి వానిని లెమ్మనెను! వానికి గేదె కొమ్ముల క్రాపింగు, వెడల్పయిన దవుడ యెముకలును, చింత నిప్పుల వంటి కన్నులును గలవు వాడు లేవ ననెను టిక్కెట్టు కొన్నవాడు కాలేజి విద్యార్థి కూర్చున్నవాడు మఱల మాటాడితివా తన్నులు తిందు వనెను విద్యార్థి ద్వారము వద్ద నిలుచున్న వారితో చెప్పెను వారు కూర్చున్న వానిని చూచి యితనితో ఇంకొక చోట కూర్చుండు మనిరి ఆ విద్యార్థి మఱల వాని కడకే పోయి వానిని లెమ్మనగా వాడు కొట్టెను అది పెద్ద అల్లరి అయినది పోలీసువారు వచ్చి సర్ది వేసిరి కాని చోటిప్పించ లేదు ధర్మారా వా విద్యార్థిని తన వద్ద కూర్చుండ బెట్టుకొనెను

విద్యార్థి వాడెవడండీ?

కుమార ఎవడేమిటీ? గవర్నరు జనరలు పోలిసువారు గూడ వానికి బయపడుట చూడలేదా? – విద్యార్థి కేడుపు వచ్చు చుండెను

దర్మా నీ వేక్లాసు?

విద్యార్థి బి ఎ మొదటి సంవత్సరము

దర్మా మీ హాస్టలులో ఇంకెవ్వరును రాలేదా?

విద్యార్థి నేను హాస్టలులో ఉండుట లేదు, ఊరిలో ఉన్నాను అయినను ఇప్పుడు కళాశాల లేదుకదా? నేను చదువుకుందమని యీ ఊరిలో నుంటిని

ధర్మా నీ పేరేమి?

విద్యార్థి తిరుమలరావు

కుమార ాడు రంగడని పెద్ద రౌడీ అంది చలపతి వెళ్ళిన తరువాత ఇతడే ఊరికి పెద్ద – హార్మనీ మ్రోగించుట మొదలు పెట్టిరి విద్యార్థి తన దెబ్బ మఱచిపోయి తెర వంక చూచు చుండెను

కుమార ఈ తెర లెచ్చట నుండి వచ్చెను? బొంబాయి చిత్ర కళతో దేశము సగము పాడయ్యెను ప్రాచ్య చిత్ర కళ తత్సంప్రదాయ వేత్తలకే కాని యితరులకు తెలియుట లేదు ఈ బొంబాయి చిత్ర కళ అయినను, సరిగా తెలియని నాల్గవ రకపు చిత్రకారుల చేత ఈ తెరలు వ్రాయబడినవి

ధర్మా చూచువారి కట్టి చిత్రములు దుష్ట వర్ణ సాంకర్యము వలన, క్రమముగా వారి నేత్రములకు మంచి చెడ్డలు తెలిసికొను శక్తి పోవును

కుమార. ఆ బొమ్మ చూచితిరా? దాని ముక్కంత పొడుగేమి?

తిరుమల దొరసానుల కంతే

దర్మా: దెబ్బ మఱచిపోయి నట్లున్నదే?

తిరు అంతేనండీ? పోలీసు వాండ్రని పేరే కాని, వాండ్రు, వీండ్రు నొకటియే

(ఇంకా ఉంది)

## కష్ట సుఖాలు

ఈ గుండె చెట్టుకు
ఎన్నెన్ని సుఖాలో!
ఎన్నెన్ని కష్టాలో?
పూలై పూచాయి
ముళ్ళై లేచాయి
ఋతు ధర్మంగా
పూచే పూలే
వాడి పోతాయ్
రాలి పోతాయ్
క్షణక్షణం
కలిగే సుఖాల్లాగా!
ఋతువులతో
పని లేకుండా
చెట్టు నంటి –
ఉండేవి ముళ్ళే!
కలకాలం–
వదలని కష్టాల్లాగా!

–వాసాల నరసయ్య

బెంగుళూరులో తెలుగు విజ్ఞాన సమితివారు శ్రీ కృష్ణదేవరాయ కళా మందిర నిర్మాణానికి శంకుస్థాపన చేసిన సందర్భంగా తీసిన చిత్రం శ్రీ రాధాకృష్ణరాజు (తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులు), శ్రీ ఎం వరదరాజు (తెలుగు విజ్ఞాన సమితి విద్యా ట్రస్టు కోశాధికారి), శ్రీ ఎ ఎస్ చిన్నస్వామి రాజు (తెలుగు విజ్ఞాన సమితి విద్యాట్రస్టు చైర్మన్), శ్రీ చెలికాని అన్నారావు (సంస్థాపకాధ్యక్షులు, టి టి డి మాజీ చైర్మన్) తదితరులను ఫోటో లో చూడవచ్చు



# అర్జున అవార్డు గ్రహీతల దుస్థితి

క్రీడారంగంలో ప్రతిభావంతులను గుర్తించి భారత ప్రభుత్వం యిప్పటికి 365 మందికి అర్జున అవార్డుతో గౌరవించింది ఈ సత్కారం పొందిన ప్రతిభా వంతులైన క్రీడాకారులలో 12 మంది ఆంధ్రులు ఉన్నారు కె ఎస్ రావు (ఎడ్వంచర్ స్పోర్ట్సు – 1966), జె పిచ్చయ్య (బాల్ బాడ్మింటన్ –1980) మ అజారుద్దీన్ (క్రికెట్ 1986), టి బలరాం (1962), యూసుఫ్‌ఖాన్ (1966), నయీముద్దీన్ (1970), మ హబీబ్ (1980) ఫుట్‌బాల్ ఆటలో, మీర్ ఖాసీం ఆలీ (టేబుల్ టెన్నీసు 1969), శ్యాంసుందర రావు (వాలీబాల్ 1974), ఎ రమణా రావు (వాలీబాల్ 1977), కామినేని ఈశ్వరరావు (వెయిట్ లిఫ్టింగ్ 1963) సత్కారం పొందిన తెలుగు బిడ్డలు శ్రీమతి జి ముళినీ రెడ్డి (వాలీబాల్ 1973) ఏకైక తెలుగు మహిళా అర్జున అవార్డు గ్రహీత

భారత ప్రభుత్వం నుండి వివిధ క్రీడలలో అర్జున అవార్డు గ్రహీతలు అడ్వంచర్ స్పోర్ట్సు 3 (పు 2, స్త్రీ 1), ఆర్చరీ 1 (స్త్రీ), ఎథలిటిక్స్ 39, (29 పు, 10 స్త్రీ), బాడ్మింటన్ 15 (9 పు, 6 స్త్రీ), బాస్కెట్ బాల్ 14 (13 పు, 1 స్త్రీ), బాల్ బాడ్మింటన్ (5 పు, 1 స్త్రీ), బిలియర్డ్సు 6 (పు), బాడీ బిల్డింగ్ (పు), బాక్సింగ్ 15 (పు), చదరంగం 5 (4 పు, 1 స్త్రీ), క్రికెట్ 25 (21 పు, 4 స్త్రీ), సైకిలింగ్ 3 (1 పు 2 స్త్రీ), డైవింగ్ 1 (స్త్రీ), ఈక్విస్ట్రియన్ 5 (పు), ఫుట్‌బాల్ 16 (15 పు 1 స్త్రీ), గాల్ఫ్ 8 (6 పు 2స్త్రీ), జిమ్నాస్టిక్స్ 3 (2 పు, 1 స్త్రీ), హాకీ 34 (22 పు, 12 స్త్రీ), కబాడీ 7 (3 పు, 4 స్త్రీ), ఖో –ఖో 12 (6 పు, 6 స్త్రీ), లాన్ టెన్నీసు 8 (7 పు, 1 స్త్రీ), మౌంటనీరింగ్ 27 (23 పు, 4 స్త్రీ), పోలో 5 (పు), పవర్ లిఫ్టింగ్ 2 (పు), రోయింగ్ 2 (పు), షూటింగ్ 11 (8 పు, 3 స్త్రీ), స్నూకర్ 2 (పు), స్క్వాష్ 4 (3పు, 1 స్త్రీ), స్విమ్మింగ్ 13 (9 పు, 4 స్త్రీ), టేబుల్ టెన్నిస్ 13 (9పు, 4 స్త్రీ), వాలీబాల్ 15 (12 పు, 3 స్త్రీ), వెయిట్ లిఫ్టింగ్ 20 (19 పు, 1 స్త్రీ), కుస్తీ 15 (పు), యాటింగ్ 7 (పు), ఎథలిటిక్స్‌లో 39, హాకీలో 34, క్రికెట్‌లో 25, మౌంటెనీరింగ్ 27, వెయిట్ లిఫ్టింగ్ 20 అత్యధిక అర్జున బహుమతి గ్రహీతలు కలరు విలువిద్యలో ఒకే ఒక మహిళ యుండగా, పురుషులకు యింతవరకు గుర్తింపు లభించలేదు



అర్జున అవార్డు

మనదేశంలో ప్రతి ఏట ప్రతిభా వంతులైన క్రీడాకారులను గుర్తించి అర్జున అవార్డుతో గౌరవించాలి అనే ఆలోచన కలిగి 1961 నుండి అమలులోనికి వచ్చినది ఇట్టి ప్రోత్సాహం వలన క్రీడాభివృద్ధి జరుగునని మన క్రీడాబుద్ధి జీవులు ఆశించారు

1961లో అర్జున అవార్డులు బహూకరించినప్పుడు ప్రవేశపెట్టబడిన నిబంధనములనుసరించి వివిద క్రీడలలో గల జాతీయ సమాఖ్యలు ఉత్తమ క్రీడాకారుల జాబితా ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్‌నకు సమర్పించాలి జాతీయ ఒలింపిక్ సమాఖ్య జాబితాలను పరిశీలించి కేంద్ర ప్రభుత్వానికి పంపుతుంది జాతీయ క్రీడా సమాఖ్యలు, ఒలింపిక్ సమాఖ్యలలో ఉత్తమ క్రీడాకారుల ఎంపికలో అనేక ఒత్తిడిలు ఉంటాయి అంతేగాక జాతీయ, రాష్ట్ర క్రీడా సమాఖ్యలలో అనేక మనస్పర్థలు కలవు ఇక కేంద్ర ప్రభుత్వము జాబితా అందగానే రాజకీయ వేత్తల బల ప్రదర్శన మొదలు అవుతూంది ఆఖరికి తుది జాబితా ప్రకటించేటప్పటికి అర్హులు అయియుండి, జాతీయ సమాఖ్యల్లో, కేంద్ర ప్రభుత్వములో పలుకుబడి లేని వారి పేర్లు మాయమవుతాయి ప్రతిబ లేని వారు కొందరు అర్జున అవార్డు గ్రహీతలు అవుతారు

ఇంతకు అర్జున అవార్డు గ్రహీతలకు లభించేది తృప్తి ఒక్కటే కేంద్ర ప్రబుత్వము తమ ప్రతిభని గుర్తించి సత్కరించినది అనే ఆనందం అర్జున అవార్డు గ్రహీతలకు రాష్ట్రపతి స్వయముగా రాష్ట్రపతి బవన్ దర్బార్ హాలుతో కాంస్య విల్లు పట్టుకొన్న అర్జున బొమ్మ, బ్లేజర్ (ఉన్నికోటు), టై దక్కుతాయి కోటు, టైపై అర్జున అవార్డు గ్రహీత అని ఉంటాయి కొద్ది ఏళ్ళ నుండి గ్రహీతలకు రూ 5000/– నగదు పారితోషికం యిస్తున్నారు అగ్రగామి క్రీడాకారులకు యీ బహుమతి వలన

బజ్జీలు అమ్ముకుంటూ బతుకుని వెళ్ళదీస్తున్న అర్జున అవార్డు (కుస్తీ) గ్రహీత మాల్వా



బాల్‌బాడ్‌మింటన్ అర్జున్ అవార్డు గ్రహీత పిచ్చయ్య



# అర్జున అవార్డు గ్రహీతల దుస్థితి

కొద్ది సేపు మినహాయించి ఢిల్లీలో రాష్ట్రపతి భవన్ నుండి బయటికి అర్జున అవార్డుతో వచ్చిన ఎవరు పలుకరించరు.

వృద్ధాప్యములో జీవితము గడవక తాము సాధించిన స్వర్ణ, రజిత పతకములు అమ్ముటకు వెళ్ళినా కొనేవారు యుండరు. ఎందుకంటే వాటిలో ఉండే బంగారు, వెండి చాలా తక్కువ. అర్జున అవార్డు చూసి ఎవరు అప్పుకూడా యివ్వరు.

ఇటీవల ప్రముఖ ఆంగ్ల క్రీడా పత్రిక 'స్పోర్ట్స్ వరల్డ్' (ఆనంద బజార్ పత్రిక గ్రూపు, కలకత్తా) విలేఖరి కొందరు అర్జున అవార్డు గ్రహీతలను కలుసుకోగా వారిలో ఎక్కువ అసంతృప్తి కనిపించినది. ముఖ్యముగా ఆసియా క్రీడలలో స్వర్ణ పతకము సాధించిన మల్ల యోధుడు మూల్‌చంద్ మాల్వా దుస్థితి కన్నీరు తెప్పించినది. ఢిల్లీలో జహంగీర్ పురిలో అతి బీదస్థితిలో యున్నాడు.

జీవితములో ఎటువంటి మార్పు యుండదు. కనీసము రు. 25,000/- నగదు బహుమతి, నెలనెలా పెన్షను యివ్వాలి అని కొందరు క్రీడాకారుల కోరిక. క్రికెట్, టెన్నిసులలో అగ్రగాములకు వారు పాల్గొన్న పోటీల వలన బాగా ఆదాయం దక్కుతుంది. అందువలన వారి జీవిత శేషంలో ఎటువంటి కష్టాలు యుండవు. కాని మల్లయోధులు, వెయిట్ లిఫ్టింగ్, ఫుట్‌బాల్, హాకీ, టేబుల్ టెన్నీసు, ఈత, కబాడీ, ఖో-ఖో మొదలగు క్రీడాకారులకు పోటీల వలన ఎక్కువ ఆదాయము దక్కదు. క్రీడా పోటీల నుండి విరమించుకొన్న తర్వాత వారి గురించి ఆలోచించే వాడు ఉండరు. యవ్వనములో వారి ప్రతిభను కొనియాడిన ప్రజలు, పత్రికలు, కనీసము క్రీడా సమాఖ్యలకు గుర్తు యుండరు. వృద్ధాప్యములో పలుకరించేవారు అరుదు. కనీసము టీ నీళ్ళు అడిగినా యిచ్చేవారు యుండరు. పోటీలు తిలకించుటకు టికెట్టు కొనగల స్థితిలో వారు లేరు. ఉచితముగా ప్రవేశము యివ్వరు. మరి యీ అర్జున అవార్డు విలువ ఏమిటి? బహుమతి అందుకున్న అతను సాధించిన విజయాలు, అర్జున అవార్డు వల్ల అతని జీవితంలో సుఖములేదు.

విదేశాలలో క్రీడాకారుల ప్రతిభ, గుర్తించినప్పుడు, వారు సాధించిన విజయాలకు ప్రతిఫలముగా వారు వృద్ధాప్యములో ఎటువంటి కష్టము లేకుండా జీవించుటకు అన్ని సౌకర్యములు, ఇల్లు, పొలము, పెన్షన్ ఏర్పాట్లు కలవు. యవ్వనములో వారు త్యాగము చేసి, సుఖ సౌకర్యాలు వదులుకొని దేశానికి అంతర్జాతీయ క్రీడారంగములో సాధించి యిచ్చిన గౌరవమునకు ప్రతిఫలము వారు ఆనంద జీవితము గడుపుటకు ఆదేశ ప్రభుత్వము, మార్గము ఏర్పాటు చేస్తున్నారు. మన దేశంలో మొక్కుబడిగా యిచ్చే యీ అవార్డులు, సన్మానాల వలన విజేతలకు భవిష్యత్తులో ఎటువంటి లాభము కలగటం లేదు. అందుకే అర్జున అవార్డు గ్రహీతలు మార్పు కోరుతున్నారు. వారి కోరికలని ప్రభుత్వము ఆలోచించాలి.

అలాగే ఉత్తమ కోచ్‌లకు యిచ్చే 'ద్రోణాచార్య' అవార్డు కూడా అసంతృప్తే మిగిల్చింది.

—ముకరమ్

## ఉత్తరాలు

### సీరియల్స్

కొత్త సీరియల్ చల్లా గారి "పవిత్రపాపి" చాల థ్రిల్లింగ్‌గా వుంది. "ఈతరం యువతి" ముగింపు బాగుంది.

—ఎల్. వి. సుబ్బయ్య, పద్మావతి,
కె. ప్రేమామణి, గూడూరు

* * *

చల్లా సుబ్రహ్మణ్యంగారి "పవిత్రపాపి" చక్కని శైలిలో సాగి సరికొత్త ఒరవడితో మొదటి వారంలోనే మంచి యింట్రస్టింగ్‌గా వుంది.

—ఎం. నాగేంద్రప్రసాద్, సూర్యప్రకాశరావు,
రామరాజులంక

* * *

మా అభిమాన రచయిత "చల్లా సుబ్రహ్మణ్యం" గారి కలంనుంచి జాలువారిన "పవిత్రపాపి" మమ్ములను మొదట్లో ఆకట్టుకున్నది. ఈ సీరియల్ లోని 'హీరో' అయిన 'రాకా' ముందు ముందు ఎలా సాగుతాడో సస్పెన్స్‌గాఉంది. చల్లా సుబ్రహ్మణ్యం గారికి మా ప్రత్యేక అభినందనలు. "వినాయకరావు పెళ్ళి" కూడా చాలా బాగున్నది.

—సీత, అన్నపూర్ణ, హైమ కోటేశ్వరి,
రస్న, పెనుగంచిప్రోలు

* * *

శ్రీ చల్లాసుబ్రహ్మణ్యం గారి రచన "పవిత్రపాపి" ప్రారంభ సంచిక ఎంతో థ్రిల్లింగ్‌గా ఉన్నది. ప్రభుత్వ దృష్టిలో "రాకా" నేరస్తుడే కావచ్చు. పోలీసుల చేతకాని పనిని రాకా చేసి, రౌడీలను, బందిపోటు దొంగలను, సంహరించి ప్రజలకు మేలు

( 7 వ పేజీ తరువాయి)

చేశాడు. వృద్ధాప్య పెన్షన్‌లలో జాప్యం చేసి, ఎం. ఆర్. ఓ, కలెక్టర్లతో పెన్షన్‌లు ఇప్పిస్తాడు. పిల్లల సొమ్ము అరగించే, హాస్టల్ వార్డన్‌లను, సక్రమమార్గంలో ఉంచుతాడు. నిత్యావసర వస్తువుల పంపిణీ సక్రమంగా పంపిణీ చేయిస్తాడు. మోసగాళ్లను దుర్మార్గులను "రాకా" శిక్షిస్తాడు.

అటువంటి రాకాని జస్టిస్ కూతురు ప్రేమించుట. బ్లూనైల్‌లో వారి ప్రక్కనే కూర్చొని, పోలీసుల కండ్లుకప్పి పారిపోయిన రాకా చర్యలు అద్భుతంగా ఉత్సాహంగా వుంటూ, చదువరులను ఎంతో ఆకర్షిస్తోంది.

—జి. కృష్ణారావు, వెలుగోడు(కర్నూలు)

* * *

"మరోమలుపు" సీరియల్ చాలా ఇంట్రస్టింగ్‌గా ఉన్నది.

—అర్వపల్లి ఆంజనేయులు,
రాజ్యలక్ష్మి, ఖమ్మం

* * *

"వినాయకరావు పెళ్ళి" చాలా బాగుంది. మల్లాది వెంకటకృష్ణ మూర్తిగార్కి మా ధన్యవాదాలు.

—పి. ధర్మయ్యశాస్త్రి, అన్నవరం

* * *

హాస్య సీరియల్ 'వినాయకరావు పెళ్ళి' మాకు ఎంతో నచ్చింది.—ఓ. అహల్య, ఓ. మైథిలీ, వెంకటగిరి

### కథలు

'భానుప్రియ' ముఖచిత్రంతో నయనానందకరంగా వెలువడిన సంచికలో 'సరదా కిమ్మత్తు' కథ నేటి రాజకీయనాయకుల నిజస్వరూపాన్ని బయట పెట్టింది. తమనాయకుని సమక్షంలో ఒకలాగ, పరోక్షంలో మరోలాగ మాట్లాడే రాజకీయ పెద్దమనుషులకు ఈ కథ ఒక చక్కని గుణపాఠం. ప్రయోజన కరమైన ఇంతమంచి కథను అందించిన జంటరచయితలు శ్రీ సర్వేశ్వర శర్మ, శ్రీ సోమయాజులు అభినందనీయులు.

—వక్కలంక రామారావు, అనపర్తి

### వ్యాసాలు

25.3.88 సంచికలో ఆశావాది "తమస్సు తగ్గదా?" అను శీర్షికతో వ్రాసిన వ్యాసము విదేశీ తొత్తు శక్తుల ఆగడాలను, అక్రమాలను సర్వకాల సర్వావస్థలలో సమర్థించుటకు విఫల ప్రయత్నంగా వున్నది. అన్ని భారత రాజకీయ పార్టీల అధినేతలు అగ్ర వర్ణాలవారేనని పేరు పేరునా తెలిపి "రెండు కమ్యూనిస్టు పార్టీల ప్రధాన నాయకులు ద్విజేతరులని తోస్తుంది", అని పక్షపాతంతో సెలవిచ్చారు. భా. క. పా (మా) నాయకుడు ఇ. యమ్. ఎస్. నంబూద్రిపాద్ ఉత్తమోత్తమ బ్రాహ్మణ కుల సంజాతుడు, ఆదిశంకరుని వంశానికి చెందినవాడు. భా. క. పా. నాయకుడు శ్రీ చంద్ర రాజేశ్వరరావు గారు అగ్రవర్ణమైన 'కమ్మ' కులానికి చెందినవారని రచయితకు దయచేసి తెలుపవలసినదిగా ప్రార్థించుచున్నాను.

— రాయ వేంకటేశ్వరరావు, నెల్లూరు ☐

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

# నేను సింథాల్ వాడతాను. మరి మీరో?




సింథాల్ యొక్క అద్వితీయమైన టి సి సి గల దుర్గంధనాశక ఫార్ములా, శరీరం నుంచి దుర్గంధం రాకుండా నివారించి మీకు శరీరం విషయంలో ఆత్మవిశ్వాసాన్నిస్తుంది.



**శరీరం గురించిన ఆత్మవిశ్వాసం వినోద్ కైవసం-సింథాల్**

తిరుమల రామచంద్ర

# అనువాదం కాదు, అనుసృష్టి

రాష్ట్ర తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి శ్రీ రఘువీర్ గారిని సన్మానించడానికి సురభారతీ సమితి ఫిబ్రవరి 29న సిటీ సెంట్రల్ లైబ్రరీలో జరిపిన సమావేశంలో శ్రీ రఘువీర్ చేసిన కొన్ని వ్యాఖ్యలు కొందరికి కష్టం కలిగించాయి. ఆనాటి సభకు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి అధ్యక్షత వహించారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు ప్రారంభించారు. డాక్టర్ రత్న శ్రీహరి రచించిన తెలుగు కవుల సంస్కృతానుకరణ, సంస్కృత సూక్తులు అనే గ్రంథాలను శ్రీ రఘువీర్ ఆవిష్కరించారు. ఆ సందర్భంలో అయన ప్రసంగిస్తూ సంస్కృత భాషకంటె తమిళ భాష ప్రాచీన మన్నారు వేదం కన్న తమిళంలో ప్రాచీన సాహిత్యం ఉందన్నారు. వీటికి ప్రమాణాలు చూపితే బాగుండేది. సాక్ష్యాధారాలతోనే కదా న్యాయమూర్తులు తీర్పులు చెబుతారు! తెలుగు సాహిత్యమంతా సంస్కృతానుకరణమని, అనుకరణతోనే మొదలయిందని అన్నారు. నన్నయ, తిక్కనలను చప్పరించి పారేశారు. నన్నయ గాని, తిక్కన గాని స్వతంత్రంగా రచన చేయలేక కాదు వాళ్ళు బహుభాషా కోవిదులు, బహుభాషా కవితా విశారదులూను. భారతాన్ని వ్యాసుడు

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
అధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
ఐతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

రచించాడు. దానిని ఆంధ్రదేశ పరిసర భాషలవారు తమ ఇచ్చ వచ్చినట్లు వ్రాశారు, వ్రాస్తున్నారు. ఆ గొప్పగ్రంథం తెలుగు వారికి తెలియాలి, దానివల్ల తెలుగుజాతి మేలు, శ్రేయస్సు పొందాలి అనే దృష్టితో జగద్ధితంబుగా నన్నయ భారత రచనకు పూనుకున్నాడు. డాక్టర్ కేసూర్ ప్రాచీనుల అనువాదాలను అనుసృష్టి (ట్రాన్స్‌క్రియేషన్) అన్నారు. కనుక నన్నయాదుల భారతాదులు. అనువాదాలు కావు, అనుసృష్టులు.

వివిధోత్తుంగ తరంగ ఘట్టన చల
ద్వేలా వనైలవతీ
లవలీలుంగల వంగ సంతత లతా
లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచిరంత నెదురన్
తత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేన పుంజ నిభున
య్యశ్వోత్తమున్ దవ్వులన్.

ఈ పద్యం ఆదిపర్వంలోని కొన్ని శ్లోకాల అనుసృష్టి. కద్రూవినతలు గుర్రం చూచిన ఘట్టం. ఇదేకాదు ఏ పద్యం చూచినా నవ్యసుందరంగా మౌలిక మధురంగా ఉంటుంది. భారత దేశపు చివరి గవర్నర్ జనరల్, తొలి భారతీయ గవర్నర్ జనరల్ శ్రీ సి. రాజగోపాలాచారి రామాయణ భారతాలను అనువదించినట్లే భాగవతాను వాదమూ చేశారు. ఆయనకు తెలుగువచ్చు. పోతన భాగవతమూ పక్కన పెట్టుకున్నారట, అనువాదసమయంలో. సందేహాలు వస్తే పక్క వీధిలో వున్న శ్రీ యామిజాల పద్మనాభస్వామిని అడిగే వారట. ఒక ఘట్టం అనువదిస్తున్నారు. దానికి తెలుగు ఏముంద్రో అని చూచారు.

క: – లోకంబులు లోకేశులు,
లోకస్థులుఁ దెగినఁదుదిని లోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం,
డేకాకృతి వెలుగు నతని నేసేవింతున్.

(భాగవతం – అష్టమస్కంధం – 75 పద్యం)

.. అని వుంది.

నాలుగైదు శ్లోకాలను కుదించి పోతన చేసి రచనకు ఆశ్చర్యపడి దానినే మననం చేస్తూ వుండ పోయారట. కనుక, అవి పట్టి కొర్టు దస్తావేజుల అనువాదాల వంటివికావు. అనుసృష్టులు.



త్యాగరాజ గాన సభలో ఫిబ్రవరి 27న జరిగిన సురభి బాలవిహార్ వార్షికోత్సవంలో భగవద్గీత శ్లోకాన్ని వివరిస్తున్న సి. ఉదయన (3వ తరగతి)

## సురభి బాలవిహార్ వార్షికోత్సవం

భారతీయ సంస్కృతి ప్రచార ప్రసారాలు పరమధ్యేయంగా స్థాపిత మైన గాంధీనగర్‌లోని సురభి బాలవిహార్ ఉన్నత పాఠశాల వార్షికోత్సవం ఫిబ్రవరి 27న త్యాగరాజ గానసభలో వైభవోపేతంగా జరిగింది. రాష్ట్ర విద్యా శాఖామంత్రి శ్రీ ఇంద్రారెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసి పిల్లల సాంస్కృతిక కార్యక్రమాలను తిలకించి ఆశీర్వదించారు. ప్రైవేటు పాఠశాలల విషయంలో ప్రభుత్వం ఎలాటి జోక్యమూ చేసుకోడం లేదని, అంత మాత్రాన ప్రైవేటు విద్యాసంస్థలు విచ్చలవిడిగా ప్రవర్తించక న్యాయంగా ప్రవర్తించాలని కోరారు. విద్యార్థులు లంబాడీ నృత్యం, భాంగ్రా నృత్యం, వెల్కండ్యాన్స్, యశోదాకృష్ణ నృత్యం, భామా కలాపం చక్కగా నిర్వహించి ప్రేక్షకుల అభినందనలకు పాత్రమయ్యారు. భగవద్గీత పఠనం, ఆంగ్లంలో దాని వివరణ చాల బాగుంది. విద్యార్థుల ఉచ్చారణ, అర్థ వివరణ చాల ముచ్చట గొలిపాయి. నృత్యాలలో శ్రీధర్, శీతల్, సి. ఉదయన, ఫల్గున మొదలయిన 1–10 తరగతుల వారు పాల్గొన్నారు. భగవద్గీత పఠనంలో జగదీశ్, సి. ఉదయన, స్వప్న, మాధురి, కుమార్, రోహిణి మున్నగు వారు పాల్గొన్నారు.

## తెలుగు విశ్వవిద్యాలయానికి. యూ. జి. సి. ఆర్థిక పరిగణన :

తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ తూమాటి దోణప్ప మార్చి 16న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగిస్తూ, తెలుగు విశ్వవిద్యాలయానికి యు జి సి ఆర్థిక పరిగణన ఇక ఐదారు నెలలలో రాగలదని అన్నారు. యు జి సి తమకు కొన్ని ప్రశ్నలు పంపిందని, రిజిస్ట్రారు త్వరలో ఢిల్లీకి వెళ్లి ఆ